# ఆ స్వచ్ఛమైన మనోహరమైన తెల్ల తనానికి

LION BRAND
VICTORIA BLUE OOB
(Best Ultramarine)
MADE IN INDIA WITH WEST GERMAN COLLABORATION BY
ULTRAMARINE & PIGMENTS LIMITED AMBATTUR MADRAS 53

లయన్ బ్రాండ్

## విక్టోరియా
## బ్లూ ఒ ఒ బి (OOB)

(ప్రశస్తమైన ముదురు నీలం)

అవును, కొంచెం విక్టోరియా బ్లూ ఒఒబి మీ తెల్ల బట్టలకు అద్భుతమైన ప్రత్యేకత నిస్తుంది! వాటికి మిరుమిట్లు కొలిపే తెల్ల తనాన్ని చేకూర్చుతుంది. మీ చొక్కాలకు, చీరెలకు, దుప్పట్లకు అటివచ్చే విధంగా అదనపు తెలుపునిచ్చే పద్ధతి!



తయారుచేయువారు: అల్ట్రామరైన్ అండ్ పిగ్మెంట్స్ లిమిటెడ్ అంబత్తూర్, మద్రాస్-53.

హోల్ సెల్లింగ్ ఏజంట్సు: కెంమ్ డైన్ ట్రేడింగ్ కంపెనీ, 318, లింగి చెట్టి స్ట్రీట్, మద్రాసు-1.

VAPI. UP: 2/68 TEL

కుటుంబంలో ప్రతి ఒక్కరు తప్పక చూడవలసిన చక్కని చక్కని కథ!

SARMA / V.S

వీనస్ పద్మినీ కంబైన్స్



# లక్ష్మీనివాసం



దర్శకత్వం: వి. మధుసూదనరావు

నిర్మాత: టి. గోవిందరాజన్

మాటలు: ఆరుద్ర * సంగీతం: కె.వి. మహదేవన్ * కెమెరా: వి. రామమూర్తి * కథ: యస్. కృష్ణారావు

అజిత్ ప్రభాస్. నవయుగ విడుదల

NVKR

### గమనిక

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ కింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తి పేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి. 5. సిరాతోనే రాయాలి. —సం॥



# ఉత్తరాలు

## కథలు

ది 27—6—68తేదీ గల పత్రికలో అరిగే రామారావుగారి భార్యాభర్తలెలావుండాలి అను కథ బావుంది.

ఆ కథ వుపోద్ఘాతములో రామారావుగారు ఇంతకుపూర్వం తాము రాసి పత్రికలో ప్రచురించిన భర్తలెలా వుండాలి మరియు భార్యలెలా వుండాలి—కథలకి ఆధారమేమిటో తెలుసా?అని ప్రశ్నచేసి ఆ వస్తుసామగ్రికి తమ స్వర్గసీమ కారణమని సెలవిచ్చేరు. శెభాష్!

అయితే వారు రచించిన భర్తలెలా వుండాలి అన్న కథా, ప్రఖ్యాత కథానికా రచయిత ఓ. హెన్రీ రాసిన 'ఏ హార్లెం ట్రాజెడీ' అన్న ఆంగ్లకథా అచ్చుగుద్దినట్టు ఒకేలావున్నాయి. ఇద్దర్లో ముందెవరు రాశారు అన్నది పరిశోధనకి వదిలేస్తే, ఓ. హెన్రీ కూడా వస్తుసామగ్రి తన స్వర్గసీమనుంచే సేకరించేవుంటే..., మనరామారావుగార్ని ఓ. హెన్రీ ప్రక్కన పీటవేసి కూర్చోపెట్టాలని నా కోరిక.

అనుమానమయితే నాదగ్గర ఆ పుస్తకం వుంది బుజువు పర్చగలను.

కుమారి కె. శారదారాణి, (విజయవాడ)

## జవాబు

ఓ. హెన్రీ కథలు నేను ఏనాడూ చదివి వుండలేదు, విని వుండలేదు.

'భర్తలెలా వుండాలి?' అనే నా కథకు మూలము నా స్వానుభవక్షేత్రంలో పండిన పంటే!

మానవుల అనుభవాలలోని సాదృశ్యతకు నేను బాధ్యుడ్నికాను.

అరిగే రామారావు, (విజయవాడ)

*   *   *

5—7—68 తేది ఆంధ్రపత్రిక ముఖచిత్రం నటి రమాప్రభ చూడ ఆకర్షణీయంగా వుంది. ముఖ్యంగా కథలలో శ్రీధర రాధికా కృష్ణగారు వ్రాసిన అంతఃకరణ' అనే కథ చాలా చక్కగా వుంది. ఆ కథలో ప్రస్తుతం జరుగుతున్న నిజాన్ని రుజువు చేసింది. మరియు సీరియల్స్, రాగమయి, మొదలిపాదలు గూడ బాగున్నవనుటలో సందేహము లేదు.

కుమారి దూసి అలివేలు, (శ్రీకాకుళం)

*   *   *

28—6—68 వ తేదీగల వారపత్రికలో "భార్యభర్తలు ఎలా వుండాలి" అనే వ్యాసం అంతా సహజంగా ఉన్నది. గాని "దిండుమీాది కన్నీళ్ళను పెదిమలతో తాకాను" అన్నది అసహజంగా ఉన్నది. చేతితో తాకితే వేడి, చల్లన తెలుస్తుంది. పెదిమలతో తాకితే రుచి తెలుస్తుంది. అది మినహా అంతా ఎంతో సహజంగా బాగా ఉన్నది—

దేవులపల్లి తాండవ శివశాస్త్రి, (శింగరాయపాలెం)

*   *   *

శ్రీ వేమకోటి సీతారామశాస్త్రిగారి కథానిక "ఆశాకిరణం" చాలా గొప్పగా వుంది. నన్నెంతో కదిలించి వేసింది. వాస్తవానికి యిలాంటి కథలు, యితర భాషల్లోకి అనువదింపబడాలి. అప్పుడే తెలుగు కథలకు గొప్పదనం తెలుస్తుంది. ధర్మపథం శీర్షిక బాగుంది. ప్రాచీన ఆయుధాల మీద వ్యాసం చాలా బాగుంది.

శ్రీమతి నీరజారామచంద్రన్, (విజయనగరం)

*   *   *

శ్రీ వేమకోటి సీతారామశాస్త్రిగారి కథానిక "ఆశాకిరణం" చాలా బాగుంది. జీవితాన్ని గొప్ప మలుపులతో, వుదాత్తమైన భావనా శిల్పంతో మలచిన ఈ కథానిక, ఉత్తమ కథానికలలో ఒకటిగా పరిగణింపడానికి యేమాత్రం సందేహం లేదు.

కుమారి, జి. చంద్రమవులి, జి. రామచంద్ర, (విశాఖపట్నము)

## సీరియల్స్

5—7—68 తేదీ ఆంధ్ర సచిత్ర వార పత్రిక "ఉత్తరాలు" శీర్షికలో శ్రీ మేకా రామచంద్రరావు (సికింద్రాబాదు) గారు "రాగమయి" సీరియల్ గురించి వ్రాస్తూ "హైదరాబాదులో ఎస్. ఎస్. ఎల్. సి. వుండదన్న విషయాన్ని రచయిత్రి గమనించ ప్రార్థన" అని వ్రాశారు.

నిజానికి హైదరాబాదులోని గవర్నమెంటు మల్టీపర్పస్ హైస్కూలు (నాంపల్లి)లో ఎప్పటి నుండియో ఎస్. ఎస్. ఎల్. సి. ఉన్నది. దానికి. నేను 1959 సంవత్సరములో ఆ స్కూలునుండే ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్ష పాసగుట నిదర్శనము.

జి. వి. తలం, (తిరుపతి)

*   *   *

మీరు ప్రచురిస్తున్న 'రాగమయి'లోని భానుమతి పాత్ర నిజంగా రాగమయి, అనురాగమయి. సందేహం లేదు. ఎక్కడో రాజస్థాన్‌లో నుంటూ ఇంత తీయని తెలుగు శైలిలో రచన సాగిస్తున్న రచయిత్రిగారిని మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను. భానుమతి పాత్రను సజీవంగా మలచి పాఠకుని హృదయ సీమలో ప్రతిష్ఠ చేసారు రచయిత్రిగారు.

కళ్ళకు కట్లు విప్పమని డాక్టరుగారు డాక్టర్ సారధిని ఆదేశించటం మరీ బాగుంది. బావమరిదికదా అని కాకుండా 'డాక్టరు'అనే భావంతో ఆబాధ్యత వప్పగించారు. ఆ బాధ్యత మామూలుగా ఆస్పత్రిలో జరిగే విధంగా 'సిస్టర్'కు అప్పగించి ఉంటే ఇంత నిండుతనం వచ్చేది కాదేమో!

భానుమతి నా కళ్ళముందు ఇంకా మెదులుతూనే ఉంది. 'మరపురానికథ' అత్యుత్తమంగా ఉంది. కవితా శిల్పం బాగా కన్పించింది.

పాలగుమ్మి పుండరీకాక్షుడు, (విశాఖ)

## ముఖచిత్రం

ఈ వారము (12—7—68) పత్రిక యొక్క ముఖచిత్రము, మిస్ ఇండియా (1968) సుస్మితా సేన్‌ని చూడగానే నాకు ఎంతో ఆనందము కలిగినది. పత్రికనందలి కథలు చదివినప్పుడు, మధ్య మధ్య ముఖచిత్రమును చూచెడివాడను. నా స్నేహి

తుడుగు వి. వి. రమణగారు కూడా అలాగే చెప్పారు. వేమకోటి సీతారామశాస్త్రి వ్రాసిన 'ఆశాకిరణము' చాల బాగుంది. రచయితకు నా అభివందనములు.

బలివాడ ఆనందరావు, (కటక్)

శేఖా వాణి

సినిమానటి వాణిశ్రీ గారి సమాధానాలు ముక్కుకు సూటిగా ఉన్నాయి.

ఆనందసాహు, (శ్రీకాకుళం)

* * *

## ఉత్తరాలు

### సవరణ

ది 5—7—68 సంచికలో ప్రచురితమైన పూ కథ మరపురాని కథలోని అమ్మాయి పేరు 'సునీత'. చివరలో సునీత అని ఉండవల్సినచోట 'సప్న' అని పడింది. సహృదయ పాఠకులు ఈ పొరపాటును గ్రహిస్తారని ఆశిస్తాను.

కె. విజయమారుతి, (మచిలీపట్టణం).






# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 26—7—'68
కీలకనామ సం॥ శ్రావణ మాసం శు॥ పాడ్యమి

సంపుటము : 60 సంచిక : 47

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
4, తంబుచెట్టి వీధి, మద్రాసు-1


పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 26.00 |
| 6 మాసముల చందా | 13.00 |
| 3 మాసముల చందా | 6.50 |

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : 'ముద్దుపాప'లో దేవి రాణి


కథలు :

ఆడమనసులు మగమనిషి — 18
పరమ పద సోపానము — 32

సీరియల్ నవలలు:

రాగమయి — 26
మొగలి పొదలు — 44

శీర్షికలు, వ్యాసాలు, సినిమా:

ఉత్తరాలు — 2, ఊమెన్ కార్టూన్ — 5, మ్యాడిల్లీలేఖ — 6, ఒకవారం వివరీతం — 8, మహీధరోక్తులు — 10, బృహత్ కథామంజరి— 12, ప్రశ్నావళి — 14, చర్చ — 15, వార ఫలం — 24, ధర్మపథం — 31, అరుణాచల ఋషి — రమణమహర్షి — 40, పిల్లలా వాళ్ళు....?, డాక్టర్ కబుర్లు — 42, మన దేశంలో లిపి ఎప్పుడు పుట్టింది? — 43, మీరు పుట్టిన ఇంగ్లీషు తేదీననుసరించి మీ స్వభావం? మీ మిత్రులు? — 50, రంగుల రాట్నం — 51, ఆతచిత్ర సుందరి నటి జమున— 53, సినిమా — 56, మీకుతెలుసా ? — 58, సినిమాన్యూస్ — 60, పరిచయం — 62, ఆటలు, పోటీలు — 63.


ఒకే అమ్మాయికి చాలా మంది ప్రేమికులుంటే ఎంత బాగుంటుంది?


అమెరికా గురించి మీకు బాగా తెలుసను కుంటా.?
పాకిస్తాన్ కి రక్షా ఆయుధాలు


కేరళలో వరదలు
- వార్త
కేరళ మంత్రివర్గం
అంతః కలహాలు


మద్యనిషేధం మీద ఖర్చు పెట్టడానికి చాలా వుంది?
మాగతేమిటి?

# పాకిస్తాన్ కి రష్యా ఆయుధసహాయం

రాష్ట్రపతి డా. జకీర్ హుసెయిన్ రష్యా పర్యటించటానికి వెళ్ళారు. అక్కడ ఆయనకి స్వాగతం పలికిన ఫిరంగులు శ్రీమతి గాంధీ ప్రభుత్వాన్ని మేలుకొలిపాయి, అనవచ్చు. పాకిస్తాన్ విషయమయి కలిగిన మత్తు కాస్తా వదిలిపోయే అవకాశం కలిగింది. రష్యా పాకిస్తాన్‌కికూడా ఆయుధాలు సరఫరా చెయ్యబోతున్నదన్న సంగతి తెలిసి రాబోతోంది. 'మత్తు' అన్నమాట వాడినా తప్పులేదు. అది 'వోడ్కామత్తు'అని కూడా అనవచ్చు. ఎందుకంటే, ఒక సంవత్సరంగా శ్రీమతి గాంధీ ఆంతరంగికవర్గం బాగా రష్యన్ ప్రభావంకింద ఉంది. కొంత కాలం క్రిందట ఆమెని ఒక ఆర్థిక పత్రికా సంపాదకుడు ఒక ప్రశ్న అడిగారు—ఏదయినా పారిశ్రామిక ప్రతిపాదన వచ్చినప్పుడు ఆమె 'అది ప్రభుత్వరంగంలో ఎందుకు లేదనీ, రష్యన్ల సహకారంతో ఎందుకు జరగటం లేదని అడుగుతున్నారు. ఎందుకు?' అని. ఆమె అప్పుడు, పారిశ్రామికాభివృద్ధి ఎగుడు దిగుడు లేకుండా సమానంగా జరగాలని [illegible] మన్నారు. [illegible] ఉత్పత్తిచేసిన ఆయుధాల [illegible] సమానంగా జరిగేట్లు చూడ [illegible] ప్రయత్నిస్తున్నా రనవచ్చు [illegible] వారు భారతదేశం వయిపే అధికంగా మొగ్గుతూ వచ్చారు.

### తటస్థ విధానం ఫలితాలు

కొంత నిర్మొహమాటంగా మాట్లాడాలి. పది సంవత్సరాలకి పయిగా భారతదేశం తటస్థ విధానం అవలంబిస్తోంది. నిజానికి ఇది అవకాశవాదుల విధానం; వచ్చినంత రాబట్టుకోవాలనే విధానం. రష్యా, పాశ్చాత్య వర్గాల మధ్య ప్రచ్ఛన్నయుద్ధం ఉన్నంతకాలం ఈ విధానం బాగా పనిచేసింది. ఈ వర్గాలమధ్య కొంత శాంతి ఏర్పడగానే ఈ విధానం ప్రయోజనం తగ్గింది. శ్రీమతి గాంధీ మంత్రివర్గం బయటఉన్న వారందరికీ ఈ సంగతి తేటతెల్లంగా కనిపిస్తోంది. చెయినా ప్రపంచంలో అందరితోనూ పోట్లాట పెట్టుకుంటుందన్న సంగతికూడా ఇప్పటికి కొంతకాలంగా తెలుస్తోంది.

రష్యాని అరికట్టటానికి అమెరికా పాకిస్తాన్‌లో స్థావరాలు ఏర్పరిచింది. చెయినాని అరికట్టటానికి పాకిస్తాన్‌లో చెయినాలో స్థావరాలకోసం వెతుకుతోంది. అంతే కాదు, రష్యా, అమెరికాల మధ్య విరోధం పూర్తిగా తగ్గిపోలేదు. రష్యా అన్నిచోట్లా తనప్రభావం ఎక్కువ కావాలని కోరుకుంటూ ఉంటుంది.

### త్రిమూర్తుల విధానం

శ్రీమతి గాంధీ, రాజా దినేష్‌సింగ్, ఫక్రుద్దీన్ ఆలీ అహమ్మద్‌లు భారతదేశం రష్యా చేతికిందే ఉందని స్పష్టంగా చెప్పేశారు ఇక రష్యా కట్టుకు రావలసింది పాకిస్తాన్ ఒకటే. చెయినా తన ఆంతరంగిక యుద్ధాలలో మునిగిపోయి ఉండటంతో పాకిస్తాన్‌కి రష్యాతో మంతనాలు జరిపే అవకాశం కలిగింది. మే నెలలో పాకిస్తాన్ విదేశమంత్రి మాస్కోకి వెళ్ళి వచ్చారు. ఈ ఏడు కాశ్మీరు సమస్య ఉధృతంగా లేదు.

### పాకిస్తాన్ అవసరాలు

పాకిస్తాన్‌కి ప్రస్తుతం అత్యవసరంగా కావలసినవి ఆయుధాలు. ఫిబ్రవరిలో అమెరికా అధ్యక్షుడు జాన్సన్ ఇండియా, పాకిస్తాన్‌లకి ఆయుధసహాయం ఇవ్వమని అమెరికన్ శాసనసభలని అడగలేదు; జూలయిలో పాకిస్తాన్‌లోని అమెరికన్ 'సహాయ సంఘం' ఉపసంహరించుకోవటం జరిగింది; కాని, పాకిస్తాన్ తన ఆయుధసామగ్రికి కావలసిన స్పేర్‌పార్టులు కొనాలనుకుంటే అమెరికా అడ్డు చెప్పలేదు. ఈ సందర్భంలో పాకిస్తాన్‌కి ఒక అనుమానం కలిగింది. అమెరికానుంచి ఎగుమతి అయ్యే ప్రతి పెట్టెకీ అనుమతి కావాలని ఒకషరతు ఉండటంతో ఎందరో పాకిస్తానీలకి తమకి స్వేచ్ఛగా ఆయుధాల సరఫరా జరగదని అనుమానం కలిగింది. అందుకనే చెయినా, ఫ్రాన్సులని ఆశ్రయిద్దామనుకున్నారు. చెయినా ఎన్నో టాంకులు, మిగ్–19 విమానాలు (విపుణులతో సహా) పంపించిందిట! ఫ్రాన్సు 25 మిరాజ్ విమానాల ఆర్డరుని పుచ్చుకుందిట.

పాకిస్తాన్ ఎవరిదగ్గర ఆయుధాలుకొన్నా భారతదేశం గొడవ చెయ్యటం మొదలు పెట్టింది. ఇటలీ పాతపడ్డ టాంకులని పాకిస్తాన్‌కి అమ్మపోతే భారతదేశం తీవ్రంగా అభ్యంతర పెట్టింది. ఇటలీ సరికొత్త టాంకులని పాకిస్తాన్‌కి అమ్మేటంత తెలివి తక్కువది కాదని మనవారికి అర్థం అయినట్లు కనిపించదు. అన్నివిధాలా పాకిస్తాన్ విదేశవిధానం, లౌక్యం మనవాటికన్నా మెరుగుగా కనిపిస్తాయి.

### పాకిస్తాన్ ఎత్తు

1962 చెయినా–భారతదేశం యుద్ధం తర్వాత, పాకిస్తానీ అభ్యంతరాలని కాదని అమెరికా, బ్రిటన్‌లు భారతదేశానికి ఆయుధాలు ఇచ్చాయి. ఈ ఆయుధాల సరఫరా వల్ల కలిగిన లాభాన్ని తగ్గించటానికి పాకిస్తాన్ 1965 లో యుద్ధం ప్రారంభించింది. అంతేకాక, భారతదేశానికి ఆ తర్వాత ఆయుధాలు రాకుండా చెయ్యగలిగింది. భారతదేశానికి అమెరికా, ఇతరదేశాలు తమ సప్లయిలు ఆపివేశాయి.

### పంచశీల మహాస్త్రం

పంచశీల గొప్ప అస్త్రమని శ్రీ నెహ్రూ అనుకున్నారు. తమదేశ రక్షణకి సంబంధించిన వివరాలని కొన్నిటిని అశ్రద్ధ చేశారు. ఢిల్లీలో పారిశ్రామిక ప్రదర్శన జరిగినప్పుడు రక్షణశాఖ స్టాల్ లో కాఫీ పెర్కొలేటర్లు పెట్టారు. వీటిని భారతదేశపు ఆయుధ కర్మాగారాలలో తయారు చేశారుట. ఇంతలో అమెరికా పాకిస్తాన్‌ని సాయుధం చేస్తూవచ్చింది.

### మహమ్మదీయ మిత్రులు

భారతదేశం మత ప్రాధాన్యంలేని రాజ్యం అంటారు. నిజానికి ఇది హైందవరాజ్యం

ప్రపంచంలో నేపాల్ తప్ప వేరే హిందూ రాజ్యం లేదు. కాని, పాకిస్తాన్ తరపున నిలిచే మహమ్మదీయ రాజ్యాల సంఖ్యకి కొదువ లేదు. 1965 యుద్ధం సమయంలో ఇవి ఎన్నో పాకిస్తాన్‌కి బంగారం ఇచ్చాయి. అందుకనే సోమో రష్యా పాకిస్తాన్ సావాసం కోరుతోంది. పాకిస్తాన్ పెషావర్ వద్దనున్న అమెరికన్ స్థావరాన్ని తీసివెయ్యటానికి నిశ్చయించుకుంది. బదులుగా రష్యా పాకిస్తాన్‌కి ఆయుధాలు ఇస్తానంటోంది.

**తాష్కెంట్ ఫలితం**

అసలు రష్యాకి పాకిస్తాన్‌లో చోటు ఎలా దొరికింది? తాష్కెంటు ధర్మమా అని! ఈ తాష్కెంటు ఒప్పందం ద్వారానే భారతదేశం యుద్ధంలో గెలుచుకున్న ప్రదేశాలన్నిటినీ ఖాళీ చెయ్యవలసి వచ్చింది. ఒక్క దెబ్బతో రష్యా భారత–పాక్ విరోధంలో ప్రధాన మధ్యవర్తి అయిపోయింది. ఈ విషయం అమెరికా, బ్రిటన్‌లకి సంతోషం కలిగించి ఉండాలి. కాశ్మీరు సమస్య బాధ్యత వారికి తప్పిపోయింది.

ఇక రష్యా కాశ్మీరు సమస్య పరిష్కారం కావాలని భారతదేశంమీద వత్తిడి తీసుకువస్తే శ్రీమతి గాంధీ తమ తెలివిని తామే మెచ్చుకోవాలి. అణ్వస్త్ర ఒప్పందంమీద సంతకం పెట్టమని రష్యా వత్తిడి చేస్తోంది; భారతదేశం అంగీకరించలేదు.

**జాగీర్దారులు–వామపక్షవాదం**

శ్రీ కృష్ణమీనన్ ప్రభృతులు పశ్చిమ దేశాలతో విరోధం పెంచుకుని భారతదేశం రష్యాకి దగ్గర అయ్యేట్లు చూడటానికి ప్రయత్నిస్తూ వచ్చారు. వారు వామపక్షం వారు. కాని, రాజా దినేష్‌సింగ్ ఒక పెద్ద జాగిర్దారు. ఆయనకీ రష్యాకీ ఏమిటి అనుబంధం? శ్రీ ఫక్రుద్దీన్ ఆలీ మహమ్మద్ ఎంత వామపక్షవాది?

వీరందరి విధానాలూ అమెరికాని మనకి దూరం చేశాయి. మనకి రావలసిన సహాయం రావటంలేదు. అయితే, విదేశ సహాయంగురించి రాజా దినేష్‌సింగ్ ఆలోచించ వలసిన అవసరంలేదు. అది ఆయన బాధ్యతకాదు.

**రాజా దినేష్‌సింగ్ పర్యటన ఉపయోగం**

ఇంతకిముందే శ్రీ దినేష్‌సింగ్ రష్యాకి వెళ్ళి వచ్చారు. శ్రీ కోసిగిన్‌ని, ఇతరులని కలుసుకున్నారు. ఇంటికి వచ్చేసిన తర్వాత రష్యా ఉదార సహాయాన్ని పొగిడారు, ఇదివరకే జరిగిపోయిన రష్యా పాకిస్తాన్‌కి ఆయుధసహాయం చేస్తోందనే వార్త వెలువడింది. ●

# ఒక వారం విపరీతం



ఫాలాక్షుడు

## మరదలి పెళ్ళి- తన ఆత్మహత్య

తనకు పెళ్ళయి నాలుగేళ్ళయినా పిల్లలు కలగ లేదని ఆరాన్ అనే అతను భార్య చెల్లెల్ని పెళ్ళి చేసుకోదలిచాడట. దీనికి మామగారు అంగీకరించినా, భార్య ససేమిరా అందట. దాంతో అతను మరదలుకు, వేరే ఒకతనికి వివాహం దగ్గరుండి జరిపించి, ఓ గంట సేపటిలో విషం తాగాడట. అదేదో పానీయం అనుకుని అతని మామగారు మిగిలిన విషాన్ని త్రాగారట. ఇద్దర్నీ ఆసుపత్రిలో చేరిస్తే మామగారు బ్రతికారు. ఆరన్ చనిపోయాడు. తను ప్రేమించి పెళ్లి చేసుకుందామనుకుంటే— భార్య వీల్లేదన్నందుకు ఆత్మహత్య చేసుకున్నట్టు రాసి పెట్టాడట— ఇది ఆరణికి సమీపంలో వున్న వేంగియం పాళయం అనే చోట జరిగింది.

## సిటీ బస్‌ల స్వైర విహారం

మద్రాసులో పేపేరి నుంచి టంకశాలకు పోతున్న బస్సు వేగానికి తట్టుకోలేక 16 ఏళ్ళ ...




... ఆన అతను బస్సులోంచి క్రిందపడి, చనిపోయాడట. మద్రాసు సిటీ బస్సులు అంత హాయిగా పరుగెడుతున్నాయి.

* * *

నటరాజన్ అనే 36 ఏళ్ళ వ్యక్తి తన భార్యను యిత్తడి బిందెతో బాది చంపేశాడట. పెరంబూరులో నటరాజన్ బియ్యం వ్యాపారం చేసేవాడట. షాపుమూసి, యింటి కొచ్చేసరికి తన భార్య వేరొకతనితో వుండడం కళ్ళారా చూసి, ఆవేశంతో, చేతి కందిన బిందె తీసుకుని బాదాడట. ఆమెకూ, పళని అనే అతనికి చాలాకాలంగా యీ సంబంధం వుందట. ఎటొచ్చీ అతనికి తెలీదట. అలాటి ఘట్టం చూసినపుడు ఆవేశం రావడం తప్పేం కాదు అనిపిస్తుంది. పాపం!!

* * *

వడుగపట్టు (ఆర్కాట్) అనే వూళ్ళో చిన్నస్వామి అనే అతను కిళియమ్మాళ్ అనే ఆమెను నడిరోడ్డు మీద కత్తితో పొడిచి చంపేశాడట. కిళియమ్మాళ్ కు, చిన్నస్వామికి ప్రేమాయణం వుందట. కానీ కిళియమ్మాళ్ జయరామన్ అనే అతన్ని పెళ్ళి చేసుకునే సరికి చిన్నసామికి కసి పుట్టిందట—ఇదీ సంగతి.

* * *

గుజరాత్‌కి చెందిన సివ్‌సన్ అనేచోట భర్తతో పోట్లాడిన భార్య తన యిద్దరి పిల్లలమీద కిరసనాయిలు పోసి, నిప్పంటించి, ఆనక తన చీర మీద కూడా కిరసనాయిలు పోసుకుని నిప్పంటించుకుందట. దాంతో ముగ్గురూ చనిపోయారు. ఇదీ ప్రతీకారమేనా! ఎవర్ని వుద్ధరించడానికి, 5 ఏళ్ల పిల్లన్నూ, 8 నెలల పసికందునూ అమానుషంగా తగలేసి, తనూ తగలపడి ఏం సాధించిందో ఆవిడ!

## నడిబజార్లో పట్టపగలు దోపిడీ

పోస్టల్ శాఖ వారికి జీతాలివ్వటానికి డబ్బు తీసుకవెళ్తున్న వాన్‌ని కలకత్తా నడి బజార్లో పట్టపగలు ఆపి, డ్రయివర్ని తుపాకితో కాల్చి, ఆ వాన్ తలుపు గునపంతో పగలగొట్టి లోపలున్న మూడు లక్షల రూపాయలనూ పట్టుకొని, మరో కారెక్కి పారిపోయారట. ఈ సందడికి యిళ్లల్లోంచి, కొట్లలోంచి బయటికి వచ్చిన జనం సినిమా చూస్తున్నట్టు చూస్తూ వుండిపోయారుట. దొంగలు తమ హడావిడిలో మరో రెండు లక్షలరూపాయలున్న సంచి ఒకటి వదిలేసి పోయారుట. కలకత్తా చరిత్రలో యిది — ఇంత దారుణమైనది — ఇదే మొదటి సంఘటనేమో అనుకుంటున్నారు. ఈ వచ్చిన (ఆరుగురు) బందిపోటు దొంగలకు, పోస్టలు జీతాలు తీసుకు వెళుతున్న వాన్ డ్రయివరుకూ ఏదో లాలూచీ వుండి తీరాలని అనుమానమట —మేచీ.

## అర్ధరాత్రి బందిపోట్ల దోపిడీ

ఢిల్లీలో మొన్న శనివారం అర్ధరాత్రి బందిపోటు దొంగలు కుతుబ్‌మినార్ ప్రాంతంలో




వున్న ఇళ్ళ మీదపడి, చేతికందిన వాళ్ళను చావగొట్టి, చంపేసి, చేతికి అందినవన్నీ పట్టుకుని పారిపోయారట. చాలా వెల ఖరీదు చేసే వస్తువులూ, వగా, వస్త్రాలతో (పదిమంది) బందిపోటు దొంగలు పారిపోయుండాలి అని పోలీసులు పసి కట్టేశారట —స్పైస్..

* * *

## చెట్టుకి శవం

మద్రాసుకు సమీపంలో వున్న పటాభిరామ్ అనే స్టేషనులో వో చెట్టుకు శవం వ్రేలాడుతూ కనుపించిందట. పోలీసు పరివారం వచ్చి ఆ శవాన్ని దింపి సోదా చేస్తే— అతని జేబులోవున్న సమాచారాన్ని బటి అతనిపేరు మహమ్మద్ అనీ, కాలికట్ ఆసుపత్రిలో కడుపు నొప్పికి వైద్యం చేయించుకుంటున్నాడనీ వుందట. ఆ 62ఏళ్ళవృద్ధుడు బహుశానొప్పి భరించలేక ఆత్మహత్య చేసుకుని వుంటాడేమోనని అనుమానిస్తున్నారు పోలీసువారు.

* * *

ఆరణిలో 3వ తేదీన తన ప్రియురాలిని తనే రాళ్ళతోకొటి చంపేశాడట ఒకతను. 35 ఏళ్ళ తొప్పిలిఅమ్మాళ్ అనే ఆమెకు ఇద్దరు పిల్లలట. ఆమె ప్రియుడు మూసా చాలాకాలం తరువాత మళ్ళీ మొన్న 3వ తేదీన ఆమెను కలుసుకున్నాడట. ఏదో మాట్లాడుకుంటున్న వాళ్ళల్లా తోట్లాటలోకి దిగారట. మూసా వుద్రేకంతో ఆమెను చెత్తోబాది, కసితీరక రాళ్ళతో కొటి చంపేశాడట.

* * *

## కోర్టులో కాల్పులు

ఒక హత్య కేసు సందర్భంగా భాటిండాలో




కోర్టుకు వెచ్చిన ఆరుగురు వ్యక్తులు వున్నట్టుండి పిస్టళ్ళతో తమ ఎదుటి కక్షివాళ్ళ మీద కాల్పులు చేశారట. ఒక గుండు తగిలి, 22 ఏళ్ళ ధీర్‌సింగ్ అనే అతను క్రింద పడగానే, అతన్ని కాల్చిన ఆరుగురిలో ఒకతను తన వద్దనున్న కొడవలితో అతని తల నరికేశాడట. ధీర్‌సింగ్ తండ్రి, మేనమామలకు కూడా గాయాలు తగిలాయట. పోలీసులు వచ్చేసరికి ఆరుగురిలో యిద్దరు అంతర్ధానమయి పోయారట. ఇంతకన్నా దారుణం వుండదేమో.

## వేరుశనగచేలో శవాలు

చిదంబరం తాలూకా పాండరాజన్ అనే గ్రామంలో ఒక వేరుశనగ చేమలో ఇద్దరి శవాలు ముక్కలు ముక్కలుగా దొరికాయట (జూలై 7). రాత్రి కాపలాకుపడుకున్న వీరిని ఎవరో గొడ్డలివంటి ఆయుధాలతో నరికి వుండాలని తెలినా, ఎవరు? ఎందుకు నరికారో యింకా తెలలేదు.

## ఖైదీలకి కాలక్షేపం

ఖైదీలకు కాలక్షేపానికి తిరుచ్చిలో ఒక మందిరం కటించారట. 25 వేల రూపాయల ఖరీదు చేసే ఈ మందిరం ఖైదీలే కటుకోడం వల్ల 2వేల రూపా

యుల ఖర్చులోనే తేలిందట. ఈ కొందిరంలో ఫ్రైడీ లకు సినిమా, నాటకాలు—అటువంటివివేసి చూపు తారట—ది ఫైన్డ్ ఐడియా:

* * *

తేనాంపేట (మద్రాసులో) ఎరోమా హోటలుకు బిరియానీ నానా బీభత్సాన్నీ తెచ్చింది. ఒకతను బిరియానీ పార్సెల్ చేయించి తీసుకెళ్ళాడట. గోపాల్ అనే అతను హోటలు ఎరోమాకివచ్చి, ''ఇదేం బిరియానీ'' అంటూ అరిచాడట, ''వద్దపోతే పడెయ్, డబ్బుతీసుకు పో''అన్నాడట హోటలు ఆసామి రజాక్. దాంతో మాటామాటాపెరిగి, చొక్కాలు పట్టుకునేంత వరకూ వెళ్ళేసరికి హోటలు సిబ్బంది బయట గేటు వేసేసి, గోపాలును చితక తన్నారట. ఈవార్త అతను వుంటున్న శ్రీనివాసపురానికి తెలిసింది. వెంటనే 200 మంది ఆహోటలుమీద (జూలై 7) విరుచుకుపడి, పో .. కర్రలతోనూ, రాళ్లతోనూ కొటి, గేటువిరిచి, లోపలకువెళ్ళి గోపాలును విడుచు పించుకు వచ్చారట. ఇది శాంతిస్తున్న సమయానికి పోలీసులు వచ్చి తక్కున చేతికందినవారిని (వేరస్థులనే) ఆరెస్టు చేశారట..

* * *

తనను పెళ్లిచేసుకోడానికి నిరాకరించిందని (ఢిల్లీలో) లక్ష్మణ్‌సింగ్ అనే అతను షీలా అనే ఆమెను గొడ్డలితో నరికి చంపేశాడట. ఆమెయింట్లో వచ్చిన ఘర్షణలో అతనికి ఆవేశం వచ్చి గొడ్డలితో షీలాను నరికి, అడ్డొచ్చిన ఆమె తల్లినీ నరికాడట. షీలా తల పగిలి, నెత్తుర మడుగులో అక్కడే చనిపోయిందనీ, ఆమె తల్లి ప్రమాద స్థితిలో ఆసుపత్రిలో వుందనీ వార్త!

* * *

ఐదు భరతనాట్య ప్రదర్శన లివ్వడానికి మలేషియా రెండు నెలల్రకితం వెళ్ళిన పద్మిని, రాగిణి 25 ప్రదర్శన లివ్వటానికి అక్కడే వుండి, ఇప్పుడు ఆదాయపు పన్ను చెల్లించనందువల్ల ఇండియా రాలేకపోయారట. తమను మలేషియా పిలిపించిన వారు నమ్మ టముంచారని ఆదాయపు పన్ను ఎనిమిది వేల మలేషియను డాలర్లలో నాలుగువేలు కట్టేశామనీ, మిగతానాలుగువేలూ త్వరలో కట్టి, ఇండియా బయలుదేరుతామని వారు పత్రికా విలేఖరుల గోష్ఠిలో తెల్పారట.

## నిప్పు సరదా !

మద్రాసులో ఏటేటా సరదాకి పాకలకు నిప్పంటించడం, తమాషా చూడడం పరిపాటి. పాక ఒక్కింటికి కొంత డబ్బు యిస్తారనీ, ఎన్నిపాకలు అంటిస్తే



అంత ఆదాయమనీ అధికోత్సాహంతో యీ పనిచేసే వారూవున్నారు(ట!) అయితే దీనికి, రాజకీయాలకూ కూడా దగ్గర సంబంధంవుంటూవుందని కొందరి అభిప్రాయం. ఏది ఏమైనా రివాజు తప్పక, యీ కార్యక్రమం యీఏడు కూడా భయంకరంగా కొన్నివేల పాకలు తగలేసి వార్షికం చేసుకుంది.

## హిట్లర్ చచ్చిపోలేదా ?

1945లో బెర్లిన్‌ను రష్యనులు ముట్టడించాక హిట్లర్ అక్కడనుంచి పారిపోయాడట. అయితే యీ పారిపోయిన హిట్లర్ ఇంకా చనిపోలేదని, భార్య(?)



తోసహా కాంబోడియాలో ఉన్నాడని, మీసాలుతీసేసి కళ్ళజోడు ధరించడంవల్ల పోలిక తెలియటం లేదని వో పత్రిక రాసింది. ఆశ్చర్యం!—కెనిట్ బీ...అయ్యుంటుందా!

# మహీధరోక్తులు

### మహీధర నళినీమోహనరావు



సర్వత్రముల నె... పాలించు వజ్రమ్ము
రాగి తీగచేత లాగబడును
బలిసికన్న లాభమునకే పైచేయి
హృదయవర్తి యీ మహీధరోక్తి.

చేసికొన్న కర్మ జీవుల నడిపించు
దీని మార్పలేడు దేవుడైన
దైవపూజవల్ల దక్కెడిదేమయా?
హృదయవర్తి యీ మహీధరోక్తి.

కోటినదులు నీరు కొనివచ్చి పోసినా
కడలి గట్లు పార్లి వెడలబోదు
గర్వపడడు సుమతి కలిమి గల్గినవేళ
హృదయవర్తి యీ మహీధరోక్తి.

శరభము, బడబాగ్ని, చక్షుశ్శ్రవంబును
* వాగ్గదంబు, కచ్ఛపముల యునికి
లవికి గానరాదు కవివర్యులకు దక్క
హృదయవర్తి యీ మహీధరోక్తి.

* శరభమృగం అనేది లేదు. బడబాగ్ని కల్పితం. పాము చక్షు శ్శ్రవం కాదు. గబ్బిలం వాగ్గదం కాదు. తాబేలు కచ్ఛపం కాదు. ఇవి అన్నీ కవుల భ్రాంతి జన్యములు.







MAFATLAL
GROUP




భూలోక దేవేంద్రుని వంటి ఉదయనుడు, దిగ్విజయం చేశాడు. సార్వభౌమ విభవం పొందాడు. రాజహంస కమలవనంలో విహరించినట్లు తన ప్రియతముల కాంతికమల వనంలో విహరిస్తూ రాజులలో హంసవంటి ఆరాజు తనూ రాజహంస అయిపోయాడు.

ఉదయనుడు ఒకనాడు కొలువై ఉండగా, నారదుడు వచ్చాడు. రాజు అతనిని ఉచితరీతిని సత్కరించాడు. నారదుడు సంతృప్తి పొంది, అతనికి హితం చెప్పడం ప్రారంభించాడు. నారదుడు మాట్లాడడానికి పెదవి కదల్చగానే అతని తెల్లని పలువరుస కాంతి దిక్కులను తెల్లనిగా చేసింది.

"రాజేంద్రా, ఐశ్వర్యం అబ్బింది కదా అని, విద్యుక్త ధర్మాలలో నీవు ఏమరుపాటుతో వుండడం లేదు గదా? ఐశ్వర్యమత్తులైన రాజులు మదించిన ఏనుగుల లాగ ఏమీ చూడరు. సూర్యుని వేడి తగ్గిన హేమంత ఋతువులో కమలం లాగ నీ సిరిని వ్యసనాలనే మేఘాలు ముసురుకోలేదు గదా?" అని నారదుడు ఉదయనుని కుశల ప్రశ్న చేసిన తర్వాత ఇలా అన్నాడు:—

"నీ పూర్వ పితామహుడు పాండువు అనే రాజు వుండేవాడు. అతనికి వేట వ్యసనం. అతడు ఒకసారి వేటకు వెళ్ళి రతిమోహితుడై వున్న కిందముడనే మునిపై బాణాలు ప్రయోగించాడు. ముని కినిసి 'నీవు కూడా నాలాగే రతిపర్యంతం జీవించేవాడివి అవుతావు' అని శపించాడు.

"అందువల్ల గొప్ప రాజులకు కూడ వ్యసనమనేది వినాశం కలిగిస్తుంది. నీవు నీ కులంలోనే గొప్ప పదవి పొందావు. నీ కుమారుడు సర్వ విద్యాధరాధీశుడవుతాడు. కుమారస్వామి తండ్రి అయిన శశిశేఖరుణ్ణి నీ దేవేరి వాసవదత్త ఆరాధించి విద్యాధరేశ్వరుడయ్యే కుమారుణ్ణి ప్రసవిస్తుంది. ఆ కుమారుడు మరెవరో కాదు. సాక్షాత్తు మన్మధుడే. పూర్వం హరుని కంటిమంటలలో మన్మధుడు కాలి బుగ్గి అయినప్పుడు, రతిదేవి ఈశ్వరుణ్ణి బతిమాలింది, అతనిని బ్రతికించి తనను అనుగ్రహించవలసిందని. రతి ప్రార్థనకు శంకరుడు మనస్సు కరిగి, 'నీ భర్త అయిన మన్మధుడు వాసవదత్తకు కుమారుడై పుడతాడు' అని అనుగ్రహించాడు."

నారదుడు ఈ సంగతి చెప్పి రాజును ఆశీర్వదించి వెళ్ళిపోయాడు. వత్సరాజు నారద మహర్షి మాటలు మనస్సు ఆనందానందము చేకూర్చగా, సుఖంగా గడిపాడు.

ఒకసారు దరిద్రం పట్టుకుని పీడిస్తున్న ఒక బ్రాహ్మణి తన కవల పిల్లలతో పాటు వత్సరాజు ఆస్థానానికి వచ్చి, "దేవా, నేను గతి లేని దానిని. నీవే శరణని వచ్చాను." అని విన్నవించింది. రాజు కృపాపూర్ణ మనస్కుడు. ఆమె విన్నపం విని, "ఈమెను అంతఃపురంలో దేవేరులకు అప్పగించి, తగిన రక్షణ ఇవ్వమని చెప్పండి." అని భటులకు ఆజ్ఞాపించాడు. వాసవదత్త ఆమెను, కుదువ పెట్టిన ధనం లాగ జాగ్రత్తగా స్వీకరించి, ఉపచరించింది. బ్రాహ్మణి ఆమె ఉపచారంతో సంతృప్తిపడిన తర్వాత, "అమ్మా, నీవు పుత్రవంతురాండ్రలో ధన్యురాలివి. నీ సంగతి చెప్పు." అని వాసవదత్త ప్రశ్నించింది. ఆమె ఇలా చెప్పింది:—

"దేవి ఎంతో కష్టంమీద నేను నా శీలం రక్షించుకొన్నాను. భర్తలు దూరదేశంలో వున్నప్పుడు, మహిళలు శీలం కాపాడుకోడం చాలా కష్టం. ఈ సందర్భంలో ఒక కథ చెబుతాను:

"పూర్వం ఉత్తరప్రాంతంలో జయదత్తుడనే రాజు ఉండేవాడు. అతని కుమారుని పేరు దేవదత్తుడు. అతడు కులానికే కళంకం తెచ్చే దుశ్చరితుడు. అతనికి వివాహయోగ్యమైన వయస్సు రాగానే, జయదత్తుడు ఇలా ఆలోచించాడు: రాజుల ఐశ్వర్యాలేమో, గాలికి అల్లలలాడే అరటాకు లాంటివి. వైశ్యుల సంపదలు అక్షయంగా ఉంటాయి—అని. ఈ విధంగా ఆలోచించి, మహా ధనవంతుడైన ఒక వైశ్యుని పుత్రికను తన కుమారునికి ఇచ్చి వివాహం చేశాడు. తన వియ్యంకుని ధనకాంచన రత్నరాసులతో రాజు బొక్కసం పెరిగింది.

"కొంతకాలానికి జయదత్తుడు కాలధర్మం చెందాడు. కుమారుడయిన దేవదత్తుడు బలం లేనివాడు కావడం గ్రహించిన దాయాదులు అతని రాజ్యాన్ని ముట్టడించి జయించారు. దేవదత్తుడు తన దగ్గరి వారితో పాటు ప్రాణాలు దక్కించుకొని, ఒకరాత్రి ఎచటికో పారిపోయాడు.

తల్లి ఆ దుఃఖసమయంలో అతనికి హితవు చెప్పింది—నాయనా, నీవు నీ మామగారి యింటికి వెళ్ళు. అతడు చాల ధనవంతుడు. తప్పక నిన్ను ఆదుకొని డబ్బిస్తాడు, నీ భార్య ముందుగానే, పుట్టింట్లో వుంది కదా—అని.

"దేవదత్తుడు తల్లి మాట ప్రకారం మామగారి నివాసస్థలమైన పాటలీపుత్రానికి వచ్చాడు. శ్వశుర గృహానికి వెళ్ళాడు. కాని, అతనికి శ్వశురగృహంలో ప్రవేశించడానికి సిగ్గయింది. అందువల్ల ఇంట్లోకి వెళ్ళలేకపోయాడు. మామగారి యింటి దగ్గరే వున్న ఒక బాటసారుల సత్రంలో పడుకున్నాడు.

"అర్ధరాత్రి వేళ అక్కడికి ఒక జంట వచ్చింది. ఆ జంటలోని స్త్రీ తన భార్య అని అతడు గుర్తించాడు. దొంగతనంగా చేసే చీకటి తప్పుతో, ఆమె వడ్డాణపు గజ్జెలు గలగలమంటున్నాయి. అలాటి దానిని చూచినప్పటికీ దేవదత్తుని మనసు దరిద్రావస్థలో వున్నాడు గనుక కలత పడలేదు, కోపం అంతకన్నా రాలేదు.

"ఉపపతి సమాగమం సంబరంలో ఆమె మణులు పొదిగిన హేమకర్ణాభరణం జారిపడింది. దానిని ఆమె చూసుకోలేదు. రాగాంధులకు ఏమి కనిపిస్తుంది? వారు వెళ్ళిపోయిన తర్వాత రాజపుత్రుడు ఆ రత్నఖచితమైన కర్ణాభరణం తీసుకున్నాడు, పనిని ప్రారంభించినవాడు సంపదను గ్రహించునట్లుగా. ఎవ్వరికీ తెలియకుండా వెలుపలికి వెళ్ళిపోయాడు.

తెల్లవారగానే ఉత్తమమైన ఆ రత్నఖచిత తాటంకాన్ని కుదువపెట్టి, చాల ధనం తీసుకున్నాడు. ఆ డబ్బుతో గుర్రాలు కొని, బలవంతుడైన పరమేశ్వరుడనే రాజు సహాయంతో శత్రువులను యుద్ధంలో హతమార్చి, పితృపితామహుల రాజ్యాన్ని సంపాదించి కాంతిమంతుడయ్యాడు.

"తర్వాత కొంతకాలానికి తన కులోచిత అయిన మరొక రాజపుత్రిని పెండ్లాడాడు. అనంతరం ఆ రత్నతాటంకాన్ని, తాకట్టు నుంచి విడిపించి, మామగారికి పంపించాడు. దేవదత్తుని భార్య దానిని చూచింది. భర్త తన దుర్నీతిని చూచి వుంటాడనే సందేహం కలిగింది. తన కర్ణాభరణం ఎప్పుడో పోగొట్టుకొనిపోయి వుండడం, అది భర్తకు దొరకడం ఎలా సంభవిస్తుంది? ఆ విషయం తలచుకోగానే ఆమె గుండె పగిలి చనిపోయింది. నేను చెప్పవచ్చిందేమిటంటే భర్త దూరదేశంలో చాలకాలం ప్రవాసంలో వున్నప్పుడు స్త్రీలు శీలం కాపాడుకోడానికి ఎంతో కష్ట పడాలని. ఇక నా సంగతి తెలుపుతాను.

"నా పేరు పింగళ. నా భర్త పేరు శంకరదేవుడు. దురదృష్టవశాత్తు నాకు వైధవ్యం ప్రాప్తించింది. మా జ్ఞాతులు బలవంతులై నా కులాగ్రహారాన్ని హరించారు. నాకొక మరది శాంతికరుడనే వాడున్నాడు. అతడు చాలకాలం క్రిందటే విదేశాలకు వెళ్ళాడు. ఇంతవరకు అతని జాడలు లేవు. నేను గత్యంతరంలేక ఈ ఇద్దరు కుమార్లతోను మహారాజును శరణు పొందాను. నీ పతిదేవుడయిన మహారాజు దుఃఖసంతప్తులయిన జనానికి కల్పవృక్షం వంటివాడు."

వాసవదత్తకు పింగళ సంగతి విని చాల కనికరం కలిగింది. తమ పురోహితుడు శాంతికరుడనేవాడు ఉన్నాడు. అతడు పింగళ మరది అయి వుంటాడేమోనని అతనిని పిలిపించింది. అతడు రాణివాసానికి వచ్చి తన వదినను గుర్తుపట్టాడు. పింగళ శంకరదేవుని మరణం, తన కష్టాలూ తెలిపింది. తమ పురోహితుని వదినగారని రూఢి అయిన తర్వాత వాసవదత్త ఆమెను హేమరత్నాంబరాలతో హెచ్చుగా సమ్మానం చేసింది. పింగళ ఒకవైపు మరది, మరొక వైపు రాజా, దేవేరులు ఆదరంతో చూస్తుండగా తన కుమారులను, రక్షించుకొంటూ వాసవదత్త ఆశ్రయంలోనే వుంది.

వాసవదత్త ఒకమారు ప్రాసాద వాతాయనం వద్ద కూర్చుని రాజవీధిలో వెళ్ళే వారిని చూస్తూ వుంది. వీధిలో ఒక కుంభకారి తన ఐదుగురు

(16వ పేజీ చూడండి)

ఎ. వి, సాంబల్‌పూరు

నాకు అన్నీ ఉన్నాయి. ఏ కష్టంలేదు. అయినా ఏదో అసంతృప్తిగా బాధగా ఉంటుం దెందుకు ?

అన్నీ ఆహ్లాదకరంగా ఉన్నప్పుడు ఏదో లోటు ఉన్నట్లు బాధపడ్డం అంతరాత్మ నైజం.

జె. ఆర్. కె, కొవ్వూరు

ఇంటి పరిస్థితులని అర్థం చేసుకో కుండా రోజుల తరబడి ఉండిపోయే చుట్టా లకి ఎలా చెప్పాలి ?

ఈకథ చెప్పండి ఫ్రెండ్. పూర్వం ఒకసుల్తాన్‌కి 365 మంది చుట్టాలుండే వారుట. ఏడాది కోసారి ఓచుట్టం వస్తే భరించేవాడుట. ఎంతో ఘనంగా విందు చేసి బహుమతులు కురిపించేవాడు. ఖర్మకాలి ఒక లీపుసంవత్సరంలో ఒకచుట్టం రెండో సారి వచ్చాడట. సుల్తాను సగౌరవంగా ఆదరించాడు గాని, సంవత్సరంలో రెండోసారి వాడి ముఖం చూసేసరికి ప్రాణం విసిగి ఒరలోని కత్తితీసి వాళ్ళాడిమెడకొసాట్ట వరికాట! అందుకేమొదవిూద ఉండిన్న చుట్టం సంవత్సరానికి ఒకసారేచుట్టపు చూపుగా వస్తాడుట!"

ఒక లేడీ స్టూడెంట్, కాకినాడ

నా స్నేహితురాలుంది. ఆ అమ్మాయికో దురలవాటుంది ఆలోచిస్తూ ఈల వేస్తుంది. దీన్ని ఎలాగ పోగొట్టడం ?

చాలామందికి ఈల వెయడం నచ్చదు దెయ్యాల గానాలాపన ఈల అని నమ్మేవారుట అరబ్బులు! బ్రిటనులో ఓపాతనమ్మకం ఉంది అరిచేపెట్టా, ఈలవేసే ఆడదీ మనిషికి దైవానికీ కూడా పనికి రాదని! చెప్పండి మీా స్నేహితురాలికి

బి. కె. ఎమ్. ఆర్, మద్రాసు

రోడ్డు దాటుతూకూడా ఒయ్యారాలు ఒలక పోస్తారెందుకీ అమ్మాయిలు ? ఏ కారుకిందో పడితే ?

మరేం ఫరవాలేదు సోదరా, రోడ్డు దాటేపాద చారు లెప్పుడూ రెండు రకాలుంటారుట ఒకటి జాగ్రత్తయిన వాళ్ళు, రెండు చచ్చిపోయిన వాళ్ళు.

పి. ఆర్. ఎమ్. ఆర్, వరంగల్లు

మీ రెప్పుడూ నిజమాడుతారా ? అబ ద్ధాలు చెప్తుంటారా ?

మీరు వినలేదా? అబద్ధాల కోరుల పోటీలో నిజం చెప్పిన వాడికే ప్రథమ బహుమతి లభి స్తుందని? అది నాకే వచ్చింది.




కె. ఎ. డి, చిత్తూరు

వివాహం చాలా బాధ్యతలతో కూడు కున్న దంటారు–అది ఎంతవరకు నిజం ?

అయ్యో చిట్టితల్లీ—ఎందుకు కొచ్చింది అను మానం? వివాహపు సంకెళ్ళు ఎంత బరువంటే అని మోయడానికిద్దరూ, ఒక్కొక్కప్పుడు ముగ్గురు కూడా కావాలి అన్నాడు అన్నాడు డ్యూమాస్!

జె. ఎమ్, కుర్దారోడ్డు

ఆమె నా సలహా పెడచెవిని పెట్టింది. నాకు తలకొట్టేసి నట్టయింది. మీ సలహా ఏమిటి ?

ఒక్కసలహా. సలహా ఇవ్వవద్దు!

ఎమ్. వి. పి, చీరాల

రచయిత్రిగా మీ రంటే గౌరవముంది. కాని ప్రశ్నావళిలో మీరు జవాబులిచ్చే తీరు చూస్తుంటే అందులో మీకు నేర్పుఉన్న ట్లు తోచడంలేదు.

రాయగా రాయగా రాకపోతుందా అని చూస్తున్నాను మహాశయా!

కె. వి. పి, నెల్లూరు

ఏమండీ నేను చాలా మంచివాణ్ణి... కావాలంటే గుండుమీద...గుండెమీద చెయ్యి వేసుకుని చెప్తా...

ఒద్దు తమ్ముడూ, నిన్ను నమ్ముతున్నానుగా!

టి. ఆర్. కె, పిఠాపురం

దెయ్యాలంటే మీకు నమ్మకం ఉందా ? వాటిని మీ రెప్పుడైనా చూశారా ?

ఇదివరకు లేదు గాని ఇప్పుడిప్పుడు నమ్మకం గానే ఉంది రామకృష్ణగారూ, అడపా దడపా ఎదు రవుతూనే ఉంటాయి!

బి. కె, రాజమండ్రి

నా స్నేహితురాలు పెళ్ళి చేసుకుని వెళ్ళి పోయింది. ఒకసారి వచ్చి చూసివెళ్ళమని రాస్తుంది. 8, రోజు ప్రయాణం చేసి వెళ్ళాలి. వెడితే త్వరగా రానివ్వదేమో అని...

ఒక్కటి జ్ఞాపకం ఉంచుకో సోదరీ "మూడు రోజులు గడిస్తే ఎంతముఖ్య అతిథి అయినా నిలవ చేపలాగా కంపు కొడతాడు' అన్నాడు బెంజమిన్ ఫ్రాంక్‌లిన్

ఎమ్ జె. ఆర్, కాకినాడ

ఆ హోటల్లో నాకు జరిగినదానికి సర్వర్‌ని కోప్పడుతూంటే–పక్క బల్లమీద కూర్చున్న అమ్మాయిలు ఒకటే ముసి ముసి నవ్వులు...

పబ్లికు స్థలాల్లో కోపం వచ్చినాకూడా రెచ్చి పోయి సీను క్రియేట్ చేసుకోకూడదు. ఈగకే మీారింత ఇదవుతున్నారు ఈజోకు మీారు విన్నారా? ఒక ఆసామీకి రొట్టెలో ఎలక వచ్చిందిట గట్టిగా కొట్టువాడిమీాద అరుస్తున్నాడుట. ఆకొట్టువాడు రహస్యంగా అన్నాట్ట. 'గట్టిగా అరవకయ్యాబాబూ, అంతా కావాలంటారు' అని!

జె. వి. జి. ఎమ్, కర్నూలు

అక్కా, ప్రేమించడం అంటే ఏమిటో?

అదొక తాత్కాలికమైన పిచ్చి తమ్ముడూ, పెళ్ళితో సాధారణంగా కుదిరి పోతూ ఉంటుంది!

జె. వై. ఎ, రెడ్డిపోలవరం

రచయిత్రిగా మీ కేమైనా చెడు అల వాట్లు ఉన్నాయా ?

ఆ అర్థమయేలా రాయలేక పోవడం, అవసరం అయితే కాని రాయకపోవడం చాలవా ?

కె. వి. ఎస్. ఆర్, బరంపురం

అన్ని భూషణములలోకి 'లజ్జ' కూడా స్త్రీలకు భూషణము. అటువంటి 'లజ్జ' నేటి నాగరిక స్త్రీలు ఎందుకు విడిచి పెడుతున్నారు ?

విడిచిపెడుతున్నారని మీారంటున్నారేగాని 'మాకీ భూషణపు బరువు అధికంగా ఉంది దాన్ని విడిచి పెడుతున్నాం' అని స్త్రీలు ఘోషించారా ఏం బాబూ? ఆధునికంగా ఉండడానికి లజ్జావిహీనంగా ఉండడానికీ తేడా కనబడ్డం లేదామీాకు?—●

# చర్చ

## ఒక పరిమితి ఉండాలి

నేటి ప్రపంచములో జరుగుచున్న నిజాన్ని బాగుగా తెలిపారు. ఆలోచించి చూచిన నేటి వస్త్రధారణ సినిమాలవలననే పూర్తిగ మారినదని చెప్పవచ్చును.

కాలం మారుచున్నది దానికి తగ్గట్టు సంఘం కూడ మారవలసిన మాటకూడ నిజమే. కాని దానికి పరిమితివుండాలి. ఎవరో కొందరు ధనికులు మాత్రమే సినిమాలలాగ తులదూగటానికి వీలు పడుతుంది. కాని పేద ప్రజలు కూడ సినిమాలలో వున్నట్లు వుండవలయునని ఆశపడుతుంటారు ఉదాహరణకు, పేదవారు తమ భుక్తికున్నను, లేకున్నను సినిమాలు చూడకమానరు. ఆరోజు సినిమా చూచి అందులో నటి ధరించు నటువంటి వస్త్రాలపై మోజుకలగక మానదు తాముకూడా అలా మారటానికి యత్నించుతారు. ఈ విధముగ ప్రతి యొకరికి వస్త్రధారణపై ప్రీతికలుగును.

ఆలోచించిచూచిన బిగుతు దుస్తులు (టైట్ కాస్ట్యూమ్స్) ధరించి చాల అసభ్యముగవున్న సినిమాలే పైకి రాగలుగుచున్నవి. నీతి, నియమములతో కూడిన సినిమాలకు విలువతగ్గిపోవు చున్నది సినిమాలలో వస్త్రాలంకరణకు ఒక పరిమితి వున్నచో చాల బాగుండును. **ముప్పాళ సత్యాబాయి** (అరుణానగర్)

## సృష్టికి మించిన ప్రమాదం -చకోరనయనాలు

12—7—68, పత్రికలో 'చర్చ' శీర్షిక చూచాను. సినిమాల్లో వాల్ పోష్టర్లలో, అసభ్య వస్త్రాలంకరణ, ఆధునిక యువతుల వస్త్రాలంకరణ లాంటివిషయాలమీద యీ మధ్యకాలంలో సుదీర్ఘ చర్చలు సెమీనార్లు జరుగుతున్నాయి జీవకారుణ్యసంఘాలు కూడ యీ విషయం మీద ఆందోళన చేసినా ఆశ్చర్యం లేదు.

స్త్రీ వస్త్రాలంకరణ గురించిగాని, అసభ్యంగా వున్నావని చెప్పే చిత్రాలు, ప్రదర్శనలవలనగాని అందరూ భయపడేటంత ప్రమాదంగాని, అవి పితిగాని లేదు

వస్త్రాలతో చూచినా, ఎక్స్—రేలతోచూచినా స్త్రీ వలన భగవంతుడి సృష్టిలో ప్రత్యేకమైన ప్రమాదమేమీలేదు.

ఐతే భగవంతుడి సృషి కి మించిన ప్రమాదము వాళ్ళ చకోర నయనాలలో వుంది. వాటిబారినుంచి వుద్యోగులను, మగవాళ్ళలో విద్యార్థులను కాపాడదల్చుకుంటే స్త్రీలందరూ గాగుల్స్ పెటుకోవాలని నిబంధన పెటుకోవచ్చు. ఐతే దీనివల్ల మగవుద్యోగులు, విద్యార్థులూ కాలేజీలు, ఆఫీసులు మానేయవచ్చు.—చల్లపల్లి రాంప్రసాద్ (గుంటూరు)

## మంచీ - చెడూ

21—6—68 వ తేది ఆంధ్ర వార పత్రికలో శ్రీమతి కె. హేమలతగారు వ్రాసిన "వస్త్రాలంకరణ" శీర్షికతోపాటు 12—7—68 వతేదీ ప్రచురించ బడిన "చర్చా" విశేషములతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. అంతేగాక ఏ విషయానికైనా మంచీ—చెడు రెండూ వుంటాయి. "సినిమాలలో అసభ్య వస్త్రాలంకరణ" అనుదానిపై సినిమా కళాకారులను హెచ్చరిస్తూ, ప్రభుత్వాన్ని మేల్కొల్పుతూ సంఘానికి కూడా విన్నవిస్తూ నేను నాఅభిప్రాయాన్ని తెలుపుతున్నాను.

నేటిమనసంఘంలో స్త్రీకున్న స్థానం అమూల్యం. ముఖ్యంగా మన దేశంలో ఆదినుండి, స్త్రీ దేశ సంస్కృతి ననుసరించి, ఒకరికై, ఒకరితోకూడి ఒకరిపై ఆధారపడి, వయఃపరిధి ననుసరించి,వస్త్రాలంకరణ చేసుకొంటూ తన స్థితిని తాను సర్వవిధాల రక్షించుకొనుచున్నదనుటలో ఇసుమంతయు సంశయములేదు. కాని నేడు....

మనసంఘంలో ఈ సినిమాలవస్త్రాలంకరణను ప్రోత్సహించే తల్లు లున్నారనుటలో అతిశయోక్తి లేదు. విద్యార్థినీదశలో సాటి యువతులెలా అలంకరించుకొంటే, గుడ్డిగా తనూ అలాగే అలంకరించుకోవాలని వుబలాట పడే యువతులూ లేకపోలేదు. అటువంటి దశలో సంరక్షకులుగా వుండే పెద్దలదే తప్పు అనాల్సి వస్తుంది. ఇచ్చట స్త్రీ సంబంధమైన వేషధారణ విషయం గాబట్టి ఆపిల్లలను కన్న మాతృమూర్తినే వేలెత్తి చూపవలసి వస్తుంది. అదే విధంగా భర్తల మెప్పులకై అలంకరించుకొని, బజారులలో తమ భర్తలతో తిరిగే భార్యా మణులు లేకపోలేదు. "స్త్రీ"కున్న గౌరవం ఇంతకు దిగజారిందంటే దానికి కొంత వరకు "స్త్రీ" దే బాధ్యత అవుతుందేమో!

ఇవన్నీ చూసి అసహ్యించుకొనే మానవు లున్నారంటే స్త్రీ జాతి ఒప్పుకోక తప్పదు. అన్నీ టూస్తూనే వున్నాము అనుకరిస్తూ, ఆచరిస్తూనే వున్నాము తప్పులు తెలిసి కూడ వాటిని ధైర్యంగా ఖండించే ప్రజలు బహు కొద్దిగా వున్నారు.

గాన పురుషులతో సమానహక్కులు కలిగిన భారత స్త్రీ తనకు తాను తన పరిధిని తెలుసుకొని సంస్కృతి కనుగుణంగా, వయసు ననుసరించి, సంఘానికి సభ్యంగా, తన్ను తా నలంకరించుకొని, తనవాళ్ళకు దారి చూపిస్తూ, స్త్రీ జాతికే తా నొక ఆదర్శంగా, నడుచుకోమని మహిళాలోకానికి నా ప్రార్థన.

అలా జరిగిననాడు "అసభ్య వస్త్రాలంకరణ"కు సినిమాలలోగాని, సంఘంలో గాని చోటుండదని నాదృఢ విశ్వాసము.

—ఎం యాకూబ్ హుస్సేన్ (తిరుపతి)

## స్వధర్మాన్ని విడవకూడదు

కాలం మారుతోంది. దానితోబాటు సమాజం మారుతోంది అని అంటున్నారు కాని కాలం ఎప్పుడు మారదు. అప్పుడు, ఇప్పుడు ఎప్పుడు ఒకేవిధంగా వుంది. తూర్పున ఉదయించిన సూర్యుడు పడమరన అస్తమిస్తున్నాడు. ఇప్పుడు కొత్తగా పడమరన ఉదయించి తూర్పున అస్తమించడం లేదు. రోజుకు గంటలు 24. ఒకగంట ఎక్కువ, ఒకగంట తక్కువ లేదు. వేసవికాలం, వర్షాకాలం, శీతకాలం, ఈ మూడు కాలాలు లయతప్పకుండా ఒకదాని తరువాతఒకటివస్తున్నవి.మరికాలంమారిందం టెఅర్థం!?

ఈనాడు ఆడవారు మగవాళ్ళతో సమానంగా పురోగమిస్తున్నారంటె అది ఎంతో సంతోషించదగ్గ విషయం. కాని మన సంప్రదాయాలను విడవటం వివేకమైన పనికాదు. మామూలు భార్యభర్తలు కీచులాటలు ఎప్పుడూ వుండే రోదనలు ఆర్థిక బాధలు సినిమాలలో చూపమని కోరటం లేదు. కొంతమార్పు, హాస్యం, శృంగారం, నాట్యం మొదలైనవి వుండవచ్చు మేము కోరేదల్లా స్త్రీలకు వంటినిండా బట్ట యిమ్మని ప్రార్థిస్తున్నాము. కళారాధన ఈనాటిదికాదు. ఆదినుండి వస్తున్నది. రాజులకాలంలో నర్తకిలు ఉండేవారు. సామాన్య ప్రజలకు అందుబాటులో హరికథలు, బుర్రకథలు, వీధినాటకాలు జరుగుతుండేవి ఆనాడు సినిమాలేకపోవటం వల్ల వాళ్ళందరు ఏవిధమైన ఉత్సాహం వినోదం లేకుండా కాలం గడుపుతున్నారనుకోవటం హాస్యాస్పదం.

నిర్మాతలు లక్షలలో డబ్బు పెట్టుబడిపెట్టి ఎంతో శ్రమపడి అయిన వాళ్ళని కానివాళ్ళని కాళ్ళు పట్టుకొని తీస్తున్నారు. ఆ శ్రమ ఫలితంగా డబ్బు రావాలి. డబ్బు రాబట్టుకోవటానికి స్త్రీలను ఆటబొమ్మలుగా ఉపయోగించుకుంటున్నారన్న మాట. స్త్రీ అర్ధనగ్నంగా ప్రదర్శనలు యిస్తేనేగాని వాళ్ళకు డబ్బురాదు!? యిక యితరప్రదర్శనలు లేవా? ఎదుటివాళ్ళను చూచిమనం నేర్చుకోవలసినది ఏమిటి? హంస నీళ్ళపాలలో పాలను మాత్రమే త్రాగి నీరును వదిలి వేస్తున్నది. అలాగే మనంకూడా మంచిని గ్రహించి చెడును వదిలి వేయాలి. వాళ్ళు ఈవిధంగా ప్రవర్తిస్తున్నారు కనుక మనం కూడా ప్రవర్తించటమేనా? మంచి, చెడు లేదా?

అమెరికా మనకంటే ఎంతో పురోగమించింది మనం కూడా వాళ్ళతో సమానంగా పురోగమిస్తున్నందుకు చాలా సంతోషించ వలసిన విషయం. కాని వాళ్ళలాగ నగ్న చిత్రాలు తీసి చూచి ఆనందించటం హర్షించ వలసిన విషయంకాదు. వాళ్ళ సంస్కృతి వేరు మన సంస్కృతి వేరు, తనకి నచ్చని పక్షంలో భర్తకువిడాకులు యిచ్చియింకొకరినిచేసుకుంటుంది. ఎన్ని వివాహాలు చేసుకున్నా ఫరవాలేదు అక్కడి స్త్రీకి మనకి అలాకాదు. కష్టమైనా సుఖమైనా జీవితాంతం ఒకభర్తతో నేవుంటుంది అపస్నీ దైవంలా పూజిస్తుంది. అటువంటి ఈదేశంలో పుట్టినందుకు మనం ఎంతో గర్వించాలి అమెరికా [illegible] స్త్రీ పురుష భేదం లేకుండా అందరు బాబ్డ్ హెయిర్. చిన్నవాళుదగ్గరనుండి పెద్దవారి వరకు అందరు ఫ్రాక్కులు వేసుకుంటారు. మరి మనం ఎందుకు ఆరెండు విషయాలు ఆచరించటం లేదు?

సినిమాలకు వెళ్లే వాళ్ళు ఎక్కువ దీనా

# చర్చ

యాలకు వెళ్ళేవారు తక్కువ అయినందుకు మనం సిగ్గుపడాలి. అసలు సినిమాలను పవిత్రమైన దేవాలయములతో పోల్చడమేమిటి? నక్క ఎక్కడా నాగలోకం ఎక్కడ? తిరుపతి, కాశీ రామేశ్వరము కంచి, కాళహస్తి మొదలగు పుణ్యక్షేత్రాలను ఎంతో ఎంతో డబ్బు ఖర్చు పెట్టి యాత్రికులు చూస్తున్నారే. సినిమాకొరకు అంతడబ్బు ఖర్చు చేసి చూస్తారా? ఒక్కసారి చూచిన సినిమా రెండవసారి చూస్తే తలనెప్పి వస్తుంది. కాని దేవాలయంలోని దేవుని మనం ఎన్నిసార్లు దర్శించినా యింకా చూడాలనిపిస్తుంది. దేవాలయాలకువెళ్ళేటటువంటివారు స్నానముచేసి శుచిర్భూతులై పరిశుభ్రమైన వస్త్రములు కట్టుకొని కాళ్ళుజోడు లేకుండా శ్రద్ధా భక్తులతో దేవుణ్ణి దర్శించుటకు వెళ్ళుతారు. సినిమాకు వెళ్ళేవారు ఆవిధముగా కాకుండా ఎవరికి యిష్టమువచ్చినట్లు వారు కృత్రిమ అలంకారముతో వెళ్ళుతున్నారు. మరి ఏవిషయంలో సినిమాను పవిత్రమైన దేవాలయముతో పోల్చి చూస్తున్నారు?

"అధర్మాభి భవాత్ కృష్ణ! ప్రదుష్యన్తి కులస్త్రియః,
స్త్రీషుదుష్టాసువార్ష్ణేయ! జాయతేవర్ణ సంకరః,.
సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ,
పతన్తి పితరో హ్యేషాం లుప్త పిండోదక క్రియాః".

అధర్మము వృద్ధిపొందుటచే, కులస్త్రీలు చెడిపోవుదురు. స్త్రీలు చెడిపోవుటచే వర్ణసంకరమేర్పడును. అట్టి వర్ణసంకరము వలన సంకరము చేసినవారికి, సంకరము పొందిన కులమునకు గూడ నరకము సంప్రాప్తించును. వారి పితృ దేవతలు శ్రాద్ధములు తర్పణములు లేనివారై యధోగతిని బొందుదురు. అని భగవద్గీతలో ఉంది.

మన భారతీయ స్వధర్మము విడిచి యితరులను అనుసరించటం మంచిదికాదు. ఆడవారు నైలాను, టెరిలీను వాడుతున్నారంటే వారుసినిమా నుండే నేర్చుకున్నది. సినిమాలను చూచి నేర్చుకోకుండా ఎవరిని చూచి నేర్చుకుంటున్నారు? టెరిలీను, నైలాను మొదలగు బట్టలు ప్రభుత్వము ఉత్పత్తి చెయ్యటం మానివేస్తే వీరికి ఆదుస్తులు దొరకక పోవుట వలన అప్పుడు తప్పక నేతబట్టలు వాడుతారు. పిల్లలు తప్పుచేస్తే వాళ్ళను సరిచేసే బాధ్యత తల్లిదండ్రుల మీద ఉన్నట్లు ప్రజలు తప్పుచేస్తే వారిని సరిచేసేబాధ్యతప్రభుత్వానిది. తప్పులు చేసే వారిని సరిచేయకుండా యింకా ఎక్కువ తప్పులు చేయించటం లౌక్యము కాదు. మేము కోరేదల్లా మీ కళారాధన పేరుతో స్త్రీలు సిగ్గు పడేటట్లు చెయ్యవద్దని ప్రార్థిస్తున్నాము. —ఆర్. వరలక్ష్మి (రాజమండ్రి)

'సినిమాలలో అసభ్య వస్త్రాలంకరణ'పై చర్చని ఈ వారంతో ముగిస్తున్నాము. పాఠకులు దీనిని గమనించ కోరుతున్నాము.

—సం॥

# ...బృహత్కథామంజరి

(13 వ పేజీ తరువాయి)

కుమాళ్ళ వెంట రాగా, కుండలు తల మీద మోసుకొని వెళ్ళుతూంది. వాసవదత్త దానిని చూచి, "పామరులైన స్త్రీలకు గూడ దైవం సంతానమిస్తున్నది. నేను మందభాగ్యురాలను. నాకు సంతానం కలిగే భాగ్యంవుందా?" అని చింతించింది. ఆమె కన్నులు నీళ్ళ నిండాయి.

పింగళ చూచింది. "దేవీ! విచారపడకు. సమర లక్ష్మి విజయం పొందినట్లు నీవు కుమారుణ్ణి పొందుతావు. వీధిలోని పందుల వంటి పాపులకు సంతానం ఎక్కువ. సత్వవంతులయిన పుణ్యాత్ములు క్వచిత్తుగా జన్మిస్తారు. నీకు గొప్పకుమారుడు కలుగుతాడు. చింత పడకు." అని ఊరడించింది.

బ్రాహ్మణి మాటలతో వాసవదత్త విచారం కొంచెం తగ్గింది. వత్సరాజు గూడ ఆమె విచారం తెలుసుకొని వచ్చి, ఆమెకు ధైర్యం కలిగించాడు.

వాసవదత్త పుత్రుల కోసం శివుణ్ని ఆరాధించింది, తపం ఆచరించింది. శివుడు ఆమె ఆరాధనకు, తపస్సుకు సంతోషించాడు. స్వప్నంలో కనిపించాడు. "స్మరావతారుడయిన పుత్రుడు నీకు కలుగుతాడు!" అని వరమిచ్చాడు. తెల్లని కాంతులు ఈనుతూ, జటామండలంతో ఆకాశాన్ని వ్యాపిస్తున్న శివుడు ఆమెకు స్వప్నంలో ఒక ఫలం కూడా అనుగ్రహించాడు. ఈ సంగతిని ఆమె రాజుకు తెలియజేసింది.

వాసవదత్త శివుని వరంతో గర్భం ధరించింది. ఆమె దేహకాంతి హెచ్చింది. ఆమె గర్భం ధరించినందుకు రాజు చాల సంతోషించాడు. చంద్రుడు లోపల వున్నప్పటి క్షీరసముద్ర రేఖలాగా, షడాననుణ్ణి ధరించిన జాహ్నవిలాగ ఆమె అప్పుడు కనిపించింది. కొన్నాళ్ళకు ఆమెలో దౌహృద లక్షణాలు స్పష్టంగా కనిపించాయి. ముఖం తెల్లబారింది. నిజంగానే చంద్రుడితో పోటీ పడసాగింది. ఆశలింతలు ఎక్కువయ్యాయి. అలసత్వం హెచ్చింది. అందమైన పొట మీది మూడు ముడుతలు మాసిపోయి దేహం మరింత రమ్యమయింది. వేవిళ్ళ కాలంలోని సంకల్పాలు ఆమెకు కలుగబోయే కుమారుని గొప్పదనం సూచించాయి. ఆకాశంలో తిరుగాలనే ఆశ కలిగింది ఆమెకు.

ఆమె కోరిక తీర్చడానికి రాజు యంత్రాల విమానం నిర్మింపజేశాడు. దానికి మహావేగంగా వెళ్ళే గుర్రాలు కటించాడు. ఆవిధంగా ఆమె ఆకాశ గమన వాంఛను తీర్చాడు. ఆమెకు విద్యాధరుల కథలు, వింత వింత అయినవి వినాలనే కుతూహలం కలిగింది. యౌగంధరాయణునికి ఈ సంగతి తెలిసింది. అతడు రాజు ఉండగా, ఆమె నగరుకు వచ్చి ఇలా అన్నాడు.—"దేవీ, ఉన్నత సత్వుడు, ఉన్నతాచారవంతుడు అయిన పుత్రుడు నీకు తప్పక కలుగుతాడు. లేకపోతే నీకు గగన విహారంలోను, శుభ విషయ శ్రవణంలోను ఆశ ఎందుకు కలుగుతుంది? అమృతం వర్షిస్తూ, ఆ హర్షం కలిగించే విద్యాధర కథను వినిపిస్తాను. నీ మనోరథాల ఫలమైన శుభలక్షణయుతుడైన పుత్రుడు కలుగుతాడు." (ఇంకా ఉంది)

# సర్వదా సర్వోత్తమం




* అసమాన సౌరభ్యంలో
* అనుపమ రుచిలో
* కరకరలాడే తాజాదనంలో
* సాటిలేని పుష్టికరంలో సర్వదా సర్వోత్తమం—




## గ్లూకో

బిస్కట్లు




అందుకే పార్లే గ్లూకో భారతదేశంలో
అత్యధికంగా అమ్మకముగుచున్న బిస్కట్!

everest/340cr/PP TL




'అరుణా నీకు లెటరొచ్చింది...' శ్రీమతిని పిల్చేడు సూర్యం. తడి చేతులను పరెకొంగుకు తుడుచుకుంటూ 'నా ముఖం నాకు వుత్తరం యెక్కడినుంచి వస్తుందండీ?...' అని వుత్తరం చేతిలోకి గుంజుకుని చించి గబగబా చదివేసి కపకా నవ్వేసింది అరుణ.

'అంతగా నవ్వేస్తున్నావు...ఏదైనా లవ్ లెటరా...' జోక్ చేశాడు.

'బాగానే వుంది మీ విట్టు...' తల అదోలంగా ఆడించింది.

'అదికాదు అరుణా! పెళ్లి ఐనవాళ్ళు ప్రేమించకూడదనే నిబంధన్లు ఏమీలేవు.'

'ఆ పాటింపు మగవారి కుండదేమో... అది సరే...ముందీ వుత్తరం చదవండి...'

అరుణ అక్కకు,

నీకు నా ఆశీస్సులు!: కాదు...కాదు... నమస్సులు!!—నువ్వు తల్లివి కాబోతున్నావని తెలిసింది

ఆడపిల్లనే కను.—బావగారి నింతవరకూ చూడలేదు యెలా వుంటారు?...

బావగారు గిరీశంలావుంటారా? బి. సి. నాటి తెలుగు మష్టారిలా వుంటారా??

ఇంతకూ విషయ మేమిటంటే మద్రాసులో 'వరల్డుఫేర్' జరుగుతోంది

బావగారూ నువ్వూ వెంటనే బయల్దేరి రండి— రాధ

'అరుణా ఎవరీరాధ? ఏమాకథ??—' అర్థంకాక అడిగేడు.

'కంగారు పడకండి మనిషికూడా అంతకంటే కరుకుగా, చురుకుగా వుంటుంది. మెరుపులాటి మనిషి తళుకులాటి మనసు ... ఆఁ ... ఇంతకూ ఏమంటారు??—'

'ఏ విషయం?...'

'మనం మద్రాసు వెళ్ళేవిషయం!!'

'పారె! లేడిక్కి లేచిందే పరుగా? అయినా మీ ఆడాళ్లతో ఏదొచ్చినా యింతే!! ... వూపిరి సలుపనీరు...సరేకాని...వెళ్లిరా!!—'

'మీరూ రారూ?!—'

'నేనా? బాగానే వుంది! నేను ఏ అమ్మకన్న ఆడపిల్లనో ఐనవారి అర్ధాంగినో అయితే నీకు మల్లే రెడీ అయ్యేవాడివి. కానీ...ఖర్మ!!...నాకు వుద్యోగమంటూ ఒకటుంది. శలవు మంజూరవద్దా?...'

'మన్నాటి అరవై రెండు రోజులూ ఆఫీసుకు వెడుతునే వుంటారుగదా... మరి మీకుండే శలవులన్నీ పిల్లలు పెడతారా ఏమిటండీ ? !...'

'ఆ...ఆ...ఆ ప్రశ్నే ఆఫీసరు నడిగితే నాబోటి బొడ్డూడని గుమాస్తాగాడికి ఐదోతనం లేకుండా చేస్తాడు.'

'అంత భయపడుతూ ఉద్యోగం చెయ్యకపోతే నేం...'

'అబ్బా! ఎంత తేలిగ్గా అన్నావ్ పోనీ మీ వాళ్లు సంపాదించి వెనకేసిన 'నల్ల డబ్బే'దైనా వుంటే చెప్పు. పౌరుషంగా వ్యాపారమేదైనా చేద్దాం...'

'మీ వేళా కోళానికేం గాని...భోజనానికి లేవండి. మీ ఆఫీసు టైమవుతోంది' అంటూ ఇంట్లోకెళ్ళింది.

* * *

రైలు స్టేషన్లో ఆగింది.

అరుణ కంపార్టుమెంటులోంచి దిగటం చూసిన రాధ 'హలో...వచ్చేశావే!...' అనేసింది ఆనందంతో.

పెట్టె. బెడ్డింగు, ఫ్లాస్కు, మరి చెంబు వగైరా వగైరా అన్నీ వచ్చాయో లేదోనని లెక్కచూస్తున్నాడు సూర్యం.

'అక్కా! బావగారు రాలేదా ?...' దిక్కులు చూస్తూ అడిగింది రాధ.

సూర్యం రాధ కళ్లల్లోకి చూసి తనే బావనన్నట్టు నవ్వేడు.

రాధను ఆపాదమస్తకం పరికించేసరికి సూర్యం వంట్లో నరాలు స్తంభించాయి. హాలీవుడ్లో సోఫియాలారెన్‌ను చూసినట్టు, స్వర్గంలో రంభను చూసినట్టు అనిపించింది.

ముగ్గురూ టాక్సీలో ఇంటికి బయల్దేరారు.

పెళ్లికి రాలేకపోయినందుకు క్షమాపణ చెప్పుకుంటోంది రాధ అరుణతో. రాధా బాధితుడు ఫ్రంటుసీట్లో కూర్చోవటం వల్ల వారి ముచ్చట్లల్లో పాలు పంచుకునేందుకు వీల్లేకుండాపోయింది

ఇంట్లో వాళ్ల మర్యాదలు చూస్తుంటే మతి పోతోంది సూర్యానికి. అప్పుడేటు ఫర్నీచరు, ఫాన్లు, ఫోను, రేడియో ఇంకా బోలెడు మోడరన్ స్టయిల్లోవుంది ఇల్లు.

మేడమీద గది ప్రత్యేకంగా సూర్యం దంపతులకు కేటాయించారు.

ప్రతి పదినిముషాలకి ఇంట్లోవారి పరామర్శ చూస్తుంటే సూర్యానికి సిగ్గేస్తోంది.

ఇంట్లోనే కేరమ్సు, చెస్సు, మేగజేన్సు ఇంకా యెన్నోవున్నాయి కాలక్షేపానికి.

రాధ పలుకరించినప్పుడల్లా, 'అవును— కాదు' అనేసి మాత్రమే చిలకలాగ సమాధానమిస్తున్నాడు సూర్యం.

* * *

ఉదయం ఎనిమిది కావస్తోంది.

సూర్యానికి మేలుకొలుపు పాడుతోంది అరుణ.

రాధ కాఫీకప్పుతో గదిలోకొచ్చింది. 'అక్కా! బావగారు కుంభకర్ణుడి బ్రదర్లా వున్నారే...' అనకుండా వుండలేకపోయింది.

రాధ సూర్యాన్ని హేళన చెయటం ఇది ఇరవయ్యోసారి. దెబ్బతిన్నాడు సూర్యం. తను కిక్కురుమనకుండా వూరుకోవడం సమంజసంగా తోచలేదు. తిరుగుదెబ్బ కొడదామంటే పక్కనేవున్న శ్రీమతి ఏమనుకుంటుందోనని నోరు నొక్కుకోవలసివచ్చింది.

కాలకృత్యాలు పూర్తిచేసేసరికి తొమ్మిది దాటింది. సూర్యం న్యూస్‌పేపరు తిరగేస్తున్నాడు. అరుణ 'వూలు'తో పుట్టబోయే బాబుకు స్వెట్టరు కుడుతోంది

'అక్కా. కాస్సేపు పేకాడుకుందాం' అంది గదిలోకొచ్చిన రాధ.

'సై రెడీ' అన్నట్టు చదువుతున్న పేపరు పక్కన పెట్టాడు సూర్యం.

'సరే మొదలెట్టండి' అన్నట్టు రాధ వేపు చూసింది అరుణ.

పేక కలుపుతున్న రాధ సూర్యం ముఖంలోకి చూసి 'అక్కా! బావగారు అచ్చు 'రాక్‌హడ్సన్'లా వున్నారు. ఇంతోటి అందం నీకు అందటం నీ అదృష్టం అక్కా..' చెణుకు విసిరింది

'మీ అక్కను చేసుకోకపూర్వం నీలాంటి ఎలిజబెత్‌టైలర్' వాకళ్ల బడ్డేడు...' అనేవాడు చటుక్కున. తర్వాత తన తొందరపాటుకు నాలుక్కర్చుకున్నాడు.

'ఊఁ...బావగారు ప్రవరాఖ్యులేమో అనుకున్నాను. మంచి వరసులే...'

అంతకుమించి సంభాషణ పొడిగిస్తే అరుణ మనసు నొచ్చుకోవచ్చునేమోనంటంతో మారు మాట్లాడలేదు సూర్యం.

ముగ్గురూ నవ్వుకున్నారు.

'అక్కా! సాయంత్రం సినీమా కెడదాం. ఏం?'

'నేనెందుకు రాధా...'

'అవునురాధా! మీ అక్కను బలవంత పెట్టకు. అసలే లేవలేని మనిషి కూడాను... ఇంకా యేదో చెప్పబోయాడు.

'అక్క రాకపోతే అసలు ప్రోగ్రామే కాన్సిలు చేద్దాం...' అలిగింది రాధ.

ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

సాయంత్రం ముగ్గురూ టాక్సీలో థియేటరు చేరుకున్నారు.

సూర్యాని కిరువైపులా రాధ అరుణ కూర్చున్నారు.

రాధ 'చిప్సు' కొన్నది అరుణ 'పాప్‌కారన్' కొంది. సూర్యం చంటి పిల్లాడిలాగ చాక్లెట్లు కొన్నాడు. రాధ నవ్వింది.

సినిమా ఆరంభమైంది.

ఇంగ్లీషు పిక్చరుకావటంతో ముగ్గురు మాంఛి మూడ్సుతో సినిమా చూడటంలో లీనమయ్యారు.

ప్రతి ఐదునిముషాలకీ రాధ ఏదో కామెంటు చేస్తూనేవుంది ప్రతి పదినిమిషాలకు సూర్యం ముఖంలోకి చూచి నవ్వుతోంది.

భార్య ప్రక్కనే వుందనే భయం ఓవేపు. రాధ కంపెనీ హేపీగా స్పెండ్ చేయలేక పోతున్నాననే బాధ మరోవేపు

అరుణ తనవేపు క్రీగంటి చూపులు చీకట్లో విసురుతుంటే తను జాగ్రత్త వహిస్తూ గమనిస్తూనే వున్నాడు సూర్యం.

రాధవాళ్ళ లేసవాళ్ళను గిరటం రాధ చేతులు తన చేతులకు తగలటం చూస్తూ తనను తాను నిగ్రహించుకోవటం తప్ప మరేమీ చెయ్యలేక పోతున్నాడు

గంటన్నర సినిమా పదినిముషాల్లోనే ఐపోయిందేమో అనిపించింది సూర్యానికి.

ముగ్గురూ ఇల్లు చేరుకున్నారు

రాధ సౌందర్యం, సౌజన్యం.. ఇత్యాదులే మనసులో మెదులుతున్నాయి సూర్యానికి. ఆమె మనస్తత్వ మెలాంటిదో అర్థంకాక సతమతమవుతున్నాడు

కైపెక్కించే కళ్లు కసిగా వుండే చూపులు, మత్తెక్కించే మాటలు సూర్యాన్ని ఇహంలోంచి పరంలోకి ప్రయాణం కట్టిస్తున్నాయి.

కళ్లు రెండూ గట్టిగా మూసుకుని నిద్రలోకి జారిబడ్డాడు.

* * *

అర్ధాంతరంగా తెల్లవారింది.

తొమ్మిది కొట్టేసరికి రాధ కాఫీ కప్పుతో సూర్యం గదిలో తయారైంది మళ్ళీ.

పేపరు చదువుతున్న సూర్యాన్ని చూస్తూ, 'బావగారూ కాఫీ!...సెకండు డోస్ ప్లీజ్!!' అంది.

అరకప్పు కాఫీని ఆర్చుకు ఆర్చుకు తాగకుండా రాధ కళ్ళల్లోకి తీక్షణంగా చూస్తూ అర్ధ సెకండులో జారేశాడు.

'ఏమిటట్లా చూస్తున్నారు. .'రాధ ప్రశ్న.

'నీ అందాన్ని! కళ్ళల్లో ఇమిడి వున్న ఆనందాన్ని! అనేద్దామనుకున్నాడు కానీ నోరు పెగల్లేదు.

'రాధా ... మీ అక్కేది? -' అడిగాడు మామూలు ధోరణిలో.

'అక్కా...అమ్మా కలిసి బజారెళ్ళారు. . ఏదో కొనాలట'...ఎటో చూస్తూ అంది

'అందుకేనా ప్రొద్దున్నే నామీద యుద్ధానికి బయల్దేరింది'

'యుద్ధాలా...!? . బావగారూ...'

'ఆఁ...' అన్నాడు మరోలోకంలో విహరిస్తున్న మనసును కళ్ళెమేసి వెనక్కులాగి.

గదిలో గుండ్రంగా తిరుగుతూ, కిటికీ లోంచి బైటికి చూస్తూ 'దేనంటగా వున్నారా బావగారు...' ఏడిపించాలని అన్నది రాధ.

'నువ్వా?! నీకేం...'

'అంతా అబద్ధం!!—'

# ఆడమనసులు...

'నిజం రాధా. నేను కవిని కాదుగాని... లేకపోతే నీ అందంమీద కావ్యం వ్రాసి ఇచ్చేవాడిని...'

'చాలు బావా!...చాలు!!'

'ఏం?—?'

'మరేం లేదు. నన్ను అనవసరంగా పొగడి మునగచెట్టు ఎక్కిస్తున్నారు. ఈ మాటలు అక్కవింటే నిన్ను పిచ్చాసుపత్రికి పంపుతుంది...'

'నిన్ను చూస్తూ...నీతో మాట్లాడుతుంటే నాకు నిజంగా పిచ్చెక్కుతోంది...'

'అమ్మో! కవిగారూ!—మా బావగారూ!! మీరు అనవసరంగా భావలహరిలో తేలి మా ప్రాణం తియ్యకండి. సాయంత్రం మనమంతా కలిసి వరల్డ్ ఫేర్ చూసేందుకెళ్ళాలి. అది చెప్దామనే వచ్చాను. ఇక వెడతా...' వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది రాధ

సూర్యం నెత్తురు వుడికి పోయింది.

రాధ బుజాలను వెనకనుండి పొదివి పట్టుకుని బలంగా తనకేసి తిప్పుకున్నాడు.

బిత్తరపోయింది రాధ

రాధ ముఖంలోకి చూడలేకపోయాడు సూర్యం.

'నేను అందరిలాంటి మనిషిని కాదా బావా?...మంచి మనసుతో స్వతంత్రంగా




నీతో చొరవగా వుంటున్నంతమాత్రాన రాధ పసిహృదయాన్ని మసి చేస్తావా?—నీ పశుత్వానికి బలి చేస్తావా?—నన్ను ఆనందించు బావా...కాదు...కాదు...నీ అమానుష చర్యలకు నన్ను బలితీసుకో...' అని ఇంకా ఏవేవో భావాలు రాధ చూపుల్లో నిండిన కన్నీటిలో చూడగలిగేడు సూర్యం.

సూర్యం చేతులు నరికినట్టనిపించింది.

అప్రయత్నంగా రాధ భుజాలమీద వున్న రెండుచేతులు విడిపోయినయి—

గబగబా వెళ్ళిపోయింది రాధ

తన బలహీనతకు తనను తాను తిట్టుకున్నాడు

ఈ విషయం అరుణకు తెలిస్తే? మళ్ళీ తన పాపిష్టిముఖాన్ని రాధకేవిధంగా చూపించగలడు?—మామూలు మనిషిలా రాధ తనతో మళ్ళీ మాట్లాడుతుందా?—

ఆలోచన్లతో తల బద్దలవుతోంది. సిగరెట్ వెలిగించాడు

'వరల్డ్ ఫేరు' చూసేందుకు బైటికి బయల్దేరే ప్రయత్నంలోవున్న సూర్యం గదిలో డ్రస్ చేసికుంటున్నాడు

కాఫీ కప్పుతో గదిలోకొచ్చింది రాధ.

'త్వరగా తయారవండి బావగారూ అబ్బ...మీరు ఆడవారికంటే మరీ ఆలశ్యం!!' కాఫీ అందిస్తూ అంది.

తలెత్తి రాధ ముఖంలోకి చూడలేకపోయాడు. తప్పుచేసిన వాడిలా ఫీలవుతూ సిగ్గుపడుతున్నాడు.

'రాధా...నన్ను క్షమిస్తావా?...' హీనస్వరంతో గొణిగేడు కాఫీకప్పు చేతిలోకి తీసుకుని యెటో చూస్తూ...

'ఛ!... అదేం మాటలు...నువ్వు మంచి మనిషివి బావా...' అనేసి నవ్వుతూ వెళ్ళిపోయింది.

'ఎంత మంచి మనసు రాధా నీది...' అనుకున్నాడు సూర్యం.

సూర్యం, అరుణ, రాధ ముగ్గురూ 'ఫేర్ గ్రౌండ్సు'కు ఐదుగంటలయ్యే సరికి చేరుకున్నారు.

పుట్టబోయే పాపకోసం ఆట వస్తువులు కొన్నాడు సూర్యం. అరుణ మంచి చీర ఖరీదు చేసింది. రాధ కొత్తమోడలు హైహీలు షూ కొన్నది.

అలా అలా నడుచుకుంటూ చీకటి పడే

'రికి 'జయింట్ వీల్' దగ్గరకొచ్చారు.

దీపాలు వెలిగాయి — రకరకాల దీప కాంతులతో ప్రదేశమంతా భూతల స్వర్గంలా వుంది.

'అరుణా! రంగులరాట్నం యెక్కుదామా?—' అడిగేడు సూర్యం.

'అమ్మో!... కళ్ళు తిరుగుతయ్...నాకు భయం బాబూ!!—'

'రాధా!...మరి నువ్వో?—'

'నే రెడీ!—'

రాధా సూర్యం ఇద్దరూ ఒకే తొట్టిలో కూర్చున్నారు. వీల్ తిరగనారంభించింది.

ఒక రౌండు పైకివెళ్ళి క్రిందకొచ్చే సరికి భూమి తల్లక్రిందులుగా తిరుగుతున్నట్లనిపించింది. అంత ఎత్తుకు వెడుతుంటే రాకెట్లో కూర్చుని చంద్రమండలంలోకి వెడుతున్నట్లనిపించింది.

రాధకు భయం వేయటంతో కళ్ళు రెండూ గట్టిగా మూసుకుని సూర్యం వడిలో తల పెట్టుకుంది.

రాధ పసితనానికి, అమాయకత్వానికి నవ్వుకున్నాడు సూర్యం.

మూడురౌండ్లు అయ్యాక ఇద్దరూ క్రిందికి దిగేరు.

'అక్కా...అందులో కూర్చుని అలా పైకి వెళ్ళి క్రిందకు వస్తుంటే యెంత హాయిగా వుందనుకున్నావు... నువ్వూ ఒకసారి ఎక్కి చూడవూ?...'

'వద్దులే రాధా! మీరు తిరిగొచ్చేరుగా... చాలు!! ఇక వెడదాం పదండి!!—' అరుణ సమాధానం చురుకుగా వుంది.

'పోవే రాధా! మీ అక్క యెప్పుడూ అంతే!!—'

'అప్పుడే ఇంటికా ... ఇంకా చూడాల్సినవెన్నో వున్నాయి!! మనం సగమైనా చూడలేదు...'

'నేనిక నడవలేను. అలసటగా వుందమ్మా!!—'

'అక్కా! నువ్విక్కడే వుండు. నేనూ బావా వకసారి అన్నీ చూసి వస్తాం...!'

కాదనలేక పోయింది అరుణ.

అరుణ అడి మనసులో విచిత్రమైన ఆలోచనలు అల్లుకున్నాయి?!— రాధ ధోరణి, ప్రవర్తన, అర్థం కాకుండా వుంది. ఒక్కొసారి మనసుకు బాధనిపిస్తున్నప్పటికీ పర్ద కోక తప్పటంలేదు. ఏమిటీ స్వతంత్రం?— యెదుటి భర్తతో?...ఛ! ఛ!! రాధ పెళ్ళిగాని ఆడపిల్ల ... ఎంత చదువు, సంస్కారం వుంటే మాత్రం...తన కళ్ళ మీద అనవసరమైన అభాండం వేసి మరోవిధంగా అపార్థం చేసుకోవటం తప్పుగా తోచింది.

## ఆడమనసులు...

ఇంకా ఎన్నో ఆలోచన్లు స్ఫురింప దిస్తున్నాయి—

సూర్యం, రాధా నవ్వుకుంటూ వచ్చారు.

'మాడటమంతా ఐనట్లేనా? ఇంకేమైన మిగిలి వుందా??' అరుణ మాటల్లో ఎత్తిపొడుపు, కోపం, విసుగు, బాధ ఇంకా యెన్నో అర్థాలు ధ్వనించినట్లు సూర్యం అర్థం చేసుకోగలిగాడు.

'అట్లా వున్నావేం అరూ?— వంట్లో బాగోలేదా?—' మాట మారుస్తూ పరామర్శగా అడిగేడు సూర్యం.

'మీకెంతకీ ముందు చూపేగాని ... వెనకాలోచన లేదు. ఇవతలి మనుష్యులు ఛస్తున్నారని కూడా అర్థంకాదు...'

'ఏంటక్కా?—ఏమైంది??—' రాధకేమి అర్థం కాలేదు.

'సర్లే అరూ ... ఇక ఇంటికెడదాం పద!!—' సమాధాన పర్చాడు సూర్యం.

ముగ్గురూ ఇల్లు చేరుకునేసరికి పది గంటలు దాటింది.

భోజనంచేసి గదిలో మేడమీద పడుకుని సిగరెట్ వెలిగించాడు సూర్యం.

అరుణ ముఖంలో రంగులు మారటం, మనిషి విసుగ్గా, విసురుగా వుండటం గమనిస్తూనే వున్నాడు.

'కోపంగా వున్నావేం అరూ ?—'

ముఖం పక్కకు తిప్పుకుంది.

'అరూ !—యెందుకట్లా వున్నావ్?!'—

'ఎందుకా?—మీరు చేస్తున్న పన్లకు!!—' విసురుగా అంది.

'ఏమిటి నువ్వనేది ?—'

'ఏమిటా ?!—పెళ్లిగాని ఆడపిల్ల దాని కెట్లాగూ తెలీదు...మీకైనా కాస్త వెనక ముందు ఆలోచించక్కర్లేదూ ??—'

'నీ కేమైనా మతిబోయిందా ?—?'

'పరదాలకు, సరసాలకూ అంతూ పొంతూ వుండద్దూ. రాధ అవుపించేసరికి మీ కళ్లు కుట్టాయి. మిమ్మల్ని మీరు మర్చిపోయారు.—మొన్న సినిమాహాల్లో మీ భాగవతం నేను చూడలే దనుకున్నారు. ఇందాక మటుకు ఇందాక ఇద్దరూ రంగులరాట్నం పంకతో ఒకే తొట్లో కూర్చోటం!... మీ వొడిలో అది తలవాల్చటం!...అబ్బ!! ఇవతల నేనున్నానని

కూడా లెక్కలేదు.—'

'ఏమిటా మాటలు అరూ. యెందు కలా రాధను ఆడిపోసుకుంటావ్ ? —'

'ఏం పాపం ? ... దానికి వత్తాసొస్తున్నారా ! !...'

'అర్థంలేని స్వార్థంలో నువ్వనే మాటలు రాధ వింటే ... ఆ అమాయక హృదయం యెంత బాధపడ్తుందో తెలుసా ?...'

'నిజం అంటే బాధ దేనికి...'

'ఛీ ! ! నువ్వు ఆడదానివి కాదూ ?!— సాటి ఆడపిల్ల సహృదయాన్ని అర్థం చేసుకోలేని నువ్వు మనిషివి కాదు ... నీకు తెలీదు అరూ...రాధకు వయస్సు పెరిగిందే గాని మనసు పెరగలేదు ఆలోచన్లు పెరగలేదు రాధ ఇంకా నా దృష్టిలో చిన్నపిల్లే ! అందుచేతనే యెంతో అమాయకంగా, అప్యాయంగా పసిపిల్లలా ప్రవర్తిస్తోంది — నువ్వు చెప్పినవన్నీ నిజమే !— కానీ అలా చేయటం వెనకాల రాధకు యెలాంటి దురుద్దేశ్యం గాని, దురాలోచన గాని లేదు.— మనిషినే గాని రాధ మనసును ఆడదానివై యుండికూడా నువ్వు అర్థం చేసుకోలేక పోయావ్...'

'మీ రూరుకోండి నా కంతా తెలుసు మిమ్మల్ని చూచిన క్షణం నుండీ అది కళ్లల్లో నిప్పులు పోసుకుంటూనే వుంది.— అదే నా స్వంతచెల్లే గనుకైతే ..'

'తప్పు !...అరుణా...అమాయకు రాలిపై అభాండంవేసి వెళ్లిపోవటం మనకు మంచిది గాదు అరూ...'

అంతవరకూ తలుపు ప్రక్కనేవుండి సంభాషణ వింటున్న రాధ లోపలికొచ్చి 'క్షమించక్కా ! నేనే నీ లోబుట్టువునై వుంటే కొట్టి కసితీర్చుకునే దానివి — ఇప్పుడుమాత్రం ఏం తక్కువ ... అయినా తప్పంతా నాది. ఎప్పుడో ఒకప్పుడు ఒక వూళ్లోవుండి ఒక క్లాసులోనే చదువుకున్న మనిద్దరిమధ్యా ఇంతటి మమకారం దేనికుండాలి?! అంతా నా పిచ్చి' నా తెలివి తక్కువ తనం !! యెంతో ప్రేమతో నిన్ను రమ్మని ఆహ్వానించాను నీ హృదయం గాయపర్చి పంపుతున్నాను — ఇప్పుడు తెలుసుకో గలిగేను...నన్ను మనస్ఫూర్తిగా క్షమించు అక్కా...' అనేసి రివ్వున మేడ మెట్లుదిగి వెక్కివెక్కి ఏడుస్తూ వెళ్లిపోయింది. ●

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## 1968 దీపావళి కథల పోటీ

ఎప్పటివలెనే ఈ సంవత్సరం కూడా 'ఆంధ్రసచిత్ర వారపత్రిక దీపావళి కథల పోటీ' నిర్వహించబోతున్నదని తెలపటానికి సంతోషిస్తున్నాము. రచయితలందరూ ఎప్పటి వలెనే మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చేస్తారని ఆశిస్తున్నాము.

**మొదటి బహుమతి రు. 2100**

**రెండవ బహుమతి రు. 1500**

**మూడవ బహుమతి రు. 500**

### నిబంధనలు

1. కథలు స్వంత రచనలై ఉండాలి. ప్రతి కథతోనూ రచయిత అది తన స్వంత రచనే నని, దేనికీ అనువాదంకానీ, అనుసరణకాని కాదని హామీరాసి పంపాలి ఈ హామీలు వేరే కాగితం మీద కాకుండా కథ వ్రాతప్రతి మీదనే రాసి ఉండాలి.

2. కథలు తెలుగువారి జీవితానికి సంబంధించి ఉండాలి.

3. వ్రాతప్రతి మీద "దీపావళి కథలపోటీకి" అని స్పష్టంగా రాయాలి. కాగితానికి ఒక వైపు మాత్రమే సిరాతో రాయాలి. రచయితపేరు, పూర్తి చిరునామా కూడా వ్రాతప్రతి మీద స్పష్టంగా రాయాలి. రచనలు 12 అరఠావు (ఎక్సర్సైజు నోట్‌బుక్ పేజీకి రెండు రెట్లు) పేజీలకు మించరాదు.

4. కవరుమీద "దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి. పోటీకి రచనలు 'సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టిస్ట్రీట్, మద్రాసు—1'కి పంపాలి.

5. పోటీ గడువు తేదీ 14—8—68. ఆ తర్వాత మా కార్యాలయానికి చేరిన కథలని మామూలుగా ప్రచురణకి పరిశీలిస్తాము.

6. పోటీలో బహుమతి పొందిన కథలని 'దీపావళి ప్రత్యేక సంచికగా' వెలువడే 25—10—68 తేదీ కల ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రచురిస్తాము.

7. పోటీ తుది నిర్ణయం ఆంధ్రసచిత్ర వారపత్రిక సంపాదకుడిదే. ఈ విషయమై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపడానికి వీలులేదు.

8. వ్రాతప్రతులని ఎటువంటి సందర్భంలోనూ తిప్పి పంపడానికి సాధ్యం కాదు. పోటీలో పాల్గొనేవారు తమ రచనలతో తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామాకల కవర్లు పంప నవసరం లేదు.

9. పోటీలో బహుమతి పొందక మామూలుగా ప్రచురణకి స్వీకరించిన కథల రచయితలకి ఆ విషయం ప్రచురించే ముందు తెలుపుతాము.

# వారఫలం

## 26-7-1968 శుక్రవారంమొదలు 1-8-1968 గురువారం వరకు

**మేషం :** మీకు ముమ్మందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించ గలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో పోటీ వారితో పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు.

**వృషభం :** మీరు యెంతగానో ఆశించిన వ్యవహారాల్లో ఫలితం సామాన్యంగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మిథునం :** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు సాగుతాయి. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలంగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**కర్కాటకం :** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం :** వృత్తివ్యాపారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయాణాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో మీకృషి రాణిస్తుంది. సాంఘిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కన్య :** కొన్ని వ్యవహారాల్లో మీతాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. మీతాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. వృత్తిలో ఆదాయం బాగా ఉంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**తుల :** వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు.

స్త్రీలకు— స్వల్ప అనారోగ్యం చేస్తుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం :** ఆదాయం మాట యెలాగ ఉన్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగా ఉంటాయి. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**ధనుస్సు :** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో మీకృషి ఫలిస్తుంది.

**మకరం :** వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరవాత సర్దుకొంటాయి. వ్యాపారంలో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం :** వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వృత్తిలో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మీనం :** వృత్తిలో మీ సాటివారితో పోటీ పెరుగుతుంది. ఇతరులమీద ఆధారపడి యేవ్యవహారమూ ప్రారంభించడం తగదు. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు బాగా ఉంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

—మహేష్










క్రొత్త సూత్రం 'గోయా' మీరు కనే కలల టాల్కం పౌడరు, తక్కిన టాల్కులకన్న ఇది తేలికగా, ఆహ్లాదకరంగా ఉంటుంది.

ఇంకను, 'గోయా' నిపుణుల సాయంతో, సుగంధితమైన యీ 'టాల్కు' రోజంతా హాయినిస్తూ, పరిమళాన్ని వెదజల్లుతుంది.

అందాల 'బ్లాక్ రోజ్' పువ్వుల్లా పరిమళించే గార్డీనియా, 'మురిపించే' 'పాస్‌పోర్ట్'లలో మీక్కావలసింది ఎన్నుకోండి!

జ్ఞాపకం వుంచుకోండి, ఈ మూడున్నూ చిరకాలం మన్నే క్రొత్త నిడుపాటి డబ్బాలలో దొరుకుతున్నాయి.

అట్లాంటిస్ (ఈస్ట్) లిమిటెడ్
(ఇంగ్లండ్‌లో స్థాపితం)



క్రొత్త సూత్రంతో తయారయిన ఆహ్లాదకరమైన టాల్కు ఇప్పుడు పొడుగైన క్రొత్త టిన్నులలో లభిస్తోంది

AGC-5 TE

సుగంధముతో కూడిన టాల్కం తయారుచేసే

# గోయా

పారిస్
లండన్
న్యూయార్క్






### జరిగిన కథ

కృష్ణమోహన్‌కి కళ్ళు కనిపించవు. భర్తృభక్తిగా కృష్ణమోహన్‌ని పూజిస్తూ అతని ఆదరణలో మునిసిపోతూవుంటుంది భానుమతి. కృష్ణమోహన్ చెల్లెలు మాధవి, ఆమె ఎంతో అన్యోన్యంగా వుంటుంటారు. కృష్ణమోహన్ కళ్ళు పరీక్షించే నిమిత్తం తమ్ముడు సారథిని రప్పిస్తుంది భానుమతి ఆపరేషన్ విజయవంతమవుతుంది. కృష్ణమోహన్‌కి కళ్ళు వస్తాయి. సారథి, మాధవి అన్యోన్యతని కనిపెట్టి వారిద్దరికీ వివాహం జరిపిస్తుంది భానుమతి. క్రిష్ణమోహన్‌కి సినిమాల్లో పాటలుపాడే ఛాన్సు లభిస్తుంది. అతనికి మేరీతో పరిచయమవుతుంది.

## 8

ఆ సాయంత్రం నాలిగింటికే స్టూడియో నుంచి వచ్చేశాడు. బీచ్‌కేసి నడిచాడు. బీచ్‌లో కూర్చున్నంతసేపూ ఆలోచనలు కెరటాల్లాగే పడుతూనే వున్నాయి.

'శిక్ష కోమలంగా వుండకూడదు. కఠినంగానే వుండాలి. అబ్బ! అంత క్షమాగుణం ఎక్కడిది భానుమతికి? ఆ కంఠం అతి కోమలం. కానీ అర్థం అత్యంత గంభీరంగా వుంది. భానూ! నీ మనస్సు మహోత్తమ కళాఖండం. నేను— నేను నీకుతగిన వాణ్ణి కాదు— తగినవాణ్ణి కాదు.

మేరీ!. .అంత ఆకర్షణీయంగా వుంటాయేం? ఆమెకళ్ళు! ఏదో సమ్మోహనాస్త్రం ప్రయోగిస్తుందామె ఎదుటివారి మీద. లేకపోతే అంతగా ఆమెనే, ఆమె క్రీగంటి చూపునే అంటిపెట్టుకుని రాలేక పోతున్నానెందుకని? నవ్వే నవ్వనట్లు నవ్వుతుంది. నీలిరంగు చీరలో మరింత అందంగా, ఆకర్షణీయంగా మెరిసిపోతుంది మేరీ సౌందర్యం.'

భావనా జగత్తులో విహరించుతున్నాడతడు. భుజంమీన చేయి పడింది. ఉలిక్కిపడి తలెత్తాడాతడు.

'ఓ ! మేరీ ! నువ్వా ! కూర్చో ! రా!' అన్నాడు కృష్ణమోహన్ అత్యంతానందంతో.

'ఏదేమిటి ? స్టూడియోవదిలి ఒంటరిగా యిక్కడ కూర్చున్నారు?' అన్నదామె అతన్ని ఆనుకుని కూర్చుంటూ.

'మనస్సు బావుండలేదు మేరీ!' ఆమెతో తన మనసులోని వ్యథను చెప్పుకోవాలనిపించింది. కానీ! ఏముంది? చెప్పుకోడానికి! అతనికి అయోమయంగా వుంది.

'నాకు తెలుసులెండి. రాత్రి పార్టీలో నామూలాన మీరు కొత్తఅలవాటు చేసుకున్నారు. అందుకు శ్రీమతి ఫీలయ్యారేమో?' అన్నది మేరీ.

'అయినా మరీ అంత ఓల్డుఫేషన్ ఏమిటి ఆమెగారు? రెండుపెగ్స్ తాగినంత మాత్రాన వచ్చిన నష్టమేముంది? నన్నడిగితే రోజూ తీసుకోవడం మంచిదంటాను.'

'నో! నో! అందుక్కాదు మేరీ !' మొదటిసారిగా అతడు అబద్ధాన్ని తేలిగ్గా ఆడగలిగాడు.

'మొదట్లో అలాగే అనిపిస్తుందనుకోండి.—సరే! మీ మిసెస్ చాలా అందంగా వుంటారట.' ఒక్కసారి మా యింటికి తీసుకురాకూడదూ కృష్ణా!'

రేపు సాయంత్రం మా బావ యింగ్లండ్ నుంచి వస్తున్నాడు. పార్టీకూడా వుంది. ఆమెను వెంట తీసుకురండి!' అన్నదామె తిరిగి.

'బావ! అంటే?—'

'మా మేనత్త కొడుకు. ఇంజనీరు. ఎలిజబెత్‌కు కాబోయే భర్త'

'ఆరే! అదేమిటి? మీరు పెద్ద గదా?—'

ఆశ్చర్యంతో చూస్తూండిపోయాడాతడు.

'దానిలో ఏముంది మిస్టర్ కృష్ణమోహన్! డాడీ అవన్నీ పట్టించుకోరు. చిన్నప్పటినుంచీ బావకు ఎలిసీ అంటే యిష్టం. అదీగాక నాకిప్పట్లో పెళ్ళిజేసికోవాలని లేదు' అన్నదామె లిప్‌స్టిక్ పూసిన పెదవులవంక చూసుకుని.

'ఆమె నెందుకు చదివించగూడదు ? అన్నది మేరీ?'

'ఎవరిని?'

'అదే! మీ మిసెస్‌ని?'

'మీకు తెలియదా? నీకన్నా, నాకన్నా ఎక్కువే చదివింది. ఇంటర్ పూర్తి చేసింది. హిందీలో విశారదకూడా చదివింది'.

'ఐసీ! ఎలిపీ అలా అన్నదేమిటి?'

ఆమె చిన్న నోరు విస్మయంతో తెరుచుకొని అలాగే వుండిపోయింది.

'ఏమన్నది?'

'ఇంగ్లీషు అసలు రాదన్నది'

'రేపు చూడండి' అన్నాడు కృష్ణ మోహన్.

తర్వాత యిద్దరూ కాఫీ సెలవుతీసు కొన్నా రొకరి కొకరు.

*　　　*　　　*

భానుమతి రానంటుందేమోఅన్న శంకతో అడిగాడు కృష్ణ మోహన్!

'వెళదాం పదండి. నాకూ మేరీని చూడాలనివుంది' అని వెంటనే అంగీకరించింది.

అతడు ఆశ్చర్యపోయాడు.

తెల్లనిచీర, తెల్లనిజాకెట్! పాలరాతి బొమ్మలా మెరిసిపోతోంది భానుమతి.

వీళ్ళిరువురూ వెళ్ళేసరికి జోసఫ్‌గారు కూడా యింటిదగ్గరే వున్నారు. ఇంగ్లండ్ నుండివచ్చిన మేనల్లుడు జార్జ్‌తో ముచ్చటిస్తున్నారు. మేరీ ఎలిజబెత్‌లు ఎదురుగా వున్నారు.

జోసఫ్‌గారు జార్జ్‌ని పరిచయం చేశారు భానుమతి కృష్ణ మోహన్‌లకు.

అతడు భానుమతిని కన్నార్పకుండా చూస్తూండి పోయాడు.

మేరీ పిలుపుతో చైతన్యం వచ్చింది జార్జిలో.

'వెరీ గ్లాడ్ టు మీట్ యు' అని భానుమతితో కరచాలనం చేయడానికి చేయి చాచాడు.

భానుమతి మర్యాద పూర్వకంగా చేతులు జోడించింది. అతడు విస్మయంగా మేరీవంక చూశాడు.

'సారీ బ్రదర్! యిూ వీ అక్కకింకా ఆ అలవాటుపైన మోజు పోలేదు' అన్నది భానుమతి యింగ్లీషులో.

స్పష్టమైన, నిర్దుష్టమైన, మృదువైన ఆమె ఉచ్చారణ కందరూ ముగ్ధు లయ్యారు.

ఎలిజబెత్ ముఖం వెలవెల బోయింది.

జార్జి అరగంట వరకు భానుమతితో మాట్లాడుతూనే వున్నాడు. ఆమె వేష ధారణ, సంభాషణా చమత్కృతి అతని కెంతో నచ్చింది.

'నిజంగా నాకెంతో నచ్చారు మీరు, మన ఆచారాన్ని నిర్భయంగా, నిస్సంకోచంగా పాటించినందుకు' అన్నాడతడు నమస్కారాన్ని గురించి ప్రశంసిస్తూ.

'మన ఆచారాన్ని మనం పాటించటంలో గొప్పేముంది? కాని మన వాళ్ళు మాత్రం తల సిగ్గుతో వంగి పోతోంది. పాశ్చాత్యులు ఎవరైనా 'షేక్ హేండ్' యివ్వగానే నమస్కారం అల వాటు చేసుకున్నారా? [illegible] కూడా అలాగే వుండదంటే' అన్నది భానుమతి.

జార్జి శ్రద్ధగా వింటున్నాడు.

'ఒకరిలో వున్న మంచిని గుర్తించి ఆచరణలోవుంచి మర్చించవచ్చు. కాని పూర్తిగా అనుకరించడం వుంది చూడండి. అది మనిషి ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయేట్లు చేస్తుంది. మనలో చాలామంది యిందువల్లే రెంటికి చెడిన రేవడిలా వున్నారు.'

'అంటే ఆకులతో భోజనం చేస్తున్న మన పూర్వుల్లా వుండిపోవాలంటారా భానుమతిదేవి?' వ్యంగ్యం స్పష్టంగా విన్పిం



చింది ఎలిజబెత్ కరతలంలో.

'నేనన్నది మీకర్థం కాలేదనుకుంటాను. మార్పు సహజం. ప్రగతి పథంలో నడవాలి మానవాళి. కాని ఆ ప్రగతి అనుకరణకు ప్రతిబింబం కాగూడదు.'

అన్నది భానుమతి వ్యగ్రతలేని మృదు స్వరంతో.

'అయినప్పుడు మీరన్నట్లు రెంటికి చెడిన రేవడిగా అవడం తప్ప మరొకటి వుండదు. ఎందుకంటారా? అనాదిగా వస్తున్న ఆచారాల్ని పట్టుకుని, మాజాతి మహా నాగరికమైనది, అని డబ్బా వాయించుకుంటె యింకా ప్రగతి ఎక్కడుంటుంది?' హేళనచేసింది ఎలిజబెత్ తిరిగి.

క్షణమాత్రం మౌనంగా వుండిపోయింది భానుమతి.

తనను ఉద్దేశించి ఆమె యీ విధంగా అన్నదని గ్రహించింది భానుమతి.

'ఇంకా ఆలాంటి అమ్మమ్మలు వుండబట్టే మనదేశం యిలా వుంది' తిరిగి ఎలిజబెత్ అన్నది.

'మీరు పొరపాటు పడుతున్నారు. మీరన్న ఆ అమ్మమ్మలు లేకపోవడంవల్లనే విదేశాల్లో నైతిక వ్యవస్థ పునాదులు కూడా కూలిపోయాయి' అన్నది భానుమతి తన సహజ మృదుస్వరంతో.

'నాకేమీ తప్పు కన్పించదే వాళ్ళ

# రాగమయి

వివాహాల్లో. అవును. వాళ్ళు తమ మనస్సును వంచించుకోరు. నిష్ఫల ఆత్మ నిగ్రహాన్ని బట్టుకుని జీవితాన్ని ఎడారిగా మార్చుకోరు విదేశస్థులు.'

భానుమతి ఎలిజబెత్ వంక విస్మయంతో విప్పారిన నేత్రాలతో చూస్తూండిపోయింది.

కొంతసేపటికన్నది—

'ఉమర్ ఖయ్యాం మత మనుకుంటాను మీది. ఒక సందేహం. మీరు బైబిలు విలువనే విస్మరించారేమో ననిపిస్తున్నది. నగ్న సౌందర్యానికి దాసులు విదేశీయులు. అందుకు విరుద్ధం మనదేశం. అందువలనే భారతమాత పేరు వినగానే పవిత్రమైన భావం ఒకటి విదేశీయుని మనస్సులో అలా లేస్తుంది.'

ఇంతవరకు ఆమె ఇంగ్లీషులోనే మాట్లాడింది. తర్వాత తెలుగులో అన్నది—

'విశృంఖలత అంటే నాగరికత యని మనుకుంటాము.'

'పోనీ వంటయింటి కుందేలులా వుండమంటారా?' అన్నది ఎలిజబెత్.

'అని నేనలేదే' మీ మనస్సుకు నచ్చిన విషయాన్ని చెప్పానులే. మీకు విదేశీయుల వ్యవహారం నచ్చింది. సూటిగా చెప్పాలంటే ఆత్మనిగ్రహానికీ, నైతిక వ్యవస్థకూ విలువే లేదు వాళ్ళ దృష్టిలో— మీకు అంతేనా?'

'అంతేనన్న సమాధానం మీనుంచి రాదు. ఎందుకో చెప్పమంటారా? జార్జిగారు మీకు భర్తగాబోతున్నారు. వీరిపైనా మీకెంతో ప్రేమ. దాన్ని మరొకరు పంచుకో గూడదు. అది మీ ఒక్కరి స్వంతమే అవ్వాలి. మీరే ఆయనకు సర్వస్వం. ఆయన హృదయంలో మీకు తప్ప మరొకరికి స్థానం వుండ గూడదు. మరి విదేశీయులిలా గాదే! వాళ్ళ మనస్సులో నిశ్చలమైన భావమే వుండదే ప్రేమ విషయంలో కంటికి నచ్చిన క్షణమే వాళ్ళు మరొకర్ని వివాహమాడతారు. ఇది మీకు నచ్చుతుందా? అది విశృంఖలతగాదన గలరా?'

అన్నది భానుమతి ఎలిసీ కళ్ళలోకి చూస్తూ.

ఎలిజబెత్ నోరు విప్పలేకపోయింది. ఎంత వెదికినా ఆమెకు సమాధానమే లభించలేదు.

'మృదువుగా ఎంత వాడియైన భావాన్ని వెలిబుచ్చింది' అనుకుంది మేరీ.

తరువాత కాఫీ ఫలహారాదులు ముగిశాయి. భానుమతి వినయంగా జోసఫ్‌గారికి నమస్కరించి ఎలిసీవంక నవ్వుతూ చూసింది. ఆమె ఏమీ చేయలేక పోయింది. అందుకే నవ్వు పులుముకొంది ముఖాన.

'మీరింకా కోపంగానే వున్నట్లున్నారే?'

'నో! నో! నేను జరిగిందసలు జ్ఞాపకం వుంచుకోను. అయినా ఎందుకు కోపం?' అన్నది ఎలిసీ.

'అయితే మంచిది' అన్నది భానుమతి సెలవు దీసికొంటూ.

* * *

తరువాత పది రోజులకు భానుమతి మామగారితో మాట్లాడుతూ కూర్చుంది. ఇంతలో పోస్ట్‌మెన్ వచ్చి కవరొకటి యిచ్చి వెళ్ళాడు.

మాధవి వ్రాసింది. చదివి భానుమతి నవ్వుతూ అన్నది.

'శుభవార్త. మీరు తాతగారు కాబోతున్నారు.'

'ఏమిటమ్మా! నేను...తాతను...ఆ... ఆహా!' ఆనందంతో మాటల్ని మ్రింగివేశారాయన. అంతలోనే ఆయన కళ్ళవెంట అశ్రుబిందువులు రాలసాగాయి.

'అరె! ఏమయింది? ఒంట్లో కులాసాగా లేదా?' భానుమతి కంగారు పడింది.



'భానమ్మా! జీవిత సర్వస్వమైనటువంటి శుభప్రదమైన వార్త విని నన్ను నేను సంబాళించుకోలేక పోతున్నాను. వాళ్లమ్మే వుంటే...' ఆనందాశ్రువుల్ని తుడుచుకుంటూ మాట పూర్తి చేయలేక పోయాడాయన.

భానుమతి నేత్రాలు చెమర్చాయి.

కృష్ణమోహన్‌కు తెలియ పరిచింది ఆ శుభవార్త. అతడు ఆనందాన్ని ప్రకటించాడు. కానీ ఆ తర్వాత మరొక్క మాట కూడా మాట్లాడకుండా మౌనంగా వుండి పోవడం చూసి భానుమతే అన్నది.

'మాధవిని కొన్నాళ్లు యిక్కడికి ..'

'నువ్వే వెళ్లు భానూ! తర్వాత అందరూ కలిసి రావచ్చు' అన్నాడతడు ఆమె మాటను పూర్తి చేయనీక మునుపే.

తరువాత భానుమతి హైద్రాబాదు వెళ్లేసరికి పదిహేను రోజులు గడిచి పోయాయి. అప్పుడు మూడో మాసం మాధవికి.

భానుమతిని చూడగానే మాధవి సిగ్గుతో ముకుళించుకు పోయింది పువ్వులా.

'ఏం? జ్ఞాపకం లేదా?' అన్నది భానుమతి పరిహాసంగా. లేదన్నట్లు నవ్వుతూ తల వూపింది మాధవి.

నవ్వుతో మెరిసిపోతున్నాయి ఆమె నేత్రాలు. సారధి ఎంతగానో ఆనందించాడు భానుమతి రాకకు.

ఆరాత్రి మాధవీ, భానుమతి యిరువురూ ఒకే మంచంపై పడుకున్నారు. ప్రయాణ బడలిక వలన భానుమతి త్వరగా నిద్ర పోయింది. దాహం వేసింది పన్నెండుగంటలకి లేవబోయిందామె.

గట్టిగా పెనవేసుకుని నిద్రపోతోంది మాధవి.

భానుమతి హృదయం అనురాగ సంద్రమే అయ్యింది.

'మాధవీ! యిదెన్ని జన్మల బాంధవ్యమనుకోనుంటావ్?' పరవశతతో తూలి పోయిందామె మనస్సు.

పసిబిడ్డలా ఒదిగి పడుకున్న మాధవి ముఖాన్ని మృదువుగా దగ్గరకు తీసికొని ఆప్యాయంగా ముద్దుపెట్టుకుంది భానుమతి ఆమె నుదుటిపైన.

నిదురమత్తులో మరింత చేరువగా వచ్చి భానుమతి ముఖంక్రింద తన ముఖం వుంచుకుంది మాధవి. ఆమె ఉచ్ఛ్వాస నిశ్వాసాలు భానుమతి కంఠానికి తగిలి గిలిగింతలు పెడుతున్నాయి.

'మాధవీ! కొంచెం జరుగు!' అని మెల్లగా ఆమెను లేపి భానుమతి లేచి వెళ్ళి మంచినీళ్లు తాగివచ్చి పడుకుంది.

'ఎలా వుండగలిగావ్ బాబూ? యిన్నాళ్లు నన్ను చూడకుండా!'

మాధవి చిన్నపిల్లలా భానుమతి చేతుల్ని తన మెడపై వేసికొని అన్నది.

'ఇలాగే!' అన్నది భానుమతి.

'ఛీ! నువ్వసలు నన్ను మర్చిపోయావు!'

'మరెలా వచ్చాననుకో?'

'ఏదో లాంఛనానికి'

'పోనీ దానికోసమయినా వచ్చానుగదా?'

'ఇక మళ్లీ వెళ్లలేవులే.'

'ఏం? యిక్కడే బంధించి వేస్తావా మాధవీ?'

'ఆహా! ఏం బంధించకూడదా?'

'కూడదంటే ఒప్పుకునేట్లు కన్పించటం లేదు'

'మరెలా కన్పిస్తున్నాను?'

'అల్లరి మానివేసిన అమ్మాయిలా కన్పిస్తున్నావ్? కానీ నాభయం అందుక్కాదు' అన్నది భానుమతి.

'మరెందుకో?'

'నీ అల్లరి తగ్గింది. కానీ అంతకన్నా రెట్టింపు అల్లరి కొండ పుట్టబోతున్నాడు గదా? ఇక యీ వదిన ఎన్ని చెరువుల నీళ్లు త్రాగాలోనని'

'బాబుకాదు తెలుసా? పాపే కావాలి నాకు' అన్నది మాధవి.

'అంతా నీ చేతుల్లో వున్నట్లు మాట్లాడుతున్నావే. మాకు మాత్రం బాబే పుడతాడు.'

'చూద్దాం! ఎవరి జోస్యం ఫలిస్తుందో -' అన్నది మాధవి.

తర్వాత ఏకాంతంగా వుండిపోయాయి ఆ అనురాగ పూరిత హృదయాలు కొంత సేపటివరకు.

'వదినా!' మధురంగా వీణియలా వినిపించిందామె స్వరం.

'ఏం తల్లీ? ఏం గావాలి?'

'అడగనా?'

'వూ!'

'తప్పకుండా యివ్వాలి మరి.'

## రచయితలకు మనవి

### కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాత ప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాత ప్రతులతోపాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన, స్వంత చిరునామాగాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు. వ్రాతప్రతులతో గాక విడిగా స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికల కవర్లు పంపినా వ్రాతప్రతులు త్రిప్పిపంపబడవు.

ప్రచురణకు స్వీకరించబడని వ్రాతప్రతుల విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

### నవలలు

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాతప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాతప్రతులతో స్వంత చిరునామాకల, తగు మాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 ఠావుల పేజీల కంటే తక్కువ వ్రాతప్రతులు నవలికలుగా పరిగణించబడుతాయి.

### కార్టూనులు

ప్రచురణకి స్వీకరించబడని కార్టూనులు తిప్పి పంపగోరే వారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు తప్పనిసరిగా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు.

షరా: వ్రాతప్రతులని, కార్టూన్లనీ పైవిధంగా పంపిన పక్షంలో తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయమై ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము. ఈ షరతుని గమనించి రచయితలు తమ రచనలు, కార్టూన్లు పంపగలరు.

సంపాదకుడు
ఆంధ్రసచిత్ర వారపత్రిక

'చెప్పమగా! నీకు సగం హక్కు వుంటవి'

'నీ చల్లని హృదయంలో హాయిగా కమ్మని కల లుగంటూ నిదురించాలని-'

'అక్కడే వుండు' అంటూ లేవబోయింది భానుమతి.

'ఎక్కడికి?'

'హృదయం నాదగ్గరలేదు మరి?'

'ఏమైందో?'

'మీ అన్నగారు దొంగిలించారు'

మాధవి నవ్వింది ఆమె సమాధానం విని

పదిరోజులున్న తర్వాత భానుమతి, మాధవిని తీసికొని, మావగారితోపాటు మద్రాసు ప్రయాణమయ్యింది.

స్టేషన్‌నుంచి టాక్సీ చేయించుకున్నారు. ఇల్లు సమీపించింది. ముందుగా భానుమతి దిగి యింటితాళం తీయడానికని వెళ్ళింది.

గుమ్మంలో నిలబడిపోయింది నిశ్చేష్టయై.

మేరీ, కృష్ణ మోహన్ ఇరువురూ పేకాట ఆడుకుంటున్నారు. ఒకతలుపు మూసివుంది. దాని వెనక నిల్చుంది భానుమతి.

'ఏదీ! చూపించండి! అమ్మ దొంగ!' అంటూ మేరీ అతనిపైనబడినంతగా వంగి చేతిలోని ముక్కలను చూస్తోంది. చూసిన వెంటనే ఒక ముక్కను లాక్కుంది.

'మేరీ! యివ్వు! ప్లీజ్! యిచ్చేయ్!'

# రాగమయి

అంటూ ఆటలో నిమగ్నమైవున్న కృష్ణ మోహన్ తని మేరీమీదుగా వంగి గిలిగింతలు పెట్టాడు. ఆమె నవ్వుతూ పేక ముక్కలను వదిలివేసింది. అతడు విజయగర్వంతో పైకిలేచాడు.

ముఖంలో నెత్తురు చుక్కలేకుండా పాలిపోయింది, గుమ్మంలో నిలబడివున్న భానుమతిని చూడగానే.

మసిబూసినట్లు నల్లబడిందతని ముఖం, ఆమె సూటిగా అతని కళ్ళల్లోకి చూడగానే.

క్షణం సేపు అలాగే చూస్తూండిపోయిందామె. ఆ నిశితదృష్టిలో పేలవ లేదు. ఆగ్రహం లేదు. కాని కరుణా పూర్ణంగా వుంది. నెమ్మదిగా నిట్టూర్చి అన్నది.

'మాధవి, మామయ్య వచ్చారు' మధురంగా ధ్వనించే ఆ కోమల స్వరం పేలవంగా వినిపించింది.

ఈమాటవిని మేరీ తల ఎత్తింది.

'హలో! భానుమతిగారా! అరే! అప్పుడే వచ్చేశారేమిటి? ఓ నెలవరకూ రారని అన్నారే కృష్ణమోహన్' అన్నదామె.

మేరీవంక చూడకుండానే జవాబిచ్చింది భానుమతి.

'వివాకు వాతి మాటల్లో నమ్మకం చిక్కిందన్నమాట. అందుకే దరిఖాన అయింది.'

ఆ వ్యంగ్యోక్తి మేరీకి అవగాహనగాక కృష్ణమోహన్‌వంక చూసింది.

అతనికళ్ళలో జీవమే లేదన్పించింది.

ప్రాణప్రదంగా భావించే చెల్లెలిని ఆహ్వానించడానికి క్రిందికి వెళ్ళనూ లేదు. నిలబడలేక లోపలికీ వెళ్ళలేదు. అక్కడే నిల్చుండిపోయాడు శిలావిగ్రహంలా.

'నే వెళ్తున్నా కృష్ణమోహన్‌గారూ!' అంటూ మేరీ మెట్లు దిగపోగింది.

ఎదురుగా భానుమతి, మాధవి వస్తున్నారు.

మాధవి విస్మయంతో చకితురాలయ్యింది. ప్రశ్నార్థకంగా వదినవంక చూసింది.

'వదినా! యీ నైలాన్ రాణి—'

భామమతి నిర్లిప్తంగా సందేహాన్ని నివృత్తి చేసింది.

మేరీ ఆ యిరువుర్నీ దాటి వెళ్ళిపోయింది.

'ఊ! కొవ్వాళ్ళకు చీరకట్టుకోవడం కూడా మానేస్తారేమో నన్న అనుమానం దృఢ మౌతోంది యీ మహా సుందరిని చూస్తే.'

అన్నది మాధవి.

'ఎంత నగ్నంగా అలంకరించుకుంటే అంత నాగరికులు అని మేరీ అచంచల విశ్వాసం'

భానుమతి మందస్వరంతో అన్నది.

అన్నను చూసి మాధవి నిర్ఘాంతపోయింది. ఆమెకు జరిగింది అవగతమైంది.

'సారథి రాలేదా మాధవీ?' అతని ప్రశ్న అతనికే అసందర్భంగా అసహ్యంగా తోచింది.

'లేదన్నాయ్!' ముక్తసరిగా సమాధానం వచ్చింది.

(ఇంకా వుంది)





# గతానుగతికో లోకః

బుచ్చువేంకటరమణయ్య

'నువ్వాపని ఎందుకు చేశావు?' అని ప్రశ్నిస్తే 'అతడు చేశాడు కాబట్టి నేనూ చేశాను' అని సమాధానం వస్తుంది. దానిలో మంచి యేమిటో, చెడ్డ యేమిటో గమనించకుండానే చాలామంది పని చెయ్యడానికి ప్రారంభిస్తారు. ఇది జనసామాన్యంలో ఆవాదినుంచీ వస్తూవున్న అలవాటు. దీన్ని బట్టే యేర్పడింది.

'గతాను గతికో లోకః
నలోకః పారమార్థికః'

అనే సూక్తి. ఒకరు యేదేనా పనిచేస్తే— ముఖ్యంగా పేరు ప్రతిష్ఠలున్నవాళ్ళూ, అధికారంలో ఉన్నవాళ్ళున్నూ— చేస్తే దాని లోని యధార్థాన్ని గ్రహించకుండానే ఇతరులు అలాగే చేస్తూ వుంటారని దీని అభిప్రాయం.

ఒకరాజు ఉన్నాడు. అతడు చాలాసార్లు అందరూ 'వేలం వెర్రి' అనేమాట అంటూ ఉండడం విన్నాడు. దాని అభిప్రాయం ఏమిటో అతనికి బోధపడలేదు. ఒకనాడు మంత్రిని చూసి ఆమాటకు అభిప్రాయం ఏమిటో చెప్పవలెనన్నాడు. అప్పుడు మంత్రి 'ప్రభూ! దీని అభిప్రాయాన్ని మనస్సుకు నచ్చేటట్టు వివరించి చెప్పడం కష్టం. ప్రత్యక్షంగా ఒక సంఘటనను చూస్తే దాని అభిప్రాయం మీకే బోధ పడుతుంది' అని అన్నాడు.

మర్నాటి ఉదయం మంత్రి మహారాజుకు మారువేషం వేయించి తనతో కూడా రథం మీద కూర్చుండబెట్టుకుని తమ పట్టణానికి ప్రక్కనే పారుతూఉన్న నది దగ్గరకు వెళ్ళాడు. అతడు తన లాంఛనపు దుస్తులను తీసివేసి, రథంమీదవుంచి కట్టుబట్టతోను అంగవస్త్రంతోను నదిలోకి దిగి స్నానంచేశాడు ఎప్పుడూరాని మహామంత్రి సాధారణుడివలె నదిలోదిగి స్నానం చెయ్యడం అక్కడ వున్నవారికి ఆశ్చర్యం కలిగించింది. అప్పటికప్పుడే అక్కడ చాలా మంది జనం మూగారు. మంత్రిని పోల్చిన కొందరు అభివాదం చేశారు. మంత్రి దీనిని గమనించినట్లు లేదు. అతడు తడి గుడ్డలతోనే గట్టు ఎక్కాడు. ఆ సమీపంలో ఒక గాడిద పచ్చిక మేస్తూ ఉన్నది. మహామంత్రి అక్కడికిపోయి, ఆగాడిదకు ముమ్మారు ప్రదక్షిణం చేసి, సాష్టాంగపడి, దాని రోమాన్ని ఒకటి తీసి తలలో పెట్టుకుని వెనక్కు వచ్చాడు.

మహామంత్రి యిలా చెయ్యడం వల్ల ఆ గాడిదలో ఏదో మహత్తు వున్నదని అక్కడి వారనుకున్నారు. వెంటనే నదిలో స్నానం చేసి వచ్చి మంత్రి మాదిరిగానే దానికి ముమ్మారు ప్రదక్షిణం చేసి, సాష్టాంగ పడి, దాని రోమాన్ని ఒకదానిని ఊడబెరికి తలపైనో చెవుల సందునవో పెట్టుకో సాగారు. జనం తన రోమాల్ని ఊడబెరికినప్పుడు ఆగార్దభానికి ఎంతో బాధ కలిగేది. అది దగ్గరికి వచ్చిన వారినందరినీ తన్నసాగింది. తన్నులు తినడానికయినా సిద్ధపడ్డారుగాని తమ పని మానలేదు. క్రమంగా గుంపు ఎక్కువయింది. గాడిద పారిపోవాలని యత్నించగా కొందరు సాహసించి దాన్ని బంధించి అక్కడనుంచి కదలలేకుండా చేశారు.

దీనినంతా రాజు గమనిస్తూనే ఉన్నాడు. మంత్రి తన దుస్తుల్ని ధరించాడు. రథంలో కూర్చున్నాడు. రథం రాజసౌధం ముఖం పట్టింది.

'ప్రభూ! మీరడిగిన మాటకు మరి నేను వివరించి అభిప్రాయం చెప్పనక్కర్లేదని అనుకుంటాను' అన్నాడు మంత్రి.

నవ్వుతోపాటు ఆశ్చర్యమూ కలిగింది ప్రభువుకి ●






"మోనా...."

"ఏయ్, మోనా....."

"ఏయ్ కోతీ! నాపేరు మోహనుడు. ఇంకెప్పు నా మోనా అన్నావంటే తంతాను". స్నేహి ఏ ఉడుక్కుంటుంటే జడ ముందుకు వేసు టూ గలగల నవ్వుతూంది పదిసంవత్సరాల పిల్ల మాధవి.

'నేను కోతినైతే నువ్వెవరు మోనా''పరుగుతీయ ంది. ఆ పిల్లజడ మోహనుడి చేతిలో చిక్కి వెనక్కి పడింది.

'ఛీ, ఛీ, మట్టంతా అంటుకుంది. ఇక నీ రామపో, కాకరకాయ బెండకాయ టూ..." గా చూపించింది.

నా జట్టురావూ? అయితే నీకు రోజా పలి కాకులెవరు తెచ్చిస్తారేం!"

"నువ్వు తెచ్చివ్వకపోతే నాకు దొరకవా? వేణు తెచ్చిస్తాడులే" బుంగమూతి పెట్టుకొని కోపంగా చూచింది మాధవి.

"అయితే వేణుగాడిచేతే తెప్పించుకో. వాడూ నువ్వూ జట్టు. నే రానేరాను" మూతి ముడుచుకొని విసురుగా పోతున్న స్నేహితుడి చేతిని గట్టిగా పట్టుకొని,

"అయితే సాయంత్రం బువ్వాటకు రావా" అంది కాస్త బెంగగా. వాడు లేకపోతే ఆపిల్లకు క్షణం తోచదు.

"నువ్వు వద్దన్నావుగా" ఆ పసిపిల్లమీద అప వాదు వేసి తనది తప్పులేనట్టు ధీమాగా నిల్చున్నాడు పదకొండు సంవత్సరాల మోహనుడు.

"పోనీలే మోనా..... అహ...మోహనా తమాషా కన్నాను కదా. నువ్వు లేకపోతే నాకేం బాగుండదు. అయినా బియ్యం, బెల్లం తేవాలిసిన వంతు నీది గదా ఈరోజు. అది లేకపోతే మేమెలా చేసుకోం?" దీనంగా చూచింది. మోహనుడికి ఆపిల్ల కళ్ళల్లోకి చూచేసరికి కోపమంతా తుడిచిపెట్టుకు పోయింది.

"వస్తాలే మాధవీ.... నేను లేకపోతే మీకు చేయ డం చేతగాదుగా పాపం" మాధవి జడకొసను రిబ్బను సరిచేస్తూ జాలిపడ్డాడు.

వాడిమాటలకు ఆపిల్ల కళ్ళు మిలమిలా మెరి శాయి.

"మరి సాయంత్రం మర్చిపోకుండా రావాలి.ఏం" అంటూ కుచ్చెళ్ళు పైకెత్తి గంతులేస్తూ పరుగు తీస్తూ దూరంగాపోయి అక్కడినుండి వెనక్కి తిరిగి,

"మోహనా! తప్పక రావాలి. రాకపోతే రేపు బళ్ళో నేను నీతో మాట్లాడను తెలిసిందా" పెద్దగా అరిచింది. ఆ అబ్బాయిమీద తన అధి కారాన్ని సూచిస్తూ.

'అలాగేలే కోతిపిల్లా' మనసులోనే అనుకొని దగ్గరగా ఉన్న ఒక చిన్నరాయి తీసుకొని దూరంగా ఉన్న చెరువు నీటిలోకి విసురుగా విసిరి పరుగు పరుగున చెరువు గట్టుకుపోయి చెరువులో రేగే అలలను చూస్తూ ఈలవేసుకుంటూ ఇంటి వైపు పరుగు తీసాడు ఆ కొంటె పిల్లవాడు.

* * *

"పెన్ను తీసుకురాలేదా అమ్మాయ్. అయితే బయటికి పో" పెన్ను తీసుకొని రాలేదని కోప్ప డ్డాడు మాష్టారు. అభిమానం దెబ్బతిన్న మాధవి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

మోహనుడు చటుక్కునలేచి "పొద్దున మాధవి పెన్ను నేను తీసుకొన్నానండి మాష్టారూ" అంటూ తనపెన్ను తీసి మాధవి కందించాడు.

మాధవి తెల్లబోయి మోహనుడివైపు చూచి, 'కాదండి' అన్నట్టు తల అడ్డంగా ౘిప్పబోయింది. అక్కడినుండి చెప్పవద్దన్నట్టు సైగ చేశాడు మోహనుడు. మాష్టారు మోహనుని బయటికి పంపిస్తుంటే అయోమయంగా బాధగా చూచింది ఆపిల్ల. ఆరోజు ఆడుకోడానికి మర్రి చెట్టుక్రింద కొచ్చినప్పుడు సైగ్గా ఎవరికి తెలియ కుండా అంది మాధవి.

'ఎందుకు మోనా అబద్ధం చెప్పావ్'అని—

"మరి నిన్ను మాష్టారు బయటికి పొమ్మన్నా రుగా"

"పొమ్మంటే పోతానుగా అబద్ధం చెప్పి నా బదులు నీవెందుకు వెళ్ళావ్?"

"నువ్వు ఏడ్చావూ?" అమాయకంగా అన్నాడు.

"మరి నిన్ను బయటికి పొమ్మంటే నువ్వు ఏడవలా?" జాలిగా చూచింది స్నేహితుడి వైపు.

"నేనేం ఏడవలా. నేనేం ఆడపిల్లనా ఏడవడానికి. ఎంచక్కా వెళ్ళిపోయి చెడుగుడు ఆడుకొన్నాం. నేనూ వేణూను అన్నాడు మోహనుడు గర్వంగా

సంతృప్తిగా అమాయకంగా నవ్వుకొంది మాధవి.

ఎర్రగా, బొద్దుగా, ముద్దుగా వుండే మాధవి

అంటే మోహనుడికి తగని అభిమానం. బొమ్మల పుస్తకాలు, పిప్పరమెంటు బిళ్ళలు రకరకాల సిరాలు—ఎర్రసిరా, పచ్చసిరా, ఇంకా.... ఇంకా ఎన్నో, ఎన్నో గవ్వలు, నెమలి ఈకలు తెచ్చి యిచ్చేవాడు మోహనుడు. తననొక్క క్షణమైనా వదలకుండా వెనకుట్నా మాధవీ! మాధవీ! అంటూ వెంట తిరిగే మోహనుడు అంటే మాధవికి ఎక్కడలేని యిష్టం.

ఆపిల్లతో చిలిపి కజ్జాలేసుకొని ఏడిపించందే, ఆమె బుంగమూతి పెట్టి కోప్పడ్డే చూడందే ఒక్క క్షణమైనా వాడికి గడిచేది కాదు. ఒకమారు కాల్చిన చింత గింజలన్నీ తనే తిని తనకి ఒక్కటి కూడా పెట్టకుండా ఏడ్పించాడని రెండు రోజులు మాటలు మానేసింది మాధవి. ఇద్దరికీ ఒకరితో ఒకరు మాట్లాడుకోవాలని, చింతచెరువు దగ్గర పిట్ట గూడులు కట్టుకోవాలని, మర్రిచెట్టుమీద కలసి కట్టుగా కోతికొమ్మచ్చులాట ఆడాలని వుండేది. కాని—

"ఏమ నాకు పెట్టకుండా ఎందుకు తినాలి? పైగా వూరిస్తూ" అని కోపం మాధవికి.

"తనే వస్తుంది, నేనులేకపోతే తనకి ఒక్క క్షణమైనా గడవదు" అని ధీమా ఆ చిన్నిమోహనుడుకి. కానీ ఇక వుండలేక తనే ఒకరోజు యిన్ని చింతగింజలు తీసుకెళ్ళి యిస్తే ఫక్కున నవ్వేసి జట్టు కలిపేసింది మాధవి.

*   *   *

నెలవులంతా యిట్టే గడిచిపోయాయి. ఆ దినం పరీక్షా ఫలితాలు వచ్చాయి. మాధవి ఫస్ట్ ఫారము పాసయ్యింది. మోహనుడిది పోయింది.

'మాధవీ! నా పరీక్ష పోయింది. నువ్వు ప్యాస్ అయ్యావటగా తెలుసా' గంతులేసుకుంటూ వచ్చి పరీక్ష పోవడమంటే ఏమిటో తెలియని మోహనుడు చెప్తుంటే చూచీ చూడనట్టు పోబోయింది మాధవి.

"కోతీ! నిన్నే. నాతో మాట్లాడవా!?"

"ఉహూ" ముఖం ప్రక్కకు త్రిప్పుకుంటూ అంది.

"ఏం?" కనుబొమలు ఎగరేస్తూ అడిగాడు తమాషాగా మోహనుడు.

"నీ పరీక్ష పోయిందటగా?"

పరీక్షపోతే ఎందుకు మాట్లాడకూడదో అర్థం కాలేదు వాడికి.

"పరీక్షపోతే మాట్లాడకూడదా?" అమాయకంగా అడిగాడు.

"ఏమో నాకు తెలియదు. అమ్మ చెప్పింది అలా అని" నిర్లక్ష్యంగా అంది మాధవి.

వాడికి మనస్సు చివుక్కుమంది. కాసేపు ఏకాంతంగా వుండి అన్నాడు.

'పోనీ బాగా చదువుకొంటాను. నాజట్టుంటావా మాధవీ"

"ఉహూ బాగా చదువుకున్నా నీజట్టుండను. నీకు డబ్బులేదటగా డబ్బులేని వాళ్ళతో, బీదవాళ్ళతో జట్టుండకూడదని అమ్మచెప్పింది." అమాయకంగా ఆపిల్ల చెప్పుకు పోతుంటే ఆశ్చర్యంగా వింటున్నాడు మోహనుడు. డబ్బుంటేనే జట్టుండాలా? చదువుంటేనే మాట్లాడాలా అంతా అయోమయంగా వుంది వాడి చిన్న మనసుకు.

'కానీ ఏదేమైనా ఇక మాధవితో తనకు స్నేహం. లేదు. ఆచిలిపి పిల్ల తనతో ఇక జట్టుకురాదు. అనుకున్నప్పుడు ఆపసివాని కళ్ళలో నీళ్ళునిలిచాయి.

ఇక అక్కడ ఉండకుండా పక్కనే ఉన్న చెరువు గట్టు మీద కూర్చొని చిన్న చిన్న రాళ్ళు ఏరి చెరువులో వేస్తూ ఆ రాళ్ళు చెరువులో రేపే చిన్న చిన్న అలల వేపు చూస్తూ కూర్చున్నాడు. వాడి మనస్సంతా వికలంగా వుంది. కన్నీరు పెల్లుబికి వస్తూంది. మాధవి చెప్పిన మాటలు వాడి మనస్సులో మొట్టమొదటిసారి అంతస్తుల కల్లోలాన్ని రేపింది. కన్నీరు వాడి లేత చెంపల మీదుగా జారుతూంటే నిశ్చలంగా నీటిలోకి చూస్తూ ఉన్నాడు.

తన చెలికాడు ఏడుస్తుంటే తనకీ ఏడుపు వచ్చింది. అమ్మ చెప్పిన విషయాలు గాని, తను మోహనుడితో అన్న విషయాలు గాని అన్నీ మరిచిపోయి పరిగెత్తుకుంటూ తన మోనా దగ్గరకు చేరుకుంది ఆ పిల్ల. వాడి ప్రక్కనే కూర్చొని వాడి కన్నీళ్లు తుడుస్తూ,

"ఎందుకు మోనా ఏడుస్తున్నావ్" అంది. స్నేహితురాలి వైపు కోపంగా చూస్తూ—

"నువ్వు మాట్లాడ నన్నావుగా" అన్నాడు కోపంతో ఆ పిల్ల చేతిని తోసేస్తూ మోహనుడు.

"పోనీ ఇప్పుడు మాట్లాడుతున్నాగా. ఏడవకు" బుజ్జగించింది మాధవి.

"మరి మీ అమ్మ మాట్లాడ వద్దన్నదన్నావ్." తన అనుమానం వెలిబుచ్చాడు మోహనుడు.

"అహ్ అమ్మ వద్దన్నా, ఎవరు వద్దన్నా సరే నేను నీతో మాట్లాడుతాను సైగ్గా. సరా. మరి నువ్వేడవ కూడదయితే."

మోహనుడు మాట్లాడలేదు. ఇంకా వాడికి అనుమానం పోలేదు.

"నిజంగా మోనా" అంది పెద్ద పెద్ద కళ్ళను త్రిప్పుతూ మాధవి.

"అయితే నువ్వు నాతో ఆడుకోడానికి వస్తావా?'

'ఆ'

"బడికి కూడా?"

'ఆ'

'మీ యింట్లో బువ్వాట ఆడుకుంటే పిలుస్తావా?

"తప్పకుండా పిలుస్తా."

"అయితే యీరోజు మేము నేరేడు పళ్ళ కోయడానికి వెళ్తున్నాం. నువ్వూ వచ్చి రాలే పళ్లన్నీ ఏరుతావా?"

'ఆ'. ఒకసారి నేరేడు పళ్ళు ఏరి ఒడిలో వేసుకొని బట్టలన్నీ ఖరాబు చేసి కొన్నందుకు తల్లిచేత దెబ్బలు తిన్న సంఘటన జ్ఞాపకమువచ్చి వద్దందామనుకొంది ఆ పిల్ల. కాని వాడి మనస్సుకు సంతోషం కలిగిద్దామని, సరేనని ఒప్పేసుకుంది. అప్పటికి గాని మోహనుడికి అనుమానం తీరలేదు. చొక్కాతో కన్నీళ్ళు తుడుచుకొని

"రా పోదాం" అన్నాడు. చేతులు చేతులు కలుపుకొని తేలికపడిన మనస్సులతో హాయిగా ఎగురుతూ ఇద్దరు ఇళ్ళు కెళ్ళిపోయారు.

"మా నాన్నగార్కి బదిలీ అయిపోయింది. మేం వేరే వూరు వెళ్ళిపోతున్నాం మోనా!" అంది మాధవి ఒకనాడు మోహనుడి ప్రక్కనే కూర్చుంటూ.

"అయితే యిక యిక్కడికి రావా మాధవీ. నన్ను మరిచిపోతావా?"—అప్పటికే ఆ విషయం విని దిగులుగా వున్న మోహనుడు ఏడుస్తూ అన్నాడు.

"మరేం చేయను మోనా! మా అమ్మా వాళ్ళతో నేనూ పోవద్దూ? నే నొక్కదాన్నే ఎలా ఉండడం!" మోహనుడు ఏడుస్తూవుంటే తనూ ఏడుస్తూ అంది.

మోహనుడు బిగ్గరగా ఏడుస్తున్నాడు.

"నిన్ను కూడ తీసుకపోదామని అమ్మతో చెప్తాలే మోనా. ఏడవకు" తను ఏడుస్తూనే స్నేహితుడిని బుజ్జగిస్తూంది ఆ పిల్ల.

"ఆహ నేను రాను. మా బామ్మ నొదిలేసి ఎలా వచ్చేది?" కళ్ళు తుడుచుకుంటూ అన్నాడు.

"ఏం"

"నేను నీతో వచ్చేస్తే మా బామ్మకు అన్నం ఎవరు పెడ్తారు?"

"వంటవాళ్ళు లేరా! నువ్వెలా పెడ్తావ్ అన్నం" అమాయకంగా అడిగింది మాధవి.

"ఉహూ. మాకు వంటవాళ్ళు లేరు. నేను చదువుకొని మా బామ్మకు బువ్వ పెట్టాలట! అందరూ చెప్తారు."

చదువుకొని బామ్మకు బువ్వెలా పెట్టాలో ఆ యిద్దరిలో ఏ ఒక్కరికీ తెలియదు. కాని అరిందాల్లా మాట్లాడేసుకుంటున్నారు. 'అయితే మాతో రావా! నే నొక్కదాన్నే వెళ్ళిపోయేదా!' దీనంగా చూస్తూ అంది. మోహనుడు ఏ జవాబు చెప్పలేదు. కొంచెంసేపు అలాగే మౌనంగా ఉండి,

"అయితే నువ్విక్కడే వుండు మాధవీ. నేను నీ కొకటిస్తాను" అంటూ పరుగెత్తుకుంటూ వెళ్లి తమ ప్రాణప్రదంగా చూచుకుంటూ ఎవరన్నా అడుగుతారేమో అని బామ్మ పెట్టెలో భద్రంగా దాచుకొన్న కృష్ణుడు బొమ్మ, పోయిన సంవత్సరము తిరునాళ్ళలో బామ్మ కొనిచ్చిన తనకు ఎంతో యిష్టమైన బొమ్మ తెచ్చి మాధవి కిచ్చి,

"ఇది నీ దగ్గర జాగ్రత్తగా వుంచుకో. సరే గాని యీ వూరు మరలా వస్తే నన్ను కలిసికోవడము మాత్రం మరిచిపోకేం? అప్పుడు నీకు బోలెడు నేరేడు పళ్ళు కోసిస్తాను" ఏడుపులోనే నవ్వుతూ అన్నాడు.

'సరే' అంది మాధవి ఆ బొమ్మవైపు ఆశ్చర్యంగా చూస్తూ. ఒక్క సంవత్సరం పరిచయంతో అమాయకంగా అల్లుకుపోయిన ఆ పసి హృదయాలు రెండు దూరమైపోయాయి.

*   *   *

'మాధవీ' భర్త కేకతో ఉలిక్కిపడి వ్రాస్తున్న కాగితాలను గాభరాగా డ్రాయర్లో దాచేసి భర్త చూడకుండా, తలుపు గొళ్ళెంతీసి తలుపు వారగా నిలుచుంది.

"ఏం? ఏం చేస్తున్నావ్ యింట్లో?" ఎప్పుడూ

ఏదో కొరెప మునిగిపోయినట్లు అట్లా ముఖం దిగాలు వేసికొని ఏడవకపోతే, కొంచెము హుషారుగా కనిపించకూడదూ?'' అంటూ వినుక్కొంటున్న భర్త ముఖంవైపు అదోలా చూచి,

''ఏం చూచుకొని సంతోషం వెలిగించాలి'' అనబోయి గొంతులోనే మింగేసి ఫ్లాస్కులోపోసి వున్న కాఫీ తెచ్చి కప్పులోపోసి అతడు బట్టలు మార్చుకొనే లోపల అతని ముందుంచింది. కాఫీ త్రాగి క్లబ్బువైపు దారి తీస్తున్న అతన్ని చూచి దుఃఖం పట్టలేక పడక గదిలోకి పోయి దిండులో తల దూర్చి వెక్కి వెక్కి ఏడ్చింది.

మెలకువ వచ్చి చూసేసరికి ఏడు గంటలు కావవస్తుంది. లేచి గదిలో దీపం వెలిగించి టేబిల్ ముందు కూర్చొంది. మనసంతా నిశ్చలంగా ఉంది. ఏ వికారము లేదు. దుఃఖమంతా కన్నీరు రూపంలో బయట పడిపోయింది. నెమ్మదిగా డ్రాయరు సొరుగు లాగి వ్రాసిన కాగితాలన్ని బయటికి తీసి సక్రమముగా పెట్టి తను వ్రాసినంతవరకు ఆతృతగా చదువుకొని నిట్టూర్చి, కళ్ళు మూసుకొంది. మూసుకొన్న కళ్ళనుంటి టపటప రాలాయి కన్నీటి బిందువులు వ్రాసిన కాగితాలమీద. ఆ నీటిని పైట కొంగుతో తుడిచి మరలా వ్రాయడానికి ఉపక్రమించింది.

''ఇది ఏనాటి కథో, ఎవరికథో కాదు. ఎవరికథో అయితే నే నీనాడు నిట్టూర్చే అవసరం లేకపోయేది. ఇది అచ్చు నా కథే నేనే మాధవిని. ఈ కథ యిలాగే హాయిగా జరిగిపోయుంటే కన్నీళ్ళ కర్మము లేకపోయేది. కానీ.....కానీ....అబ్బ యీ కథలో ఎన్ని మలుపులు! ఎన్ని దోవలు!!

ఆనాడు విడిపోయిన తరువాత అప్పుడప్పుడూ గుర్తు వచ్చేవాడు మోనా. కానీ కాలం గడిచేకొద్దీ నాలో మార్పు రాసాగింది. వయస్సుతోపాటు సంఘములో అంతస్థుల ప్రాబల్యం అర్థం కాసాగింది.

# పరమపద సోపానము

డబ్బు, హోదా, చదువు మానవుల బంగారు కలలు. అవే సంఘములో కొలత బద్దలు. ఆ కొలబద్దలతో సరి తూగేందుకు ప్రయత్నించే యీ రోజులలో నేనూ వాటి ప్రాబల్యమునకు లొంగిపోక తప్పలేదు. నేనూ ఒక మనిషినే కానీ అవి నాలోని అహంకారానికి దోహదం చేశాయి. అవే నా భావి జీవితంలో నన్ను నట్టేట్లో ముంచి విపరీతాల్ని చేశాయి. వాటి ప్రభావానికి తట్టుకునే శక్తి నాలో లోపించింది. అందుకే నా కీ శిక్ష......నా కీ శిక్ష.....అనుభవిస్తున్నాను.

నా అహంకారానికి ప్రతిఫలంగా నా జీవిత పథం మారిపోయింది. నాలో క్రొత్త వూహలు, క్రొత్త రూపాలు, క్రొత్త అభిరుచులూ, వీటన్నిటి క్రిందా, నా ప్రాణాతిప్రాణమైన స్నేహితుడు, చెలికాడు, ప్రియాతిప్రియమైన, నా చిన్ననాటి మోనా మరుగున పడిపోతున్నాడు. అతని స్థానాన్నే ఖాళీ చేసానని భ్రమపడ్డ హృదయ ఫలకంపై వేరే రూపాన్ని చిత్రించేందుకు, చాలా అవస్థలు పడ్డాను. ప్రతి వూహ వెనకాలా మోహనుడి నీడ కన్పించేది. ఆ నీడను తుడిచేసే ప్రయత్నంలో ఏమేమో వూహించుకున్నాను. భవిష్యత్తుకు బంగారు నిచ్చెనలు వేసాను— నాకు డబ్బు వుంది. అతను కనీసావసరాలు తీరనంత బీదవాడు. తను ఒక నాటికి డాక్టరు అవుతుంది. ఫస్ట్‌ఫారం పరీక్ష తప్పిన మోనా ఏమీ కాలేడు. తనకు తెలిసిన వాళ్ళంతా పెద్దవారు, డాక్టర్లు, లాయర్లు, జమీందారులు...... ఇంకా, ఇంకా......వీళ్ళందరిమధ్యా తన ప్రక్కన మోనా, మాసిన బట్టలతో, చింపిరి జుట్టుతో, ఏమీ రాని మోనా. అలా వూహించుకోవాలంటే నాకు భయమేసేది. తన హృదయంలో మసక మసకగా వున్న మోహనుణ్ణి పంపివేయడానికి నన్ను నేను మభ్య పెట్టుకోవడం మొదలెట్టాను.

''చిన్ననాటి స్నేహితుడు, జీవిత భాగస్వామి అవ్వాలని ఏముంది?'' అని సంతృప్తిపడేదాన్ని. కానీ రెండే రెండు సంఘటనలు నాకు వాటన్నిటి వెనకాలా వున్న కటిక నిజాన్ని చెప్పేవి. ఒకటి అత ఇచ్చిన బొమ్మ పోగొట్టుకున్న రోజు, తన సర్వస్వం ఎవరో కాజేసినట్టు వెక్కి వెక్కి ఏడ్చిన సంఘటన, రెండవది తను యవ్వన ప్రాంగణంలో అడుగు పెట్టిన దినాల్లో అతనిని దూరాన చూచి, పరుగు పరుగున అతని దగ్గరకు చేరి అతను చేయికలపగానే సిగ్గుతో పారిపోయిన దినం. ఆరోజు ఆ సిగ్గుకు, ఆ అనుభూతికి కారణం స్పష్టంగా తెలియలేదుకానీ ఈనాడు దాని అంతర్యం పూర్తిగా బోధపడింది. కానీ ఆ విషయాన్ని దాచుకోవడానికి, నన్ను నేను మభ్యపెట్టుకోవడానికీ సర్వ ప్రయత్నాలూ చేసాను. అందులో విజయమే సంపాదించాను. మొత్తానికి నా అహంకారం క్రింద అనురాగం నశించింది. నా అంతస్తు క్రింద నా మానవతే సిగ్గుపడి పారిపోయింది.

నా స్వప్నాలు, నా ఊహాలు, నా భావాలు, బంగారు సోపానాల ప్రయాణాలూ, వీటన్నిటి క్రిందా, చిన్ననాటి చెలికాడూ, ''వెళ్ళిపోతున్నావా మాధవీ'' అని రోదించే మోనా ''నాతో మాట్లాడవా?'' అని జాలిగా చూసే స్నేహితుడు, జడపట్టి లాగి 'కోతీ!' అని పిలిచే చిలిపివాడు ''మరలా ఇక్కడికొస్తే నన్ను మరచిపోకేం, నీకు బోలెడు నేరేడు పళ్ళు కోసిస్తాను.'' అని ఆహ్వానించే అనుంగు బంధువు, నా మోనా మరుగున పడిపోతున్నాడు. కళ్ళకు కనిపించనంత దూరం వెళ్ళిపోతున్నాడు.

బాల్యం వదిలి యువ్వనంలో అడుగుబెట్టబోయే దశలో, తలిదండ్రులు చుట్టాలు అంతా కలిపి అంతస్థు పేరిట నన్ను మోసం చేసారు. ఈనాడు ''నీ దౌర్భాగ్యానికి నువ్వే చింతించు.'' అంటూ తప్పుకున్నారు.

* * *

నా ఆశయాలకు తగినట్టే, నేను కోరుకున్నట్టే ఇంటర్ మీడియట్‌లో ఫస్ట్‌క్లాస్ రావడం, మెడికల్ కాలేజీలో సీటు రావడం జరిగాయి. నేను కావాలనుకుంటే, అటువంటి సీట్లు ఎన్నైనా డబ్బు పెట్టి కొనగలను, కానీ నేనే స్వంతంగా, కష్ట ఫలితంగా సంపాయించుకున్నాను. అదే నా గర్వం. ఆ గర్వంతోనే ఒకనాడు, తెలిసీ తెలియని వయస్సులో కూడా ఫస్ట్‌ఫారం పోగొట్టుకున్న మోహనుడి కళ్ళలో నీళ్ళు తెప్పించాను.

ఆరోజు తన ఆశయాలు నెరవేరాయి కదా అనే సంతోషాతిశయంలో భవిష్యత్తుకు బంగారు నిచ్చెనలు వేసుకుంటూ, నా భవిష్యత్తును మోసుకపోవడానికి వచ్చే ట్రెయిన్ కొరకు ఎదురు చూస్తూ కూర్చున్నాను స్టేషన్లో. నాన్నగారు బుక్‌స్టాల్ దగ్గర కెళ్ళారు, నా కాలాన్ని చంపడానికి ఆయుధాన్ని కొనివ్వడానికి, ఆయనకు తెలియదు, నా ఊహలను రజితస్వప్నాలలో పొందుపరచడానికే కాలం చాలదని.

అంతదూరాన ప్లాట్‌ఫారం మీద మోహన్, మాసిన బట్టలు, తైల సంస్కారంలేని జుట్టు,






తీపియైన మిల్క్‌మెయిడ్ గడ్డ పాలు కాఫీ, టీలలో కలుపుటకు అనువైనవి... దివ్యమైనవి. వీటితో కాఫీ. టీల రుచి ఇతోధిక మవుతుంది. వీటితో మీరు పంచదారను పొదుపు చేయగలరు. ఎందుచేతనంటే మిల్క్‌మెయిడ్ గడ్డ పాలలో శుద్ధిచేయబడిన పంచదార చేర్చబడినది! ఈ రోజే రెండు డబ్బాలు మిల్క్‌మెయిడ్ గడ్డ పాలు కొనండి. వీటిని మీరు ఎన్నో విధములుగా వాడవచ్చును.

మిల్క్‌మెయిడ్ అంటే శుద్ధమైన, తాజాయైన మరియు రుచియైన పాలు!



వీటిని కలిపి తీపి వస్తువులను చేస్తే అవి ఎక్కువ రుచిగా వుంటాయి



ఇవి పండ్లతోను, 'పుడ్డింగ్' తోను తినుటకు దివ్యంగా వుంటాయి



ఇవి మీ బిడ్డకు సహజమైన పోషణ నిస్తాయి

ఇప్పుడు
విరివిగా
లభిస్తున్నాయి

## తీపియైన మిల్క్‌మెయిడ గడ్డ పాలు—

ఇవి ఉత్కృష్టమైనవని మీకు తెలియును, ఎందుచేతనంటే ఇవి నెస్లేవారి తయారు!

కాలిడచే కనుపాపలతో, నీరసంగా, దీనంగా, బాధగా అంతకు వెయ్యిరెట్లు ఆత్రుతతో సడిచేసే స్టేషను గడియారం వైపు చూస్తూ చిరాగ్గా పచార్లు చేస్తున్నాడు.

నా హృదయం ఒక్క క్షణం స్పందించడం ఆగిపోయింది. కాలం స్తంభించింది. ఆక్షణం ఎంత బలవత్తరమైందో గాని, నా ఆశయాలు, బంగారు కలలు, కన్నీళ్ళుగా తెలివెక్కి అద్దు కున్నాయి. చిన్ననాటి స్నేహితుణ్ణి కలుసుకో బోతున్నాననే సంతోషం నన్ను పొంగెత్తింది. ఇంతవరకు అనుభవంకాని అనుభూతి గిలిగింతలతో నా నరనరాన్నీ ఆక్రమించింది. వణికే సంతోషంతో తలెత్తి చూశాను. ఆవేశంగాంగా అతనూ ఇటే చూశాడు. అతని ముఖంలో బాధ, భయం, అన్నీ ఆ నిముషంలో మచ్చుకైనా కన్పించకుండా మటు మాయమయ్యాయి. మొదటి రోజు పథ్యం తిన్న దీర్ఘ రోగిలా, కష్టకాలంలో పెన్నిధి దొరికిన పేద వాడిలా, పోతుందనుకున్న పరీక్ష పాసైన విద్యా ర్థిలా అతని ముఖంలో వేయి ద్యోతకాల కాంతి. వడివడిగా అడుగు వేసుకుంటూ నా వైపే వస్తు న్నాడు మోహన్. సిగ్గుతో నా తల వాలిపోయింది. నా గుండె కొట్టుకునే శబ్దం నాకే విన్పిస్తోంది.

"మాధవీ!" ఆ పంతంలో ఎనలేని ఆప్యత.

తన ముందున్న మెట్లు లేని కాళ్ళు మరలా నన్ను నా మిథ్యాప్రపంచంలోకి లాగేసెయి. ఆ కాళ్ళను బట్టి వూహించుకున్నాను అతని రూపాన్ని. క్షణికమైన ఉద్రేకం కలిగింది. నా బంగారు స్వప్నాలను సాక్షిపాలు చేసుకోవాలని అనిపించలేదు.

"మాధవీ!" మరలా అదే పిలుపు. ఆ పిలుపు లోని ఆవేదనకు ఉలిక్కిపడ్డాను. విపరీతంగా వడలిపోతున్న హృదయాన్ని చిక్కబట్టుకుని, స్థిరంగా చూస్తున్నాను.

"ఏం మాధవీ! మాట్లాడవు?" ఆ పిలుపును

# పరమపద సోపానము

నిరసించే బలం నాలో లోపించింది మెల్లిగా తలెత్తాను.

"మాధవీ! నేను..నీ మోహన్ని" అతని ముఖం లోని తేజస్సుకు తట్టుకోలేక తలవంచాను.

"బాగున్నావా మాధవీ! మరలా మన ఊరికి రాలేదేం? ఇప్పుడేం చేస్తున్నావు? అసలు నిన్ను నా జన్మలో కలుసుకోలేనేమోనని బాధపడ్డాను. ఆరోజు స్కూలు దగ్గర కలుసుకుని విడిపోయిన క్షణం నుండి నిన్ను వెతుకుతూనే వున్నాను. ఆరోజు నిన్ను వివరాలు అడిగి కనుక్కోనందుకు నన్ను నేను నిందించుకోని క్షణం లేదంటే నమ్ము మాధవీ! పోనీలే.. పోనీలే. నిన్ను కలుసుకున్నాను అంతే చాలు" అతను మహారాజుగారి అంబారీ ఎక్కినంత సంతోషపడుతూ చెప్తుంటే, నిర్వి కారంగా వింటున్నాను. అతను అది తన అదృష్ట మని పొంగి పోతుంటే అది నా దురదృష్టంగా భావించి వణికిపోయాను నేను. అతనిలోని విశ్వాసం నాలో మొండితనాన్ని రేకెత్తించింది. నేను కోరు కుంటున్న మరకతాలు పొదిగిన భవిష్యత్తును ఊహించుకుంటూ తలెత్తాను.

నా శూన్యదిక్కులు చూసి ఒక్కడుగు వెనుక్కి వేశాడు. "మవ్వు.. మీరు.. మీరు" అతని తడ బాటులో ధైర్యాన్ని కూడగట్టుకుని అన్నాను.

"క్షమించండి. నేను మీరనుకుంటున్న మాధవిని కాదు. నా పేరు శారద." కొరడాతో కొట్టినట్లు ఉలిక్కిపడ్డాడు నా మాటలు విని. అతని ముఖంలో వెలుగు ఆరిపోయింది. ముందుకు వేయబోతున్న అడుగు వెనుక్కుపడింది. నమ్మలేనట్లు అలాగే కొంతసేపు నా ముఖం వైపు చూసి,

"మరి.. మీరు అచ్చు మాధవిలా.. ఉంటేను.." అతని మాటలు తడబడ్డాయి.







తలెత్తి అతని ముఖంలోకి తీక్షణంగా చూశాను. అతడు నా చూపులకు తట్టుకోలేక నెమ్మదిగా కాళ్ళీడ్చుకుంటూ దూరంగా వెళ్ళిపోయాడు. అతడు కన్పించినంతవరకు చూసి హాయిగా గాలి పీల్చుకున్నాను. ఒక గండం గడిచిపోయినట్లు ఫీల్ అయ్యాను. నాకా క్షణంలో అంతమంచి ఐడియా తట్టినందుకు నన్ను నేనే అభినందించుకున్నాను.

కానీ ఒకనాడు ఇటువంటి అనాలోచితమైన పనికి చింతించాల్సి వుంటుందని తెల్సివుంటే నేనంతగా గర్వపడే దాన్ని కాదేమో. ఈనాడు ఒంటరి దాన్నై నా దౌర్భాగ్యాన్ని నిందించుకోవాల్సిన అవసరం వుండేది కాదేమో.

అతడు తన బొమ్మ చావు కబురు తెలిపి, తన ఒంటరితనానికి రోదిస్తూ, ఉన్న ఒకే ఒక్క ఆశతో తన జీవనజ్యోతి మాధవి కొరకు ఎదురు చూస్తూ జీవిస్తున్న అతనిలో తను ఒక్క మెరుపు మెరిపించి పూర్తిగా అంధకారం చేశానని తెలిసుంటే అంతగా సంతోషపడేదాన్ని కాదేమో.

నా జీవిత పథం వేరు. అతని జీవిత పథం వేరు. అతనికి నేను సర్వస్వం. నా కతడు ఏమీ కాడు. నా బంగారు కలలే నా సర్వస్వం అప్పట్లో. రెండు విభిన్న పథాల్ని మోసుకుంటూ కదిలిపోయింది రైలుబండి.

* * *

రెండు నిండు సంవత్సరాల తర్వాత మరలా కన్పించాడు మోహనుడు. ఆరోజు స్టేషన్లో అతడు కన్పించినప్పుడు కలిగిన భయంగాని, బాధ గాని లేనిప్పుడు నాకు. నాతో నా ఆశయాలు బలంగా హత్తుకపోయాయి. అతనిని ఎదుర్కొన డానికి ధైర్యంగా నిలబడ్డాను.

వడివడిగా వస్తున్న అతను ఎవరో ఆజ్ఞాపించి నట్లు ఆగిపోయాడు. ఒక నిమిషం నా ముఖంలోకి నిదానంగా చూసి,

"మీరు శారద కదూ!" అన్నాడు.

"అవును. ఏమి?" అన్నాను ధైర్యంగా, సౌమ్యంగా.

"ఏంలేదు. మరలా రెండోమారు నా మాధవి అనుకొని పొరబడ్డాను" నీరసంగా ఉన్నాయి అతని మాటలు.

'నా మాధవి!' షాక్ తిన్నాను.

ఒక పురుషుడు తనను గాఢంగా ప్రేమిస్తు న్నాడని తెలిస్తే స్త్రీ తప్పకుండా సంతోషపడు తుంది, ప్రేమించకపోయినా సరే.

నాగురించి మోహనుడికి ఎటువంటి అభిప్రాయా లున్నాయో నన్నెంత గాఢంగా ప్రేమిస్తున్నాడో తెలిసికోవాలనిపించింది నాకూ అందరి స్త్రీలలాగే. దానివల్ల అతనికి బాధ కలుగుతుందన్నైనా ఆలో చించకుండా అన్నాను.

'మా మాధవి గురించేనా ఏంటి మీ రనేది?'

'మీమాధవికి ఎలా ఉంటుంది' ఆత్రుతగా ముందుకు వంగి అడిగాడు.

'సన్నగా, పొడుగ్గా, ఎర్రగా అచ్చు నాలాగే వుంటుంది' అతని ముఖంలోకి పరీక్షగా చూస్తూ అన్నాను.

"అవును. మాధవి అచ్చు మీలాగే వుంటుంది.

[illegible]

'ఆ తెలుసు. ఆమె నా క్లాస్‌మేటు' అన్నాను అతి తేలిగ్గా.

'ఆ అమ్మాయిదేవూరు. వాళ్ళ నాన్నగారి పేరు తెలుసుంటే చెప్పరా?" దీనంగా అడిగాడు.

నా వూరిపేరు, నాన్నగారిపేరు చెప్పాను.

అతని ముఖం సంతోషంతో వెలిగిపోయింది. తన ఆనందాన్ని కప్పిపుచ్చుకుంటూ మెల్లగా అన్నాడు.

'ఆమె యిప్పు డెక్కడుంది?'

అతని ప్రశ్నకు జవాబు చెప్పలేదు నేను. అతనిని తమాషా చేయాలనే చిలిపి కోర్కె బయలుదేరింది నాలో. నా యీ మూడు సంవత్సరాల కాలేజీ జీవితంలో ప్రేమ, ఆరాధన, అని ఎవరైనా అంటే హేళన చేసేదానిని నేను. ఇప్పుడు కూడ మోహనుణ్ణి చూడగానే అలాగే అనిపించింది.

"మీరు మాధవిని ప్రేమించారా ?" అన్నాను చిలిపిగా.

మోహనుడు సున్నితంగా సిగ్గుపడ్డాడు. మనస్సులో నవ్వుకుంటూ అతనివైపు చూశాను. ఆరోజు సెషన్‌లో చూచిన మోహనుడితడులేడు. నీటుగా, హుందాగా కన్పించాడు.

అతను నా వైపు చూశాడు తన ప్రశ్నకు జవాబు చెప్పమన్నట్లు.

"ఆ అమ్మాయిని ప్రేమించే మీరు ఆ అమ్మాయి ఎక్కడుందో తెలిసికోలేకపోయారా?" అడిగాను అతని ఉడికించాలని.

మోహనుడు చెప్పాడు. చెప్పేటప్పుడు అతని గొంతులో బాధ ధ్వనించింది.

"మాకు తెలిసీ తెలియని వయస్సులోనే మేమిద్దరం అల్లుకుపోయాం. ఆ వయసులోనే విడిపోయాం. మధ్యలో ఒకసారు కలుసుకున్నాము. అంతే. యింత వరకు తిరిగి కన్పించలేదు. ఎప్పటికైనా నా అదృష్ట దేవత కనపడుతుందని ఎదురు చూస్తూ యీ జీవితాన్ని గడుపుతున్నాను."

నేను కాస్త బిగ్గరగా నవ్వాను. నేను అధిక్షేపంగా చేస్తున్నానని కాబోలు మోహనుడు ముఖం చిట్లించుకొన్నాడు. కాని తన మాధవి కొరకు శాంతంగా మారి, 'చెప్పరా?' అన్నట్లు నావైపు చూశాడు.

నేనే ఆ మాధవినని తెలిసుంటే, ఏ మాధవి కొరకైతే అతను ప్రతి క్షణం ఎదురు చూస్తున్నాడో ఆ మాధవే ఎదురుగా నిలబడి తనని హేళన చేస్తోందని తెలిస్తే అప్రతిభుడై భూమిలోకి క్రుంగిపోయేవాడేమో అతను.

'ఎప్పుడో చిన్న తనాన విడిపోయిన మాధవిని గుర్తు పెట్టుకున్నారా" అన్నాను ఆశ్చర్యం నటిస్తూ.

"నా చిన్ననాటి చెలికత్తె, చిలిపి పిల్ల నా మధూనెలా మరచిపోను? నా కొరకు తన అమూల్యమైన కన్నీళ్ళతో భూమాతకు అంజలి ఘటిస్తూ నన్ను ఓదార్చే నా మధూను గుర్తు పెట్టుకోకుండా ఎలా ఉండగలను?" గొణుక్కున్నాడు.

ఆ మాటలు నాలో కొద్ది చలనాన్ని కలిగించాయి. "నా చిన్ననాటి చిలిపి పనులు యింకా [illegible]గా గుర్తు పెట్టుకున్నాడా! [illegible]

[illegible]

'ఆమె యిప్పు డెక్కడుంది' మరలా అడిగాడు.

ఇంతవరకూ భద్రంగా దాచుకొన్న నిజం చెప్పేయాలనిపించింది, కాని అంతలోనే నా అహం [illegible] ఉన్న నిజం చెప్పి అతని ముందు నన్ను నేను చిన్నబుచ్చుకోదలుచుకోలేదు. అలా అతనితో తన జీవితం గడుపుకోవాలనిపించలేదు. ఆ వూహా నాకు భయం

# పరమపద సోపానము

కరంగా అన్పించింది

మరలా యీరోజు ఆ నిజాన్ని కప్పిపుచ్చడానికి యింకొక అబద్ధమాడాను. "ఆ అమ్మాయి పెళ్ళయి రెండేళ్ళయింది" అతని ముఖంవైపు పరీక్షగా చూస్తూ నెమ్మదిగా అన్నాను. ఆ మాటతో,

అతని ముఖం వెలవెలపోయింది. నా మాటలు అతని హృదయంలో శూలాల్లా గ్రుచ్చుకొన్నట్లున్నాయి. అతని కనుగుడ్ల చలనం ఆగిపోయింది. మరి మాట్లాడకుండా పెద్ద పెద్ద అంగ లేసుకుంటూ వెళ్ళిపోయాడు

తనది అనుకున్న మాధవి, ఎప్పుడూ తనదిగా ఊహించిన మాధవి పూర్తిగా శాశ్వతంగా యింకొకరి సొత్తు అయిందని తెలిసిన మోహనుడు ఆ దాటికి తట్టుకోలేకపోయాడు. అది అతని స్వార్థమే కావచ్చు కానీ అది అతని అపరాధం మాత్రం కాదు.

నాకున్న ధన గర్వంతో, విద్యా గర్వంతో నా జీవితంలో, నా మోనా జీవితంలో ఒక నాటకం సృష్టించాను. ఆ నాటకంలో నేనే సూత్రధారిణినై ఒక ఆట ఆడాను. ఆనాడనుకొన్నాను. ఆ ఆటలో మోహనుడు ఓడిపోయాడని. కానీ......కానీ ఆ 'గేమ్'లో ఎక్కువగా ఓడిపోయింది పోగొట్టుకొంది నేనే.

ఆనాడు కలం చేతిలో ఉంచుకొని నా దూర దృష్టిని నిందించుకోడానికి నేనే కారకురాల్ని. అందుకు నే నెవర్ని బాధ్యుల్ని చేయలేను

మరొక్క సంవత్సరానికి నే కోరుకొంటున్న ఆశయాల్ని అందుకో గలిగాను. ఎదురు చూస్తున్న ఐశ్వర్యాన్ని చేరుకో గలిగాను. అందంలో మన్మధుడు, డబ్బులో కుబేరుడు, అంతస్తులో నేనూహించలేనంత గొప్పవాడు నాకు భర్త అయ్యాడు. అతనితో నాకు మూడవ సంవత్సరంలోనే పరిచయమైంది. అతను 'నిన్ను పెళ్ళి చేసుకుంటావా' అన్నాడు. 'సరే' నన్నాను. ఇంట్లో అంతా యిష్టపడ్డారు. ముఖ్యంగా నేను కోరుకొన్నది నాకు లభిస్తోంది. అంతకంటే ఏం కావాలి? కానీ అతను నన్ను చదువుమానేయమన్నాడు. మొదట నేను దాన్ని అంగీకరించకపోయినా ఆ తర్వాత ఆ మెకానికల్ జీవితంమీదా నాకూ మోజు పోయింది. నిర్విచారంగా చదువుకు స్వస్తి చెప్పి అతనితో నా జీవితాన్ని ముడిపెట్టాను. అతను కుబేరుడు, మన్మధుడు. కానీ..... కానీ స్త్రీకి సౌఖ్యమివ్వలేని పురుషుడు, స్త్రీని స్త్రీగా చూడలేని అంధుడు, ఆమె కంటూ ఒక వ్యక్తిత్వముందని గౌరవించలేని అహంకారి. అతను నా భర్త

నా భర్త నన్ను చులకనగా చూచినప్పుడు, అతను త్రాగివచ్చి తెలివి తప్పేలా కొట్టినప్పుడు, తనని మనిషిలా కాకుండా మట్టిబొమ్మలా చూస్తూ అసభ్యంగా ప్రవర్తిస్తున్నప్పుడూ, మోహనుడు, నా కొరకు పరితపించే నా మోనా గుర్తుకు వచ్చి వెక్కి వెక్కి ఏడ్చేదాన్ని. స్టేషన్లో అతను కన్పించినప్పటి నా ప్రవర్తనను తలచుకుని కుమిలిపోయేదాన్ని. అతని తీయటి కబుర్లు గుర్తు తెచ్చుకుని నా బాధను మర్చిపోవాలని ప్రయత్నించేదాన్ని. "నేను విడిస్తే నాతోపాటు నా కొరకు కన్నీళ్ళతో భూపాలాలకు అంజలి ఘటిస్తూ, నన్ను నోదార్చే నా మధూ ఎలా మర్చిపోను?" ఆనాటి మోహనుడి మాటలు నన్ను ఓదార్చేవి

అప్పుడు నా జీవితాన్ని రక్షించుకోవడానికి రెండు అబద్ధాలుచెప్పి, అతని జీవితాన్ని బలిపెట్టాను. ఇప్పుడు నేను కోరుకున్న జీవితంతో సంతృప్తి పడలేకా, ఎవరినీ నిందించలేకా బాధపడుతూ, ఆ బాధను మర్చిపోవడానికి అతని వూహాలనే సాధనంగా ఉపయోగించుకుంటున్నాను "ఎంత స్వార్థపరురాలిని నేను!"

ఇక నా కలం కదలదు. ఇక దానికి భవిష్యత్తు తెలియదు. ఏదో ఒక రోజు నా మోనా కన్పిస్తాడు. అంతటితో ఈ కథ పూర్తవుతుంది. ఆ క్షణం కొరకే ఎదురు చూస్తున్నాను. అతని పాదాలను నా కన్నీటితో అభిషేకం చేస్తూ క్షమించమని అడిగితే చాలు. అంతే చాలు. అతను క్షమించినా, శిక్షించినా హృదయ పూర్వకంగా స్వీకరిస్తాను.

* * *

ఆమె కలం ఆగిపోయింది. దానితోపాటు ఆమె మనసు కూడా అలసిపోయింది. అలా ఆ కాగితాల మీదనే ఒరిగిపోయి నిద్రపోయింది.

"మా......ధవ!" ఎక్కడినుండో త్రాగుడు మైకంలో గతి తప్పిన స్వరం. ఆ స్వరానికి మాత్రమే అలవాటుపడ్డ ఆమె ఉలిక్కిపడిలేచింది. గబగబ నెత్తి తలుపుతీసింది. ఎదురుగా భర్త. ఎర్రని కళ్ళతో.

"ఏం చేస్తున్నా....వు మన...వార్యం ఎంతసేపు పిలవాలి రాణిగారిని"

ఆమె వెంప నొప్పుకుంది

"క్షమించండి.... వినపడలేదు".

"వినిపిం....చక పోవడానికి ఏలోకాల్లో వున్నావు"

ఆమె మాట్లాడలేదు.

"ఏం మాట్లాడవు? మొగుడంటే ఏమైనా గౌరవం వుందీ?"

ఆ అరుపులు ఎవరైనా వింటారని భయపడింది మాధవి.

"మీకు మనస్సు స్థిమితంగా లేదు. రండి, నాసేపు పడుకుందురుగాని."

అతనికి అడ్డు తొలగి వెనక్కు తిరగబోయింది.

"ఏమిటి నీ ఉద్దేశం. 'త్రాగుబోతు వెధవా!' అంటావా?" ఆమె చెంప పగిలిపోయింది. ఒక్క త్రోపు త్రోసాడు.

తను ఇంతకాలం మోస్తున్న తన జీవితకథ పేపరుమీద కెక్కించేసరికి ఆమె పూర్తిగా బలహీనురాలయి పోయింది. ఇక ఎదిరించడానికి కూడా శక్తిలేక పోయింది. ఆమె తల గిరగిర తిరుగుతున్న టేబిల్ ఫ్యాన్‌కు కొట్టుకుంది. కుప్పలా కూలిపోయింది.

హాస్పిటల్‌లో, స్పెషల్‌వార్డులో మెత్తటిపరుపు మీద కళ్ళు తెరిచి మాధవి ఎదురుగా, మెడలో స్టెతస్కోపు తగిలించుకుని తనవైపు చూస్తున్న—మోహనుడు. సంతోషంతోనూ, దుఃఖంతోనూ ఆమెకు నోట మాటరాలేదు. తను ఇంతకాలం,

ఎదురుచూచిన మోహనుడు తనను పలకరించ కుండానే వెళ్ళిపోయాడు కొంత గంభీరమూర్తిలా నడుచుకుంటూ.

మెదలో స్మృతిసోృపులో మోహనుణ్ణి చూచి అమితంగా ఆశ్చర్యపోయింది మాధవి. "తననుకో లేదు తన చిన్ననాటి చెలికాడు, బాంధవుడు, ఆనాడు పరీక్ష పోగొట్టుకున్న మోనా, మాసినచొక్కాతో, చింపిరి జుట్టుతో తనకు స్టేషన్లో కన్పించిన మోహనుడు, తనచేత అసహ్యించుకోబడిన ఆ దురదృష్టవంతుడు ఇప్పుడు డాక్టరుగా తనకు ఎదురుపడ్తాడని. అతను డాక్టరు ఎలా అయ్యాడో తన వూహాకందని విషయం."

"నేను రోగిని. అతను డాక్టరు. అతను దేవుడు, నేను భక్తురాలిని. అతను జడ్జి, నేను అపరాధిని. 'ఒకనాడు డాక్టరు అవబోతున్నాను కదా!' అని ఆ పసివాడిని, ఆ బీదవాడిని అసహ్యించుకున్నాను. కానీ నేడు నేను ఆ బీద డాక్టరు క్రింద రోగిని. అబ్బ! ఎంత సంతృప్తిగా వుంది. ఈ శిక్షలో ఎంత ఆనందం వుందీ!!

"మెలుకువ వచ్చిందా?" అంటూ గంభీరంగా అడిగాడు ఆనాటి చిలిపి మోహనుడు ఆమెను.

మాధవి కళ్ళనీళ్ళు ఆగలేదు. ఆమె వెక్కి వెక్కి ఏడుస్తోంది. అతనికి అర్థంకావటేదు తన పేషంటు ఎందుకు ఏడుస్తుందో.

"మోనా!" వెక్కిళ్ళమధ్యగా మమత నిండిన పిలుపు.

ఆమెను శారదగా అనుకుంటున్న డాక్టర్ మోహన్ ఉలిక్కిపడ్డాడు. అతని కళ్ళు ఆత్రంగా ఆమె కళ్ళల్లోకి చూచాయి.

"నువ్వా! నా మాధవివా?" ఒక్కమారుగా అంత సంతోషాన్ని భరించలేక పోయాడతను. ఆ సంతోషంలో ఆ మాటలు పెదవులు దాటి పైకి రాలేక పోయాయి.

"ఎవరు పిలుస్తారు? ఇంకెవరు పిలుస్తారు తనని 'మోనా' అని. నా మధూకి తప్ప ఆ పిలుపు ఇంకెవరికి తెలుసు?" అతనికళ్ళు మెరుస్తున్నాయి.

"మోనా! మోనా!! నాకు ప్రాయశ్చిత్తంలేదు. నేనునిన్ను మోసం చేశాను. నేను శారదను కాను. మాధవిని, నీ మాధవిని మోనా..... కానీ....." ఆమె ఆగి అతని కళ్ళల్లోకి చూచింది.

"క్షమించు మోనా! ఒక్కమారు క్షమించానను మోనా!"

అతను తేరుకుంటున్నాడు. "పోనీ.... శిక్షించు మోనా!...... ఆనాడు నువ్వడిగావు. 'పోనీ బాగా చదువుకుంటాను నా జట్టుంటావా మాధవీ!' అని. ఆనాడు ఒప్పుకున్నాను. కాని.... కానీ..... ఈరోజు నువ్వు బాగా చదువుకున్నావు. అయినా నేను నీ జట్టుకాదు. నీజట్టు కానేకాదు మోనా" ఆమె ఆయాసపడ్తూ ఏడుస్తోంది.

అతని మధురమైన కల చెరిగి పోతోంది.

"ఎవరికోరకైతే ఇన్ని రోజులు తపస్సు చేశాడో ఆ దేవత ప్రత్యక్షమయిందీనాడు .... కానీ అతి పవిత్రంగా హృదయంలో దాచుకున్న దేవతను ఈ స్థితిలో ఎలా చూడడం?" ఇంక కన్పించదనుకున్న మాధవి కన్పించి, అతడిని పిచ్చివాడిని చేస్తోంది.

"తన మధు ఎందుకిలా చేసింది?" అదే అతనిని వేధిస్తున్న ప్రశ్న.

"కాదు. కాదు ఈమె నా మధూకాదు. నా మధూ ఎప్పుడూ మోనాని మోసం చేయదు. అమాయకురాలైన ఆ పసిపిల్లకు అబద్ధం ఆడడం కూడా చాతకాదు" అతనిలో సంఘర్షణ మొదలయింది. బలవంతంగా నిజాన్ని అబద్ధంగా నమ్మడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తున్నాడు. "ఒకే ఒక్క నిజం అతనిని మరలా వెనక్కి నెట్తోంది. "కానీ..... మాధవి.... తన మధూ తప్ప తనని అలా ఎవ్వరూ పిలవరు. నిద్రలో అయినా సరే ఆపిలుపును పోల్చుకోగలడు తను. సంవత్సరాలు దొర్లి పోయినా ఆ పిలుపులో మాధుర్యం ఇంకా చెదరలేదు. అలాంటి పిలుపును కాదని ఎలా అనగలడు?"

"ఈ రోజు నాకెందుకు కన్పించావు మధూ.... కన్పించి నేను పవిత్రంగా పూజిస్తున్న నా దేవతకు ఎందుకు మసి పులుముతావు? నా దేవతను మోసకత్తెగా, అబద్ధాలకోరుగా ఎలా నమ్మను? నమ్మి నేనెలా బ్రతుకను? ఏ ఆశతో బ్రతుకమంటావు?" అతని హృదయంలో మధూ కొలూకు స్థలం తప్ప మిగతాదంతా మండిపోతోంది. ఆస్థలం తాలూకు చరిత్ర ఎంత హీనమయినదయినాసరే దానిని తాకడానికి ఆ మంట సాహసించలేక పోతోంది.

"పోనీ....పోనీ...గతాన్ని మరచిపోతాను...'మోనా!' అనే ఆ మధురమైన పిలుపు కొరకు ఆమెను క్షమిస్తాను. ఆ పిలుపును స్వీకరిస్తాను."

అతని కనురెప్పలు టపటప కొట్టుకున్నాయి. వాటి వెనక గతం విస్మరించబడింది. ఒక్కడుగు ముందుకు వేసాడు. వాకిట్లో ఎవరిదో నీడ పడింది. అతని కళ్ళు ఆమెను పరిశీలనగా చూచాయి. ఆమె గుండెలమీద మెరుస్తున్న మంగళ సూత్రం మీద ఆగిపోయింది అతని చూపు. అంతవరకు ఆమెను ఓదార్చాలనీ, "ఇంక నీకు భయంలేదు మోనా నీకు నేనున్నాను"ని చెప్పాలనీ, ఇంకా ఏదో మధురమైన మాటలను మనసులోనే అల్లుకుంటున్న మోహన్ ఆగిపోయాడు.

అతని కళ్ళలోకి ఆశగా చూస్తూ మమకారం నిండిన స్వరంతో పిల్చింది ఆమెను.

"మోనా!"

ఒక్క క్షణం కాలంలో అతని కళ్లల్లో మెదిలిన నిరాశ తాలూకు తడిని కనురెప్పలు పీల్చుకున్నాయి. మనస్సులోనే నిట్టూర్చి జీవితమంతా కూడబెట్టిన బలాన్ని కూడతీసుకుంటూ, అస్థిరంగా అన్నాడు.

"క్షమించండి. నేను మీరనుకునే మోనాని కాను. నా పేరు చిరంజీవి. నేను డాక్టర్ చిరంజీవిని."

ఇక అక్కడ నిలవకుండా వడివడిగా అడుగు లేసుకుంటూ వెళ్ళిపోయాడు డాక్టర్ మోహన్. షాక్ తింది మాధవి. ఆమె అనుకోలేదు అతనినుండి అటువంటి జవాబు వస్తుందని. మొదట్లో అతను శిక్షిస్తాడనుకుంది. తర్వాత క్షమిస్తాడనుకుంది. అతి విచిత్రమైన కాలం మధ్యలో గడిచిపోయినా, తన మోనా ముఖభావాలు చదవగలదామె.

"తన అంచనా తప్పయిందా? కాదు. కాదు అతను మోనానే. నా కొరకు.....తన మాధవి కొరకు అబద్ధమాడాడు. ఈ అబద్ధంలో ఎంత త్యాగముందీ" ఆమె హృదయం నిండుకుంది.

"ఏ అబద్ధంతో అయితే నీ ఆశాజ్యోతిని నేను ఆర్పేసానో ఆ అబద్ధంతోనే నా జీవితాన్నివెలిగించాలని చూస్తున్నావు నువ్వు. నేను స్వార్థంతో చేసినపనిని నువ్వు ఎంత త్యాగంతో చెయ్యగలిగావు మోనా!"

"ఎంత భారమైన శిక్ష విధించావు మోనా? ఎలా మోయుని భారాన్ని?"

"శిక్షా బారం కూడా ఒక మాధుర్యంగా వుంటుందని నాకు తెలియుదు. ఈ శిక్షను సంతోషంగా మోస్తాను మోనా!"

ఆమె కిక ఆలోచించడానికి వోపిక లేకపోయింది. మత్తుగా, నీరసంగా బలహీనంగా సొలిపోయింది. వాలిపోయాయి కనురెప్పలు.

"ఎలావుంది మాధవీ!" భర్త పిలుపు ఎక్కడో విన్పించింది ఆమెకు.

పెదవులమీద చిరునవ్వుతో హీనస్వరాన లేచి అంది ఆమె, "చాలా బాగుంది." ●



# అరుణాచల ఋషి రమణమహర్షి

'కమలా: వీరికి మన ఆశ్రమం అంతా చూపించు' అన్నారు రమణమహర్షి. ఆ వచ్చినాయన చుట్టూ చూసి, . కొయ్యబారిపోయాడు. మహర్షిమాటలకు ఒక కుక్క తలాడించి, ఆయనకు మార్గం చూపింది. ఆయన ఆశ్చర్యంలోంచి తేరుకునే లోపునా కమల ఆయనకు ఆశ్రమం అంతా చూపించేసింది.

రమణమహర్షి ఆశ్రమంలోని పశుపక్ష్యాదులకు మనుష్యసంబంధమైన తెలివితేటలు వుండడానికి రమణమహర్షి ఆప్యాయత, మచ్చికే కారణం.

జగద్గురు శంకరాచార్యుడు వ్రాసిన టీకా తాత్పర్య సహిత భగవద్గీతను చదివాక మహర్షికి యీ జిజ్ఞాస అధికమయిందట. మరణం తరువాత జీవుడు . ఖర్మానుసారం నరకానికో, స్వర్గానికో వెళ్లి, అక్కడ తత్ఫలాన్ననుభవించి, భూమిమీద జన్మిస్తాడు అనే సిద్ధాంతాన్ని మహర్షి నమ్మారు.

ఈ ఖర్మ—ఖర్మానుసరణ కేవలం మానవ జన్మలోనేగాక, పశుపక్ష్యాదులలో కూడా వుందని చెపుతూ 'ఈ పశుపక్ష్యాదులకూ మనకూ జన్మాంతర సంబంధం వుంది గనుకనే...ఋణం యీవిధంగా మనం తీర్చుకుంటున్నాం' అన్నారు. శరీరాన్ని గగుర్పొడిచే ఒక సంఘటన మహర్షి శక్తిని చాటుతుంది.

అది 1947వ సంవత్సరం జూన్ 17వ తేదీ. ఆశ్రమంలో లక్ష్మి అనే ఒక ఆవుకి జబ్బు చేసి, మరణకాలాన్ని సమీపించింది. రమణమహర్షి ఆ ఆవువద్దకు వెళ్లి గంగడోలు నిమురుతూ, 'అమ్మా లక్ష్మి: నేను నీదగ్గ్గవుండాలని నీ కోర్కె' అంటూ ఆ పశువుల శాలలో కూర్చుని దానితల తన తొడమీద పెట్టుకుని ముఖానికి ముఖం అన్చి 'దీక్ష' ఇచ్చారు. దాని హృదయం మీద చెవిపెట్టి కాసేపు చూసి, తలవూపి, 'లక్ష్మిది సఫల జన్మ. మనసు భగవంతునిమీదే నిలిపింది'అని, లేచి వెళ్లిపోయారు. మరికొన్ని నిముషాలకు లక్ష్మి ప్రశాంతంగా చనిపోయింది. ఆశ్రమంలో ఒకచోట లక్ష్మి దేహాన్ని యధావిధిగా పాతిపెట్టి ముక్తి పొందిన జీవిగా ఒక ఫలకం మీద రాశారు.

కేవలం చనిపోయే సమయంలో శరీర సంబంధమైన కష్మాలు, వికారాలు లేకుండా, ప్రశాంతంగా చనిపోతే ముక్తి—మోక్షమూ పొందినట్టేనా అనే ప్రశ్నకు సమాధానంగా, 'కేవలం అదేగుర్తు కాకపోయినా, అదీ కొంతవరకూ గుర్తే' అన్నారాయన.

* * *

దక్షిణ భారతదేశంలో ఆర్ద్ర దర్శనం అనేది శైవులకు మహా పర్వదినం. ఆది శంకరుడు ఆ రోజున నటరాజుగా దర్శనమిస్తాడు. తిరుచూగి అనే వూళ్ళో ప్రసిద్ధిపొందిన అరవై ముగ్గురు ఆళ్వారుల్లో ఒకరైన సుందరమూర్తిస్వామి కట్టిన దేవాలయంలో యీ ఆర్ద్ర దర్శనం రోజు మహా పర్వదినం.

* * *

సుందరమయ్యర్, అలగమ్మాళ్ లకు రమణమహర్షి 1879 లో పుట్టాడు. అప్పుడాయన పేరు వెంకటరమణన్. ఆయన పన్నెండో ఏటనే తండ్రి చనిపోవడంవల్ల మధురలో వున్న మేనమామ సుబ్బయ్యర్ ఇంట్లో పెరిగారు. పదహారో ఏట తమిళ పురాణంలో ప్రసిద్ధి పొందిన అరవై ముగ్గురు ఆళ్వారుల జీవితచరిత్ర చదివారు. దాంతో ఆయనకు చైతన్యం కలిగింది. మానవ జన్మకు ముక్తే సాఫల్యమని, దాని అన్వేషణే మార్గమనీ తెలుసుకున్నారు ఆయనలో యీ బీజం అభివృద్ధి చెందుతూ వచ్చింది. ఓ రెండువెలల తరువాత ఇంట్లోంచి పారిపోయి తిరువన్నామలై చేరారు. చేరీ చేరగానే పవిత్ర యజ్ఞోపవీతాన్ని విసర్జించారు.

సర్వం పరిత్యజింపబూనినవాడు తన యిల్లూ, వాకిలీ, 'నా' అనేవాళ్లనే గాక, కుల మత భేదాన్ని కూడా పరిత్యజించాలనీ, దీనికి బద్ధుడై వుండకూడదనీ ఆయన నమ్మారు.

వేయిస్తంభాల మండపంలో ఒకమూల కూర్చుని భగవధ్యాన్నం ప్రారంభించారు. ఒకేచోట కళ్లు మూసుకుని కూర్చోడం వల్ల పిచ్చివాడేమోనన్న అనుమానంతో కుర్రకారు, అల్లరిమూక రాళ్లేసికొట్టారు. అజేయాలయిన ఇంద్రియాలను జయించడానికి తపస్సుచేసే వ్యక్తికి యీ బాధ లొకలెక్కలోనివి కాదుగదా! ఆయన చలించలేదు. పెద్దవారు కొట్టారు. మంచివారు వారించారు.

రెండేళ్ల కృషితో ఆయన సహజ తపశ్శక్తి సంపన్నుడయాడు. ఆ చోటునుంచి అరుణాచల పర్వతం మీదికి తన నివాసం మార్చుకున్నారు. అనేకులు శిష్యులయ్యారు. మౌనిగా వున్నపుడు మహర్షి తన సమాధానాలనూ, సలహాలనూ వ్రాసి చూపేవారు. 1912 నాటికి ఆయన తపస్సు నిలిపి, తన మనోగత అభిప్రాయాలను, భావాలను బోధించారు. మహర్షీస్ గాస్పెల్ (మహర్షి బోధ) అనే ఒక పుస్తకంలో యీ బోధనలున్నాయి. ఆయన యిదేగాక, చాలా పుస్తకాలు రాశారు. ఒక భక్తుని కోర్కెమీద భగవద్గీతలోని మహత్తరమైన పద్యాలలో ఒక నలభైరెండు పద్యాలను ఏరి, వాటిని అనువుగా కూర్చి, అద్భుతమైన టీక, తాత్పర్యం రాశారు. 'ది సాంగ్ సెలెష్టియల్' అనే పుస్తక రూపంలో ప్రచురింపబడింది.

1949 వ సంవత్సరంలో రమణమహర్షి ఇహలోకయాత్ర ముగించి, ఈశ్వర సాన్నిధ్యం చేరారు.

వి. యస్. సుక్తాంకర్.



# 7 రోజులలోనే సీత తన చర్మమును స్వచ్ఛంగా, మనోహరంగా చేసుకొన్న కథ!

# 7-రోజుల పాండ్స్ సౌందర్య చర్య యొక్క చమత్కారము



కాలేజి సోషల్‌కి ఇంక 7రోజులే వున్నాయి! కాని, ఎండి వాడి పోయిన చర్మముతో పార్టీకి ఎల్లాగ వెళ్లగలుగుతాను అని చింత కలిగింది. అదృష్టవశాత్తు 7రోజుల పాండ్స్ సౌందర్య చర్యను గురించి విన్నాను.



ఒక వారం రోజుల పాటు, రాత్రి పడుకునే ముందు పాండ్స్ కోల్డ్ క్రీమును రెండు సార్లు నా ముఖానికి రాసుకున్నాను. మొదటి సారి రాయడంతో పైమురికి, మేక్-అప్ తొలగిపోతాయి.



తరువాత మెత్తటి టిస్యూ పేపర్‌తో గాని, గుడ్డతో గాని క్రీమును తుడిచి వేశాను.



రెండవసారి నా ముఖానికి యింకా క్రీమ్ రాసుకొన్నాను. నిజానికి యిదే సౌందర్య రహస్యము. ఎందుకంటే, ఈ సారి క్రీమ్ చర్మములోకి పోయి మరుగు పడివున్న మురికిని తొలగించును.




7 రోజుల తరువాత, పార్టీలో నా చర్మము అత్యద్భుతంగా, స్వచ్ఛంగా మెరిసిపోయింది! ఇప్పుడు ప్రతి రోజూ పాండ్స్ కోల్డ్ క్రీముతో చర్మాన్ని శుభ్రపరుస్తున్నాను. అందు వలననే, నా ముఖ వర్ఛస్సు ఎల్లప్పుడు స్వచ్ఛంగా, మనోహరంగా కనబడుతుంది.

# పాండ్స్ కోల్డ్ క్రీమ్

ఇది ప్రపంచములో అత్యధికంగా అమ్ముడగు చర్మమును శుభ్రపరచే క్రీమ్

చీస్‌బ్రో-పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్

(పరిమిత బాధ్యతతో యు.ఎస్.ఎ.లో స్థాపించబడినది)




'సంతాన నిరోధన విషయం చర్చిస్తే మండిపడే ఈ ఉద్దండులు పిల్లలమీద ఏం ఆప్యాయతలు ఒలక పోస్తున్నారని?' అంటూ ఉపన్యాస ధోరణిలో మాట్లాడు తూనే లోనికి వచ్చిన స్నేహితురాలిని చూసి ఆశ్చర్యపడ్డాను. వేళ కాని వేళ. ముఖం చెమటలు కారుతోంది. జేవురించి ఉంది. ఏడ్చినట్టు కళ్ళు ఉబ్బి ఉన్నాయి. ఏమిటి కధ? అని అడిగాను.

'వెధవది ఊరు పిల్లి ఇంట్లో పిల్లల్ని పెడ్తే ఊరుకున్నాను. అది మూడు సార్లు పారిపోయింది. మూడుసార్లూ ఎవరో ఒకరు తెచ్చి ఇచ్చారు! 'మీ పిల్లి' అంటూ. 'రోడ్డుమీదకి పోనివ్వకండి ఏ కారు కిందో పడుతుంది' అని హెచ్చరించారు కూడా. కాని ఈ రోజు ఏమైందో తెలుసా? పెరటి తలుపు తీసుకొని కుర్రాడు... (ఈ వెధవే—అంటూ చంకలో ఉన్న నాలుగేళ్ళవాణ్ణి ముద్దుగా బుగ్గ పొడిచి చూపెట్టిందనుకోండి!) ఎటో వెళ్ళి పోయాడు వెధవ ఎక్కడో ఆడుకుంటు న్నాడు కాబోలని పట్టించుకోలేదు తీరా పదకొండు గంటలవేళ చూద్దును కదా ఎక్కడా కనబడలేదు. ఇల్లూ వాకిలీ పక్క వాళ్ళ ఇల్లూ గాలించాను. ఎక్కడా లేడు. గుండె దడపుట్టింది. ఆదరాబాదరాగా మెయిన్ రోడ్డు మీదకి పరుగెత్తాను. అక్కడ దూరంలో కనిపించాడు రోడ్డు దాటడానికి కాబోలు చూస్తున్నాడు. చుట్టుపక్కల అంతమంది ఉన్నారా ఏ ఒక్క ప్రాణికీ తోచ లేదు. ఇంత కుర్రాడిక్కడ ఒక్కడూ ఏం చేస్తున్నాడు? ఎలాగ వచ్చాడు అని? ఎవరి దారిన వాళ్ళు పోతున్నారు వస్తు న్నారు. ఒక్కడికి తోచలేదు పిల్లాడిని చేయిపట్టి ఆపాలని గాని, ఎక్కడికెళ్ళా లని అడగాలని గాని. కాస్తుంటే వాడు రోడ్డు దాటనూ దాటేవాడు. ఏ కారు కిందో బస్సు కిందో పడి ఉండేవాడు. పరుగున వెళ్ళి రెండంటించి లాక్కొ చ్చాను' అంది ఉస్సురని కుర్చీలో కూల బడుతూ.

కుర్రవాడు కనిపించని క్షణంనుంచీ ఆ తల్లి పడ్డ ఆవేదన ఎవరేనా అర్థం చేసు కోవచ్చు. బస్సుస్టాండులో రోడ్డుమీద నడుస్తూ అంతమంది ఉన్నారుకదా ఏఒక్క రికీ 'ఈ కుర్రాడు ఒంటరిగా ఎందుకిలా తిరుగుతున్నాడని గాని తప్పిపోయాడేమో అనిగాని ఎందుకు తోచలేదు' అన్న సంగతి ఆలోచిస్తే—అనిపిస్తుంది—మనం నిజంగా పిల్లలని గురించి అంతగా పట్టించు కుంటామా? అని...

పట్నవాసపుటిళ్ళలో విశాలం తక్కువ.

డాక్టర్ కబుర్లు

## వేరుశనక్కాయల్లో మాంసకృత్తులు

భారతదేశంలోని 40—50 కోట్ల మంది వేరుశనక్కాయలు తినటం మొదలుపెడ్తే — వారికి వచ్చే జబ్బులెన్నో తగ్గుతాయి.



భారతదేశ ప్రజలకి మాంస కృత్తుల కొరత చాలా ఉంది. పశు మాంసం అక్కడ తినరు. కూర గాయలలో మాంస కృత్తులు తక్కువ. బలహీనం పెరుగుతుంది.

వేరుశనకాయలో మాంస కృత్తుల శాతం అధికం. భారత దేశంలో బాగా పండుతుంది. కాని, అధికభాగం గొడ్లకి పెడ్తారు!

ఇతర దేశాలలోనూ ఇది పశువు లకి ఆహారంగా పెడ్తారు. అయితే అక్కడ ఇంత మాంసకృత్తుల కొరత లేదు కదా?

వేరుశనగ భక్షణ ప్రచారం అధికం చెయ్యడం భారతదేశ ముఖ్యావసరాలలో ఒకటి!

హెచ్. ఎల్. హార్వెన్‌సోన్

దాంతో పిల్లలు ఆడుకునే చోటు తక్కువ ... ఇంక ప్రస్తుతం అద్దెల కిస్తామంటున్న ఇళ్లు చూడండి—పిల్ల లెక్కువా ? అయితే మేం ఇవ్వం. అని నిర్మొహమాటంగా చెప్పేస్తున్నారు.

పోనీ అని ఎక్కడికేనా బయిటకి తీసుకు వెడితే అక్కడ పిల్లలు గొంతు విప్పితే చాలు 'ష్ష్...' అంటూ తల్లి, నమిలి మింగేసేలా చూస్తూ తండ్రి. కొత్తస్థలానికి వెళ్లినప్పుడు, కొత్తదేదైనా వారికంట పడ్డప్పుడు పిల్లలు ఉత్సాహంగా దాన్ని చెప్పాలని చూపాలని అనుకుంటారు. అది కాస్తా పెద్దవాళ్ల ముఖాలు చూసేసరికి చప్పగా చల్లబడి పోతుంది. ఆ బయిటకి తీసుకు వెళ్లిన సరదా — అటు పిల్లలకీ ఉండదు, ఇటు పెద్దలకీ మిగలదు. అదొక ప్రయాసతో ముగించిన కార్యక్రమంగా తయారై ఊరుకుంటుంది.

పిల్లలకి ఏడు సంవత్సరాలొచ్చేసరికే వారి ఊహలకి స్థిరత్వం ఏర్పడిపోతుంది. వారి సరదాలు, నమ్మకాలు, విశ్వాసాలు, ద్వేషాలు పునాదులు వేసుకుంటాయి. అందుకే ఈ వయస్సులోపలి పిల్లల పెంపకంలో తగినంత ఆసక్తి తల్లి తండ్రులు చూపాలి అనడం. పిల్లల ఉనికి పెద్దలకి ఉత్సాహం ఇస్తుంది- 'మీరు మాకు కావాలి' అన్న నమ్మకంతో ఆదరణతో పిల్లలని చూస్తే వారు పెద్దవాళ్లయాక సగం ఇబ్బందులు తగ్గిపోతాయి ..ఈ నాటి తల్లి తండ్రులంతా కూడా ఒకప్పుడు పిల్లలేకదా! ఆ సంగతి ఓసారి జ్ఞాపకంచేసుకుంటే!... పిల్లవాడే మనిషికి తండ్రి అంటారే ... అలాంటప్పుడు ఈ తండ్రులు తమ చిన్నతనం ఇంకొంచెం హాయిగా, ఇంకొంచెం తీయగా గడిపివుంటే, ఈడుపిల్లలు వారితో ఇంకొంచెం ప్రేమగా, ఇంకొంచెం స్వేచ్ఛగా పెరిగేవారుకదా అన్న సంగతి కూడా అడపా తడపా జ్ఞాపకం చేసుకోవడం మంచిదేమో.

'నా చిన్నతనంలోనా - మా నాన్న పట్టిన పొంటపిక్కలు, వేయించిన గోడకుర్చీలు ... ఓ' అంటూ జ్ఞాపకం ఉంటాయేగాని 'ఆ కక్ష పిల్లాడిమీద తీర్చుకుంటారా ?' అనే పసివాడి ఆక్రందన జ్ఞాపకం ఉంచుకోవడం మంచిదేమో ? ఏమంటారు. ●

# మన దేశంలో వ్రాత ఎప్పుడు పుట్టింది?

ప్రపంచంలో ఎన్నో భాషలున్నాయి. ఆ భాషలకు లిపులున్నాయి. ఉదాహరణంగా రోమన్ లిపి, దేవనాగర లిపి, అరబ్బీ లిపి మున్నగునవి. అంటే ఈ లిపుల్ని ఎవరు కనిపెట్టారు ?

ప్రాచీన ఈజిప్టు, మెసపొటేమియాలో, నివసించిన వారికి ఎన్నో వేల సంవత్సరాలకు ముందే రాయుడానికి తెలుసు కాని ఆ భాషల లిపులు నేడు వాడుకలో లేవు. ఆ కాలం వారు రాతిపైన, రాగి రేకులపైన రాసి ఉంచినవి ఎన్నో ఈజిప్టు, మెసపొటేమియా మొదలగు దేశాలలోను దొరికాయి. ఆ భాషలు నశించాయి. వాటిని చదివి అర్థం చేసుకోడానికి కొందరు పండితులకు మాత్రమే సాధ్యమవుతుంది.

మన దేశంలోకూడ వ్రాత ఎన్నో వేల సంవత్సరాలకు ముందే పుట్టింది. మొహెంజొదారో, హరప్పా ముద్రలపైన ఒకవిధమైన లిపిలో ఏదో రాయబడి ఉంది. ఆ వ్రాతని చదివి వాటిలో వ్రాయబడినదానిని గురించి పండితులు తమతమ అభిప్రాయాలు వెల్లడించారు. కాని అవి అంత తృప్తికరంగా లేవు. మొహెంజొదారో ముద్రలపైన వ్రాతను సరిగ్గా చదవగలిగితే ఎన్నో విషయాలు తెలుస్తాయి.

పూర్వం మన దేశంలో బ్రాహ్మి, కరోష్ఠీ అనే రెండు లిపులు వాడుకలో ఉండేవి. ఈ బ్రాహ్మి లిపినుండే ప్రస్తుతం వాడుకలో ఉన్న హిందీ, మరాఠి, తెలుగు మున్నగు భాషల లిపులు పుట్టాయి.

మన ప్రాచీన వ్రాతని గురించి, హిందూ, బౌద్ధ పుస్తకాలలో చెప్పబడి ఉంది. స్ట్రాబో, కర్టియస్ మొదలైన గ్రీకు యాత్రికులు ఆ కాలంలో వాడుకలో ఉన్న వ్రాతనుగురించిరాశారు. పాణిని 'లిపికర' అనే పదాన్ని ఉపయోగించాడు. 'లిపి' అంటె వ్రాతకి సంబంధించింది. దీనినిబట్టి చూస్తే ఆ కాలంలోనే వ్రాత వాడుకలో ఉందని తెలుస్తుంది. మనదేశంలో ప్రాచీన కాలంలో భూర్జ పత్రము, తాళ పత్రము, తోలు, శిల, లోహము మొదలైన వానిపైన రాసేవారు. తాళ పత్రము చాల చౌక, అంతేకాకుండా విరివిగా దొరికేవి అందుచేత ఆ కాలం వారు తాళపత్రాన్ని ఎక్కువగా వాడేవారు.

రాజశాసనాలు రాతిపై చెక్కేవారు. ఎందుచేతనంటే శిలపై రాస్తే చాలాకాలం ఉంటుంది. అశోకుడు ఒక శిలాశాసనంలో ఇలా రాశాడు 'ధర్మ సంబంధమైన శాసనాన్ని ఎందుకు రాతిపై చెక్కానంటే, చాలాకాలం ఉంటుంది. నా కొడుకులు, మనుమళ్లు, మునిమనమళ్లు ఈ ధర్మ సందేశాన్ని పాటించాలని.

రాజులు ఎవరికైనా భూములు, గ్రామాలు దానం చేస్తే రాగిరేకుల పైన రాసి ఇచ్చేవారు. అవి ఆ కాలం నాటి 'రిజిస్ట్రేషన్' పత్రాలు. రాజ శాసనాలు తయారు చేయడానికి ఆ కాలంలో రాజుల దగ్గర ప్రత్యేక ఉద్యోగులుండేవారు. వారే లేఖకారులు.

ఈ శాసనాలవల్ల మనకు ఎన్నో విషయాలు తెలుస్తాయి శాసనాల మూలాన ఆనాటి సంఘ పరిస్థితి, ఆర్థికస్థితి, ఆ కాలంలో వాడుకలో ఉండిన ఆచారాలు కొంతవరకు ఊహించుకోవచ్చు. ఈ శాసనాలు చరిత్రకారులకు ముఖ్య ఆధారాలు. ఇవన్నీ చూస్తే, వ్రాత, మనదేశంలో చాల పురాతనమైనదని తెలుస్తుంది.

—నీలం శంకరనారాయణ.




### జరిగిన కథ

నానా కష్టాల్లోవుండగా శ్రీనివాస్ తల్లి చనిపోయింది. తండ్రి గోపాలం వ్యసనాల పుట్ట. అతను రెండో వివాహం చేసుకుంటాడు. అంత వయసువాడితో తనకి వివాహం జరిగినందుకు సుభద్ర లోలోన కుమిలిపోతుంది. గోపాలం చనిపోతాడు. సరస్వతి మనోవ్యాధితో కృశించి చనిపోతుంది. పద్మావతి రామదాసును రెండో వివాహం చేసుకుంటుంది. ఆమెకు ప్రభాకర్ అనే కొడుకు, రాజేశ్వరి అనే కూతురూ వున్నారు. ప్రభాకరం తన కథని శ్రీనివాస్‌కి చెప్పాడు. సుభద్ర జగదీశ్‌తో ఎక్కడికో వెళ్ళిపోతుంది.

## 7

గోదావరికి కొంచెం దూరంలో వున్న అతని రూమ్‌లోంచి స్పష్టంగా రేవు అంతా కనిపిస్తుంది. ప్రతిరోజూ ఆ రేవు వైపు దూరాన తెరచాపలెత్తి వెళ్ళే పడవలు, బారులు తీర్చి ఆకాశంలోకి రివ్వున ఎగిరి పోయే కొంగల్లా, చిరిగిపోయిన తెల్లని కాగితం ముక్కలు పైపైకి పోతూన్నట్లూ కనిపిస్తాయి. 'బర్' మనిపిస్తూ కదిలిపోయే లాంచీలవైపు చూడడం అతనికి చాలా యిష్టం. శ్రీనివాస్‌కి కర్తవ్యం తెలీడం లేదు. ఎక్కడైనా వెళ్ళిపోయి నిశ్చలంగా, ప్రశాంతంగా గడిపేయాలని వుంది. కానీ 'మనసులో లేని ప్రశాంతి బయట పుట్టుకు వస్తుందేమిటి శ్రీనివాస్. నీకున్న ఆత్మీయుల్లో కలిసిపో. కొంతైనా వుపశమనం కనిపిస్తుంది' ప్రభాకరం ప్రతినిమిషం అంటిపెట్టుకుని హెచ్చరిస్తూనే వున్నాడు.

'ఎన్నాళ్ళకి వచ్చావురా?' అన్నపూర్ణ వొళ్ళంతా కళ్ళు చేసుకుని శ్రీనివాస్‌ని ఆదరంగా పిలిచింది.

అవధానిగారు నిదానంగా చూసి అన్నారు. 'ఏమిటో శ్రీనివాస్‌ని గురించి అంతా విన్నాను. బాధపడటం తప్ప నాలాంటివాళ్ళు యేం చెయ్యగలరు ? కొందరికి అదృష్టం పుట్టుకతోటే వస్తుంది. మనలాంటి వాళ్ళకి అది యెలా వుంటుందో కూడా తెలీదు'

వేలమీద గీతలు గీస్తూ వుండి పోయాడు శ్రీనివాస్...కొంచెం ఆగి 'అన్నం పెడితే తినాలని వచ్చాను పిన్నీ' అన్నాడు.

అవధానిగారు పంక్తిలోనే కూర్చున్నారు. 'ఇప్పుడు యేం చేద్దాం అనుకుంటున్నావు'

'చేసేందుకు యేముంది బాబాయ్. రాజమండ్రీ వచ్చాను. అన్నీ పోగొట్టుకున్నాను. ఏకాకినై పోయాను. ఎలా బ్రతకాలో, యేం చేయాలో తెలీడంలేదు అసలు యీ వూరిమీదే మహా చికాకుగా వుంది.'

'అయితే అప్పుల్ని వదులుకొని వెళ్ళిపోతావుట్రా' అన్నపూర్ణకి దుఃఖం ఆగింది కాదు.

'మరేంచేయను పిన్నీ' శ్రీనివాస్ కళ్ళలో నీళ్ళు నిలిచాయి. అతనికి యింత మహా ప్రపంచంలో వొంటరిగా వుండిపోవడం, ఆనరాగా ఆదుకుందుకు ఎవరూ లేకపోవడం గొంతులో అగ్నిపర్వతాలు దొర్లిపోతున్నట్లుగానే వుంది. అయినా అతనికి ఏదో ఆశ! 'పిన్ని కనిపిస్తుంది. జగదీశ్‌ని పిన్నిని ఒక్కటిచేసి నిలబెట్టాలి, ఆవిడ జీవితం' అని.

'నేను రేపే వెళ్ళిపోతున్నాను పిన్నీ'

'ఎక్కడికిరా?'

'వరంగల్'

'అక్కడెవరున్నారు?' యిద్దరూ ఒక్కసారే అడిగారు.

'నిన్ననే అపాయింట్‌మెంట్ ఆర్డర్ వచ్చింది. స్కూల్లో మేష్టారి నేను.'

'వుద్యోగం దొరికిందన్నమాట. చెప్పావు కాదు యింతసేపూ'

'మంచిరోజులు వస్తున్నట్లున్నాయి శ్రీనివాస్' అవధానిగారి మొహంలో వెలుగు రేఖలు వొక్కుమ్మడిగా మెర్క్యురీలైట్లలా వెలిగిపోతున్నాయి.

'పెంచుకున్నవాడు బిడ్డడు కాదంటారు. నిన్ను పెంచుకోలేదు కానీ నువ్వు వస్తూంటే యిక్కడే వుండిపోతావనుకున్నాను. కానీ యిలా' అన్నపూర్ణ గొంతులోంచి మాటలు మరి పైకిరాలేదు.

'శుభమా అని వాడు వెడుతూంటే మనం యిలా అడ్డుకోవడం బాగులేదు అన్నా. వెళ్ళరాని. ఎక్కడికి వెడతాడు. మనవాడోయ్ వాడు. ఎక్కడున్నా మనం వాడికి కాకపోము

ఆయనవాళ్ళం!'

ఇంత దృఢంగా యేంమాసి అనుకుంటున్నారు? శ్రీనివాస్ బిత్తరపోయాడు. అతను యేదో అనాలనుకుని మరి మాట్లాడలేదు.

శ్రీనివాస్ అడుగు వేస్తూంటే కనుమరుగు అయ్యేవరకూ చూస్తూండిపోయారు పిచ్చిదంపతులు. ఆయిన వాళ్ళకి దూరంగా, చుట్టాలనే రాబందులకి అతీతంగా వచ్చేసిన అవధానిగారికి శ్రీనివాస్ వెళ్ళిపోవడం గొడ్డలిపెట్టు అయింది. అతను వొంగి కాళ్ళకి నమస్కారం చేస్తూంటే అన్నపూర్ణ అన్నీ మరచిపోయి గట్టిగా గుండెలకి అదుముకుని ఆ జుట్టులోకి వ్రేళ్ళు పోనిచ్చి చూస్తూండిపోయింది అయోమయంగా. అతను కొంచెందూరంగా జరుగుతే వూహ చెదిరిపోయి తననుంచి కర్మ దూరం చేస్తున్నందుకు తపించిపోయింది. ఆ ఘడియ తనకు రాకూడదన్నట్లుగా గుండెల్ని అదిమి పట్టుకుంది. అయినా తప్పలేదు కాలచక్రానికి ఒకచుట్టు గిర్రున తిరిగి ఆ వూహ చెరిపేసేవంతు.

ప్రభాకరం నవ్వుతూ వీడ్కోలు యిచ్చాడు. 'వీళ్ళవల్ల పరిచయం అయ్యావు. నువ్వు మనిషివి అవుతే అంతేచాలు. యేదో నిన్ను వోదారుస్తున్నానేగాని నాకు తెలుసు నీస్థితి ఏమిటో. నిన్ను మభ్యపెట్టాలనే భ్రమలో నాలో నేనే సంఘర్షణలో పడిపోయేవాడిని. నిన్ను సమర్థించలేను నేను. ఆ సంగతి గ్రహించాను. ఎప్పుడైనా ఈ నేస్తం గుర్తుకు వస్తే తప్పకుండా రా'

శ్రీనివాస్ తదేకంగా చూశాడు చాలాసేపు. యెంతోసేపటికి నెమ్మదిగా తల వాల్చేసి అడిగాడు. 'చూడు ప్రభాకరం. నాకే యింత కష్టంగా వుంది. నీకు బాధగా అనిపించలేదా ఆ యింట్లో.'

పేలవంగా నవ్వాడు ప్రభాకరం. 'అలవాటు అయిపోయింది. మగపిల్లాడిని కనుక అప్పుడు వుద్రేకంలో పారిపోయాను. రాజేశ్వరిలాంటిది యిటువంటి వాటికి తట్టుకోలేక పోవచ్చును బహుశా'

'భగవంతుడు అటువంటి పరిస్థితుల్లో గుండెల్లో రాళ్ళు పడేస్తాడు'

'అడగకూడదు కాని మీ అమ్మ యేదీ అనరా'

'కొన్ని కొన్ని బంధాలు ప్రేమలను మనా...గా తెంచేస్తాయి. అప్పుడు కొడుకూ కూతురూ యిలాటివి గుర్తుకు రావు.'

'రాజేశ్వరికి కూడా...'

'అవును. అమ్మ కఠినంగానే చూస్తుంది. అలా చూడకపోతే అతను వూరుకోడు. అది భరిస్తుంది. ఈ సంవత్సరం [illegible] దాని త్రోవన అది పడుతుంది.'

'ఎప్పుడైనా రాజమండ్రీ వస్తే తప్పకుండా రా. నీకోసం నువ్వు నాకు వదిలేసిన యీ రూమ్‌లోనే ఎదురు చూస్తూంటాను'



శ్రీనివాస్ తలెత్తాడు 'అలాగే' అంటూ. రైలు బయలుదేరబోతూంటే ఆప్యాయంగా ఆ చేతిని సున్నితంగా నొక్కి వదిలేశాడు ప్రభాకరం.

పెద్ద గోల చేస్తూ ఆగిన రైలు కెవ్వుమంటూ వెళ్ళిపోయింది కొన్నాళ్ళుగా పెనవేసుకున్న స్నేహలతని పుటుక్కున తెంపేస్తూ. ప్రభాకరం పీడ్లు ఇచ్చి స్టేషను దాటుతూంటే శ్రీనివాస్‌కి అనిపించింది. 'అసలెందుకీ అతను అంత డీలా పడిపోయాడు?' అని.

* * *

కిటికీ తలుపులు తెరిచి చూస్తే బజారంతా కనిపిస్తుంది. వచ్చిపోయే కార్లతో, రిక్షాల మువ్వల చప్పుడుతో, సైకిల్ బెల్ల మోతతో, అప్పుడప్పుడు ప్రయాణంచేసే బళ్ళతో కోలాహలంగా, ప్రొద్దున్న కూర్చున్న సుభద్రకి ప్రొద్దెక్కినా తెలీదు వాస్తవం. గంటల తరబడి ఆ కిటికీలోంచి బజారులోకి చూస్తూంటే యెంతో హాయిగా వుంటుంది. ప్రొద్దున్నే టిఫిన్‌కారియర్ రాడం యిద్దరూ భోజనాలు ముగించుకోవడం అరున్నర ప్రాంతాల్లో జగదీశ్ తిరిగి యింటికి వచ్చేవరకూ 'చేద్దాం' అనుకున్నా పనే కనిపించదు.

వెనకే నిల్చున్న జగదీశ్ చేతులు మెడమీదుగా వచ్చి గుండెలమీద ఆగాయి. సుభద్ర తలతిప్పి చూసింది.

'నువ్వు యేమీ అనుకోకు' జగదీశ్ అన్నాడు.

సుభద్ర కనుబొమ్మలు ముడిపడిపోయాయి. 'నేను అనుకోవడం యేమిటి?' అర్థంకాని దానిలా అడిగింది.

'మరేంలేదు సుభద్రా. నువ్వు యిలా కిటికీదగ్గర కూర్చోవడం నిన్ను నలుగురూ చూడడం, మనం యిక్కడ వుంటున్నాం అని యేమాత్రం తెలిసినా నాన్న వూరుకోడు. మండి పడతాడు'

'యాభై యెకరాల భూమిని నీ కోసం వదులుకునేంత త్యాగబుద్ధి లేదు నాకు'

'రేపటినుంచి కూర్చోను. నాకు తోచక యిక్కడ కుర్చీలో కూర్చునేదాన్ని'

జగదీశ్ మళ్ళీ అన్నాడు. 'నీకు మాధవరావు తెలుసుకదు సుభద్రా ?'

'యే మాధవరావు ?'

'అదే ఆ రోడ్డు మీద అప్పుడప్పుడు సాయంకాల పూట నిలుచుంటాడూ...'

'నాకు తెలీదు యెవరో ఆయన.'

'వాహ్' వెటకారంగా అన్నాడు అతను ! నువ్వు గుర్తు పట్టగలవు. రోజూ చూసే మనిషేకదా'

'ఒట్టు నాక తెలీదు అతను యెవరో ?

'సరే వాదన యెందుకు మనకి...?' జగదీశ్ మాటల్ని త్రుంచేశాడు. నెమ్మదిగా

'పేరడైజ్‌లో మంచిపిక్చరు వచ్చింది వెళదామా ?' అన్నాడు.

సుభద్ర నవ్వింది: 'మీరు తీసుకు వెళ్లాలేగానీ యెక్కడికి రాను నేను ?

'పోనీ యిప్పుడు వొద్దు. నువ్వు వట్టి మనిషివికూడా కావు'

అతను మాటలతో స్వర్గాన్నే చూపిస్తాడు. చేతలకీ మాటలకీ సహస్రం తేడా వున్న యీ జగదీశ్‌తో...

సుభద్ర యింక ఆపైన ఆలోచించలేదు.

గదిలో పచారుచేస్తూ 'చూడు సుభద్రా నాన్న రేపు ఈ వూరు వస్తారట. మన ఆచూకీ ఆయన తప్పకుండా తెలుసుకుంటాడు. నేను యిబ్బందిలో పడిపోవాలి', అన్నాడు

'అందుకని'

'నిన్ను మాధవరావు దగ్గర వుంచుతాను ఈ రెండు రోజులూ. తరువాత మళ్ళీ వచ్చేద్దువుగాని.'

సుభద్ర కంగారుగా అతన్ని రెండు చేతుల్తో చుట్టేసింది. 'మీరు ఆడించినట్లల్లా ఆడే కీలుబొమ్మను అయాను నేను. ఎంత పిచ్చిదాన్ని. మీరు నా మెళ్లో పుస్తె కట్టకపోయినా నమ్మి యింత దూరం వచ్చాను. నా దురదృష్టానికి తోడు ఇప్పుడు నేను మామూలు మనిషిని కూడా కాదు... అతను ఆ మాధవరావు యింట్లో...నాకు తెలీదని కూడా చెప్పాను కదా...' సుభద్ర గొంతు కఠినంగా మారిపోయింది...ముఖం మీద అసహ్యం పేరుకు పోయింది. సాధ్యం అయినంత గట్టిగానే అంది: 'ఒక్కనాటికీ వుండను. మీరు ఎలా వెడతారో నేను చూస్తాను'

జగదీశ్ నవ్వాడు: 'నీకూ కోపం వస్తుంది. ఫరవాలేదు. చూడు సుభద్రా కొన్నాళ్లు వోపిక పట్టు. మా నాన్న డబ్బు పంపకం అయిపోయాక మనం విడిగా కాపురం పెడదాం. హాయిగా పిల్లాపాపాతో సంసారం దొర్లించేయవచ్చును. నా మాట విను. నాన్న మనమీద యేమాత్రం అనుమానం వచ్చినా ఆయనకీ నాకూ సంబంధం లేకుండా చేస్తాడు. నన్ను నమ్మి'

సుభద్ర తలెత్తింది. కిటికీలోంచి సూర్యకిరణంలాంటిదేదో తళుక్కున కళ్లల్లోకి ప్రతిఫలించి క్షణంలో అక్కడ అనేక రంగులు హరివిల్లులా మారుతున్నాయి.'

'నమ్మాను. మిమ్మల్ని చాలా సార్లు నమ్మాను. యింకా వంచింపడం యేం బాగుంటుంది. మీ లాంటి వాళ్లు అర్ధరాత్రికి అర్ధరాత్రి పారిపోయి వెళ్లిపోతేనే మీకు స్వేచ్ఛ, నాలాంటి దానికి,' వాక్యం పూర్తి చేయలేకపోయింది కడుపులో వూపిరి సలుపుకోనివ్వకుండా కదిలించేసిల్లో, పిల్లడో యింత అలక్ష్యం చేస్తుంటే 'తను...తను'

'ఛ! యెప్పుడూ ఏడుపులూ, మొత్తుకోళ్లూ యీ దరిద్రపు యింట్లో యేరోజూ నవ్వూ, కళా కనిపించవు. అయినా వొకమాట సుభద్రా! నువ్వేమీ నేను కట్టుకున్న పెళ్లానివి కావు. నా యిష్టం వుంటే వుంటాను ... లేకపోతే అర్ధరాత్రి ఖర్మం పట్టవగలే వెళ్లిపోతాను. నన్ను ఆపేవాడు లేడిక్కడ. నీకు దిక్కుంటే చెప్పకో.' జగదీశ్ మాటలు శూలాల్లా పొడుచుకు పోలేదు. నిశ్చేష్టురాలై నిలబడిపోయి చూస్తుండిపోయింది. అతను గది గుమ్మం దాటి ఎదురుగా ప్రహరీమలుపు తిరిగి వెళుతూంటే కొద్దిగా తలభాగం ఆ తరువాత పూర్తి మనిషీ మాయం అయిపోతే బిక్కమొహం వేసుకుని శూన్యంలోకి చూస్తుండిపోయింది. కమ్చీతో యెవరో కొట్టారని భ్రమ పడింది. కానీ అది కమ్చీ దెబ్బ కానేకాదు. దూరాన మాధవరావు ఆకారం వికృతంగా ఆసాంతం కాలసర్పంలా కనిపిస్తూంటే అయోమయంగా కిటికీ తలుపుదగ్గర నిలబడింది. తలుపు మూయబోయే చేతుల్ని మరో అయిదు నిమిషాల తరువాత మరో రెండు చేతులు అప్రయత్నంగా బంధించేశాయి.

*   *   *

కాలం పురకలు వేస్తూ నలిగిపోయింది సూర్యభగవానుడి ముందూ వెనుకా ప్రదక్షిణంలో ఋతువులు మారాయి. నెలలు జరిగాయి. క్రమంగా రోజులుగడుస్తూంటే యేదో కొద్దిగా వుత్సాహం కనిపిస్తోంది. 'చెప్పండి యింకా యేం చేయను?' శ్రీనివాస్ కొంచెం ముందుకు వొంగి అడిగాడు. హెడ్మాస్టర్ అరుణాచలం గారిని.

'చాలు యింక యిప్పుడు నాలుగుంపావు దాటిపోయింది. నువ్వు యింటికి వెళ్లు. ఆఫ్ యియర్లీ పేపర్లు యెల్లుండి యిచ్చేయాలి.'

'అలాగేనండి'

'మరి రేపు మార్నింగ్ వస్తావుగా'

'వస్తాను సార్ గుడీవెనింగ్' శ్రీనివాస్ ఈల వేసుకుంటూ యింటిదారి పట్టాడు. రోడ్డు పూర్తిగా నడిచేసి రెండు సందులు దాటి లోగిలిలాంటి ప్రదేశంలో వోవాటా ముందు కూర్చున్న మనిషిని వెంటనే



# మొగలి పొదలు

పోల్చుకోలేక పోయాడు. అప్పటికే ఆ ప్రదేశం సాయంకాలపు నీరెండకి కొద్దిగా చీకట్లో కలిసిపోయింది. ఆ కూర్చున్న మనిషి స్త్రీ ఆకారంగా మాత్రం అతనికి గుర్తుంది కానీ ఆ ఆకారం బహుశా — శ్రీనివాస్ కళ్ళు తటతటలాడాయి.

'పిన్నీ - పిన్నీ వచ్చారా? మీరు రారేమో అనుకున్నాను. నమ్ముతారో లేదో కానీ మీకోసం వూరంతా గాలించేను. యెక్కడా మీజాడే లేదు. పోనీ నన్ను వెతుక్కుంటూ వచ్చారు

'నేను అదృష్టవంతుడిని నాన్నకి ఎలా చెప్పాలో అర్థంకాక చాలా బాధపడ్డాను అందుకే కాబోలు యివాళ రోజంతా యేదో హుషారుగావుంది నాకు. మీరు యిప్పుడు కులాసాయేనా పిన్నీ.'

'నేను శ్రీనివాస్ రాజేశ్వరిని'

'రాజేశ్వరా', శ్రీనివాస్ పెదాలు కదిలాయి ఆశ్చర్యంగా. 'మీరు నా యింటికి వచ్చారా'

'యేం రాకూడదా'

'ఛ! అలాగని నేను అన్నానా'

వీధిలోనే నించోబెట్టేసి దండకం చదివేస్తున్నారు. పిన్నీ.. మీవాళ్ళా గుర్తుంటారుగానీ రాజేశ్వరీ, ప్రభాకరం జ్ఞాపకం వుండరు మీకు. అన్నయ్య జ్ఞాపకాలు వాడితో అంతం అయిపోయాయి.'

'ఛ! యేం మాటలవి. యిప్పుడు మిమ్మల్ని నేను యేమీ అనలేదు చీకట్లో వున్నారు కనుక కొంచం గుర్తుపట్టడం కష్టం అయింది నా యింటికివచ్చే చుట్టాలైనా అతిథులైనా మీరే రాజేశ్వరీ పిన్ని చాలా రోజులక్రితం గడపదాటి పుట్టింటికి వెళ్ళింది. ఒకవేళ ఆవిడ వచ్చిందేమో అని ...అదీగాక పిన్ని, మీరూ, చెల్లి తప్ప నాకు గుర్తున్న ఆడవాళ్ళు చాలా తక్కువ అంటే నమ్ముతారా ?'

రాజేశ్వరి నవ్వి వూరుకుంది.

తలుపు గొళ్ళెం తీసి లోపలికి అడుగుపెట్టి రెండు చేతులూ ఆప్యాయంగా ముందుకుచాచి నవ్వుతూ 'స్వాగతం' అన్నాడు.

రాజేశ్వరివచ్చి వారగా వేసిన చాపమీద కూర్చుంది శ్రీనివాస్ స్టౌ వెలిగిస్తూంటే లేచివెళ్ళి తనే కల్పించుకోబోయింది 'కాఫీ కాచి యిచ్చినంత మాత్రాన డిగ్నిటీకి భంగం అయితే యింక జీవితంలో ప్రతి సెకెండుకీ డిగ్నిటీ అడ్డువస్తుంది అయినా మీరు గెస్టు నేను చేసిపెడతాను మీరు కూర్చుని తినాలి అంతే', శ్రీనివాస్ వారించాడు.

'పాపం! అందుకే వచ్చాననుకుంటున్నారు కాబోలు మీరు వెళ్ళమన్నా వెళ్ళిందుకు రాలేదు నేను. యిక్కడే వుంటాను అంటే యేమంటారు ?'

శ్రీనివాస్ తలెత్తి అన్నాడు: 'మీరే వుంటానంటే నేనుఅదృష్టవంతుడినే నాకుయెవరూ లేరు మీరువుండడం నాకుయిష్టమే', ప్రభాకరంమాటిమాటికీ గుర్తుకు వస్తున్నాడు. అతనిమీద అభిమానం వుప్పెనలా పొంగుకువస్తోంది ఎదురుగా రాజేశ్వరి వూపిరి సలుపుకోకుండా మాట్లాడేస్తూంటే జీవితం యింత తియ్యగా వుంటుందా అనుకున్నాడు ఆక్షణంలోనే.

'కాఫీ పొంగిపోయినా మీరు యీలోకంలో లేరు. నాకు తెలుసును మీ సైకాలజీ. ఈగాడిద బరువును యెన్నాళ్ళుమోయాలిరా అనుకుంటున్నారు ఏం చేస్తాం చేసుకున్న ఖర్మ అనుభవించక తప్పదంటారు. మన వాళ్ళు అంతే యిదికూడా...

'మిష్టర్ శ్రీనివాస్! రాజేశ్వరినీ నీ నెత్తిన వుంచాను ఆపిల్లను వో వాడ్డున చేర్చిగాని నువ్వు నిద్రపోకు. లేకపోతే నేనే పోనివ్వను నిన్ను రాజేశ్వరి యిప్పుడు ఎందుకు వచ్చిందో కనుక్కోవేం? 'అంటున్నాడండీ భగవంతుడు' ఏకటాకీన అంటూంటే శ్రీనివాస్ వింటూనే వున్నాడు. రాజేశ్వరే కల్పించుకుని కాఫీ పూర్తి చేసి యిస్తూంటే అతనికళ్ళలో మిడిమిడి జ్ఞాపకాలు దొర్లుతున్నాయి. ఆరోజుల్లో తను సుఖపడిన అపూర్వక్షణాల్లో, అమ్మా, పిన్నీ, చెల్లీ యిలాగే కూర్చోబెట్టుకుని చేసేవారు. పిన్నిమాత్రం? తనకిష్టం అని రకరకాల పిండివంటలు- వున్నంతలోనే చేసి పెట్టేది. తనని తనివితీరా ఆప్యాయంగా 'శ్రీనివాస్' అనేది. ఆ పిలుపును తను పూర్తిగా పొందలేక పోయాడు ఆవిడ నగలవల్ల తన బి. యస్. సి. పరీక్ష పూర్తయింది. ఆరాత్రి... ఆరాత్రి శ్రీనివాస్ మెదడు స్వాధీనం తప్పి రకరకాల ఆలోచనలతో నిండిపోయింది. ప్రభాకరం అన్నట్లు తను తన

తండ్రికి అవకాశం యివ్వకపోతే జగదీశ్‌కి దూరంగా పిన్ని నిశ్చలంగా వుండేదేమో?

'యేమో?' ప్రశ్నలూ, జవాబులూ మనసులోనే జరుగుతున్నాయి. 'నేను యిక్కడికి వచ్చాను. కారణం అడగలేదు మీరు' రాజేశ్వరి అంది. నవ్వాడు శ్రీనివాస్ 'మీరు వచ్చారు. కనిపిస్తూనే వుంది. యేమీ అనక ముందే నామీద లక్షనిష్ఠూరాలు వేస్తున్నారు. నేను వాటికే హడలెత్తిపోతున్నాను'

'జడుపు విభూది పెట్టించమంటారా'

'యింకా రాత్రికాలేదు కదా! అంత భయం లేదులెండి. ప్రభాకరం యెలా వున్నాడు.'

చప్పున యేదో గుర్తుకు వచ్చిన దానిలా అంది: 'మీరునాకు గవర్నమెంటు వుద్యోగం చూసి పెడతారా?'

శ్రీనివాస్ కళ్లప్పగించి చూశాడు. కాస్సేపాగి 'నాకంత యిన్‌ఫ్లుయెన్సు లేదు. నేనేం చేయగలను? ప్రయత్నం చేద్దాం. మీకంత తొందరేం, నాకు వుద్యోగం వుంది. యింకా వూడలేదు' అన్నాడు.

'అందుకు కాదు'

'మరెందుకని'

'నేను రాజమండ్రినుంచి యెకాయెకి యిక్కడికే వచ్చేశాను. నాకు మళ్లీ యింటికి వెళ్లేందుకు అర్హతలు లేవు. అవి విన్నటితో అఖరయ్యాయి. ఈ ప్రపంచంలో మిత్రులూ ఆప్తులూ సన్నిహితులూ నాకు మీరు' రాజేశ్వరి వెక్కివెక్కి యేడుస్తోంది

'యిప్పుడేం జరిగింది. అసలు సంగతి యేదో దాస్తున్నారు. యేడవకండి. ప్రభాకరం నాప్రాణం. అతనుకూడా మిమ్మల్ని ఆదుకోలేదంటే ఆశ్చర్యంగా వుంది.'

రాజేశ్వరి మౌనంగా వుండిపోయింది చాలాసేపు. గంటలు గడుస్తూంటే అంది: 'నాకు ఆకలి దహించుకుపోతోంది. వంటకు కావలసిన సామాను యెక్కడున్నాయో? యిల్లు కొత్త. తెలీదు నాకు. మీరు అందిస్తే...'

శ్రీనివాస్ నొచ్చుకున్నాడు. ఏవో పనికి రాని కబుర్లతో కాలం వృధా పుచ్చాడు యింతసేపూ. రాజేశ్వరికి మరి సమాధానం యివ్వలేదు. వంటసామాగ్రి అందివ్వడంలో నిమగ్నుడయ్యాడు. రెండు గదులు. వంట యిల్లు మరీ యిరుకుగా వొకమనిషి మెసిలేందుకే సరిపోనంత చిన్నదిగా వుంది రెండో గదిలోనే డ్రాయింగ్‌రూమ్, డైనింగ్ రూమ్. యిలా ఆగదినే అనేక రూపాంతరాల్లోకి మళ్లిస్తూ అతను గడిపేస్తున్నాడు. వీధిలో గాని, యింట్లోగాని యెలక్ట్రిక్ దీపాలకే నోచుకోలేదు. అతను మనసులో సందేహ పడుతున్నాడు. ఎలా ఈ చిన్న యింట్లో గడపడం అని?

'ఇల్లు పెద్దదే యిద్దరికన్నా యెక్కువ మనుషులే వుండవచ్చును మనాయాసంగా' రాజేశ్వరి ఫక్కున నవ్వింది.

శ్రీనివాస్ మొహం ముడుచుకుపోయింది. 'మీరిలా చిటికీమాటికీ వేళాకోళం ఆడుతూంటే యీ ప్రపంచంలోనే మనకి యిల్లు దొరకకూడదని ప్రార్థిస్తాను'

'ధన్యురాలను?'

'దేనికి?'

'యిల్లు కొంచెం పెద్దగా వుంటే మరో బాచ్‌లర్ వచ్చేసి 'బాబ్బాబు' అనో 'అమ్మామ్మా' అనో యింటికోసం కావతిం, హైరాన పెట్టడం అవుతూంటుంది. అందుకని ఈయిల్లే స్వర్గధామంలా నేను కుంటే మనం హాయిగా దేవతల్లా...'

'నోట్లో వేలేసుకుని విహరిద్దాం అంటారు ఆ పప్పులేం వుడకవు రేపే యిల్లు చూస్తాను.'

రాజేశ్వరి నవ్వులతో యిల్లు ప్రతిధ్వనిస్తోంది. శ్రీనివాస్ గుండెలమీద చేతులు వేసుకుని పరుపుకి వెనక్కివాలి రాజమండ్రి విశేషాలు అడుగుతున్నాడు. అతను యెన్నో రోజుల తరువాత తృప్తిగా భోజనం చేశాడు.

**(ఇంకా ఉంది)**



# మీరు పుట్టిన ఇంగ్లీషు తేదీని అనుసరించి మీ స్వభావం? మీ మిత్రులు?

## సింహం

ఇది రాసులలో అయిదవది. ప్రతి సంవత్సరం జూలై 23వ తేదీనుంచి ఆగస్టు 22వ తేదీవరకు సాయన సూర్యుడు సింహరాశియందు ఉంటాడు కాబట్టి యీ తేదీల మధ్యను జన్మించినవారు సింహరాశియందు పుట్టినవారుగా పరిగణింపబడుచున్నారు. ఏ సంవత్సరంలోనైనా సరే యీతేదీల మధ్యను పుట్టినవారికి సింహరాశి ఫలితాలే వర్తిస్తాయి. దీనికి జనన కాలంతోగానీ జన్మనక్షత్రంతోగాని నిమిత్తం లేదు.

ఈరాశి ప్రారంభంలో అనగా జూలై 23—26 తేదీల మధ్యను పుట్టిన వారిమీద అంతకు ముందు ఉన్న కర్కాటక రాశి ప్రభావం కూడా ఉంటుంది. అలానే రాశి ఆఖరున అనగా ఆగస్టు 19—22 తేదీల మధ్యను పుట్టిన వారిమీద రాబోయే కన్యారాశి ప్రభావం కూడా ఉంటుంది.

సింహం అనగా సింహమే. ఇది స్థిరరాశి అగ్నికి సంబంధించిన రాసులలో యిది రెండవది గ్రహరాజైన సూర్యుడు యీ రాశికి అధిపతి

ఈరాశి యందు జన్మించినవారు సాధారణంగా నాయక లక్షణాలను కలిగి ఉంటారు. వీరు యెప్పుడు హుందాతనంతోను, ఉదారంగాను ప్రవర్తించడం వలన సంఘంలో పలుకుబడి అధికంగా ఉంటుంది

వీరికి ఆత్మవిశ్వాసం అధికంగా ఉంటుంది ప్రతి విషయాన్ని తాము స్వంతంగా ఆలోచించి నిర్ణయించాలని కోరుతుంటారు. వీరు ఒక నిర్ణయానికి వచ్చిన తరువాత, దానిని మార్చడానికి అంగీకరించరు. వీరు యెంత స్వతంత్రంగా ఆలోచించినప్పటికీ పూర్వాచారాలను వ్యతిరేకించడానికి అంగీకరించరు. వీరు యే సంఘంలో ఉన్నప్పటికీ, అందులో వీరికి ఒక ప్రత్యేకమైన స్థానం ఉంటుంది.

వీరికి ఆటలమీద ఆసక్తి యెక్కువగా ఉంటుంది. ఒక్కొక్కప్పుడు వీరు తమ జీవిత సమస్యలను కూడా ఒక ఆటగా భావించడం వలన తాము పొందవలసినంత లాభాన్ని పొందలేని పరిస్థితి యేర్పడుతుంది. వీరికి మిత్రులమీద చాలా అభిమానం ఉంటుంది. మిత్రులకోసం వీరు యెటువంటి త్యాగాన్నైనా చేయగలరు.

వీరు చిన్న విషయాలను గురించి పట్టించుకొనరు. ఎంత చిన్న పనినైనా సరే వారు పెద్ద యెత్తులో చేయడానికి ప్రయత్నిస్తారు. వీరు యెప్పుడూ ఉత్సాహంగా ఉంటారు ఇతరులు అసాధ్యమనుకొని వదలి వేసిన పనులను పూర్తి చేయడానికి వీరు ప్రయత్నిస్తుంటారు. ఇటువంటి విషయాల్లో వీరు తమ కాలాన్ని వ్యర్థం చేసి కొనే ప్రమాదం కూడా ఉంది.



ఇతరులు చేసిన పొరపాట్లను వీరు సులువుగా మరచి పోగలరుగాని యెదుటివారు దురుద్దేశంతో ప్రవర్తిస్తే వీరు పగబట్టే అవకాశం ఉంది. వీరికి ఆశ్రిత పక్షపాతం యెక్కువగా ఉంటుంది. వీరు స్తోత్ర పాఠాలకు సులువుగా లొంగిపోతూ వుంటారు. సమయానుకూలంగా నడచుకొనే స్వభావం వీరికి లేకపోవడం వలన ఒక్కొక్కప్పుడు వీరు చేజిక్కిన అవకాశాలను కూడా కోల్పోతారు.

### ద్రేక్కాణ ఫలం

సింహరాసిలో మొదటి ద్రేక్కాణానికి (జూలై 23 మొదలు ఆగస్టు 1) శని అధిపతి ఈసమయంలో పుట్టిన వారికి ఉద్రేకం అధికంగా ఉంటుంది. ఒక్కొక్క సారి వీరు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తారు. ఇతరులమీద ఆధారపడడానికి వీరు అంగీకరించరు. ఒక్కొక్కసారి వీరి అంచనాలు తప్పు కావడం వలన యిబ్బందులకు గురి కాగలరు. బాల్యంలో వీరు చాలా కష్టాలను పొందవలసి ఉంటుంది. కుటుంబంలో తరచుగా యేవో చికాకులు వస్తుంటాయి. వీరు ఆత్మనిగ్రహంతో వ్యవహరించడం వలన జీవితంలో విజయాన్ని సాధించగలరు. క్రమంతో కూడిన విజయాన్ని సాధిస్తారు.

రెండవ ద్రేక్కాణానికి (ఆగస్టు 2 మొదలు 12) గురుడు అధిపతి. ఈసమయంలో పుట్టినవారు సాధారణంగా అదృష్టవంతులు కాగలరు. వీరు యితరుల యెడల సానుభూతితో ప్రవర్తించడం వలన అందరి అభిమానానికి పాత్రులు కాగలరు. తరుచుగా వీరి ఆలోచనలకు తగిన అవకాశాలు లభించడం వలన జీవితంలో సులభంగా విజయాన్ని సాధించ గలరు. వీరికి సాధారణంగా అన్ని విషయాల్లోను అభిరుచి ఉంటుంది బంధువుల మూలంగా ధనం లభించకపోయినా అవసరానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది.

మూడవ ద్రేక్కాణానికి (ఆగస్టు 13 మొదలు 22) కుజుడు అధిపతి. ఈసమయంలో పుట్టినవారికి దృఢమైన మనస్సు ఉంటుంది. వీరు నిర్మొగమాటంగాను, నిర్భయంగాను వ్యవహరిస్తారు. వీరు ఒక్కొక్కప్పుడు కటువుగా ఉన్నా, ఉదార స్వభావులు కావడం వలన ప్రజల అభిమానాన్ని పొందగలరు. వీరు సాహసముతో కూడిన స్వభావం కలవారు కావడం వలన కష్టమైన పనులను కూడా ప్రారంభించి విజయాన్ని సాధిస్తారు. దూర ప్రయాణాలు చేస్తారు. ఎంతటివారిని యెదురించడానికైనా వీరు వెనుదీయరు. వీరికి అధికార

హెంచే అధికంగా ఉంటుంది. స్త్రైర్యం, స్త్రైర్యం వీనిలో రాణించ గలరు.

సూచన:—మొదట చెప్పబడిన రాశి ఫలితానికి విరుద్ధంగా చెప్పబడిన, ద్రేక్కాణ ఫలితానికి తేడా ఉన్నప్పుడు ద్రేక్కాణ ఫలితాన్నే గమనించాలి. ద్రేక్కాణ ఫలితమే సరిగ్గా సరిపోతున్నట్లు చాలా మంది అభిప్రాయం.

## సింహరాశియందు జన్మించిన భర్తతో వ్యవహరించడం యెలాగ?

ఎక్కడ ఉన్నా సరే, వీరు తాము నాయకులమని భావిస్తుంటారు. కాబటి వీరియెడల యెప్పుడూ గౌరవ భావంతో ప్రవర్తించడం అవసరం. ఎంతటి చిన్న విషయాన్నైనా సరే వీరితో చెప్పడం మంచిది. అప్పుడు తాము గౌరవింప బడుతున్నామనే భావం, వీరికి కలుగుతుంది. ప్రతి విషయమూ క్రమబద్ధంగా జరగాలని కోరుతుంటారు కాబటి వీరి స్వంత వవ్యవహారాల్లో యితరులు జోక్యం చేసికోకూడదు. వీరిని అప్పుడప్పుడు తగు మాత్రంగా పొగడుతుండడం మంచిది

## సింహరాశియందు జన్మించిన భార్యతో వ్యవహరించడం యెలాగ?

ఎటువంటి సమాజంలో నైనాసరే యీమె ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తుంది. కాబటి యితరులతో యీమె సన్నిహితంగా ప్రవర్తించవచ్చును. అంతమాత్రంచేత యీమెకు యెటువంటి దోషాన్ని ఆపాదించకూడదు. ఈమె తన భర్తను విమర్శిస్తుంది .కాని యితరులు తనభర్తను విమర్శించడాన్ని సహించలేదు. ఈమె భర్తచేత ప్రేమించబడడం కంటే గౌరవింప బడడాన్నే కోరుతుంది. ఈమె ఆత్మ విశ్వాసానికి భంగం కలిగించేటట్లుగా ప్రవర్తించ కూడదు. బహుమతులను యివ్వడం ద్వారా యీమెను సంతృప్తిపరచ వచ్చున. బహుమతిగా యివ్వబడిన వస్తువుకంటే, బహుమతిని యివ్వడంలో చూపించిన గౌరవమే యీమెకు సంతృప్తిని కలిగిస్తుంది.

## సింహరాశియందు జన్మించిన వారికి మిత్రులు యెవరు?

సింహరాశియందు జన్మించిన మిత్రులను వీరును ఒకే స్వభావాన్ని కలిగి ఉంటారు కాబటి వీరి స్నేహం చాలా కాలం ఉంటుంది. వీరి మధ్యను భేదాభిప్రాయాలు ఉండక పోవచ్చును. కానీ ఒకరు చెప్పిన దానిని యింకొకరు వెంటనే అంగీకరించడం వలన వీరిమైత్రి ఉత్సాహకరంగా ఉండదు.

సింహరాశియందు జన్మించిన వారికి, కన్యారాశి (అగస్టు 23— సెప్టెంబరు 22)యందు జన్మించిన వారికి మైత్రి ఉంటుంది. సింహరాశివారు యెప్పుడూ ఉదాత్తంగా వ్యవహరిస్తారు. కన్యా రాశివారు యెప్పుడూ యితరులను విమర్శిస్తుంటారు. అందుచేత వీరి మైత్రిలో అభిప్రాయ భేదాలే అధికంగా ఉంటాయి. కన్యారాశివారు సులువుగా



## రంగులరాట్నం*లింక్స్

ఆశియా, ఆఫ్రికాలలోని 'పిల్లి' జాతులతో పోలిస్తే, అమెరికా ఖండాల్లోవి తీసికట్టే. ప్యూమా, జాగువార్‌లు కూడా వాటికి సాటి రావు. అలాగే మరికొన్ని ఇతర 'పిల్లులు' కూడా ఉన్నాయి.

ఆసిలాట్ అనేది ఒకటి. వన్యజీవు లన్నిటిలోకి ఎంతో అందమయింది. జాగువార్ ఉండే ప్రాంతాల్లోనే ఉంటుంది. సుమారు నాలుగు అడుగులున్న ఇవి, చిన్న పశులు, పాములు, వన్యజీవుల్ని చంపి తింటాయి.

అడవి పిల్లి మరొకటి. బాగా ఎదిగిన మామూలు పిల్లిలా కనబడుతుంది. చెవులు, కళ్లు పెద్దవి. తోక కుచ్చుగా ఉంటుంది. నేలమీద సంచరించే పక్షుల్ని రాత్రి పూట వేటాడుతుంది.

లింక్స్, ఉత్తరమెరికా మంచు ప్రాంతాల్లో (కెనడా) కనబడుతుంది. వెంట్రుకలు ఎక్కువగా ఉండడంవల్ల, చెవులకి చిత్రమైన ఆకారం వస్తుంది. కాళ్లకు క్రిందుగా కూడా, దట్టంగా జుత్తు ఎదిగి, మంచు ప్రాంతాల్లో సంచరించడానికి వీలుగా ఉంటుంది. దీని చర్మం ఎంతో ఖరీదైంది. స్త్రీలు అలంకరణలో ఇది ఉపయోగిస్తారు. మూడు అడుగుల పొడవున్నది, ఉత్తర యూరప్‌లో కూడా కనబడుతుంది.

—జమ్మి కోనేటిరావు

# విహారంపుట్టిన ఇంగ్లీషు...

తమ అభిప్రాయాలను మార్చుకొంటుంటారు. అది సింహరాశివారికి సహించదు. కన్యారాశివారు కొంచెం నిదానంగా ప్రవర్తిస్తే వీరిమైత్రిబాగా ఉంటుంది కాని మొత్తం మీద వీరి మధ్యను సాన్నిహిత్యం అంతంతమాత్రం గానే ఉండవచ్చును.

సింహరాశియందు జన్మించిన వారికి తులరాశి (సెప్టెంబరు 23—అక్టోబరు 22)యందు జన్మిం జన్మించిన వారికి మైత్రి సాధారణంగా ఉంటుంది. సింహరాశివారి ఆత్మవిశ్వాసం అప్పుడప్పుడు అహంకారంగా మారుతుంటుంది. అప్పుడు తులారాశి వారితో భేదాభిప్రాయాలు రావచ్చును. కాని తులారాశి వారు తమ చాకచక్యంతో వాటిని సరిపుచ్చుకొనగలరు. తులారాశివారి సమయస్ఫూర్తితో సింహరాశివారు తమ శక్తిని జోడించినట్లయితే, యెటువంటి కార్యాన్నైనా సాధించ గలరు. సింహరాశివారి దుడుకు తనంవలన వీరిమైత్రికి భంగం కలుగ వచ్చును.

సింహరాశియందు జన్మించిన వారికి, వృశ్చికరాశి (అక్టోబరు 23—నవంబరు21)యందు జన్మించిన వారికి మైత్రి చిత్రంగా ఉంటుంది. వీరు ఒకరి కొకరు దూరంగా ఉన్నప్పుడు దగ్గరగా ఉండాలనీ, దగ్గరగా ఉన్నప్పుడు దూరంగా ఉండాలనీ కోరుతుంటారు. సింహరాశివారి ఆత్మవిశ్వాసాన్ని వృశ్చిక రాశివారు మెచ్చుకొంటారు. వృశ్చిక రాశివారి ఉదార స్వభావాన్ని సింహరాశివారు గౌరవిస్తారు. వీరి మైత్రి ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా, రాను రాను అధికం కాగలదు. వృశ్చికరాశివారివద్ద కార్యదక్షత అధికంగా ఉంటుంది. సింహరాశివారు వృశ్చిక రాశివారి సలహాలను పాటించడం మంచిది. వీరి మధ్యను మూడవ వ్యక్తి జోక్యాన్ని సహించ కూడదు.

సింహరాశియందు జన్మించిన వారికి, ధనూరాశి (నవంబరు 22—డిశంబరు 21) యందు జన్మించినవారికి మైత్రిబాగా ఉంటుంది. వీరి యిరువురి స్వభావాల్లో పోలికలు చాలా ఉంటాయి. వీరి స్నేహంలో ప్రయోజనం కంటె సరదా అధికంగా ఉంటుంది. వీరు యిరువురూ నాయకత్వాన్నే కోరడం వలన అప్పుడప్పుడు వీరి మధ్యను సంఘర్షణ కలగ వచ్చును. కాని దానివలన వీరిమైత్రికి భంగం ఉండదు. ధనూరాశి వారు అప్పుడప్పుడు బాధ్యతా రహితంగా ప్రవర్తించడం సింహరాశి వారికి సహించదు. వీరిమధ్యను యేదైనా తగాయిదా వస్తే అది చాలా దూరం వెడుతుంది.

సింహరాశియందు జన్మించిన వారికి, మకరరాశి (డిశంబరు 22—జనవరి 20) యందు జన్మించిన వారికి స్నేహం అరుదుగా ఉంటుంది. మకర రాశివారు తమ పనుల్ని నెరవేర్చు కొనడానికి సింహరాశి వారితో స్నేహంగా ఉన్నట్లుగా నటిస్తారు. సింహరాశివారు ఉదార స్వభావులు కాబట్టి దానిని గమనించినా, అంతగా పట్టించుకొనరు. మకర రాశివారు సాధారణంగా యెదుటివారిని విశ్వసించరు. అది సింహరాసివారి ఆత్మాభిమానాన్ని దెబ్బతీస్తుంది. బలవత్తరమైన కారణాలవలన వీరు మిత్రులు అయినా, ఆమైత్రి హృదయపూర్వకంగా ఉండక పోవచ్చును.

సింహరాశియందు జన్మించిన వారికి, కుంభ రాశి (జనవరి 21—ఫిబ్రవరి 19) యందు జన్మించిన వారికి మైత్రి బాగా ఉంటుంది. సింహరాశి వారు నాయకత్వాన్ని కోరుతూంటారు. అందరూ సమానులేనని కుంభరాశివారి అభిప్రాయం. అందు చేత వారి మధ్య అప్పుడప్పుడు భేదాభిప్రాయాలు వచ్చినా దానివల్ల వీరిమైత్రి పెరుగుతుందే కాని తరగదు. సింహరాశివారి చురుకుతనాన్ని, కుంభరాశివారి ఆలోచనను జోడించినట్లయితే యెటువంటి పనినైనా సాధించగలరు. వీరి మైత్రి వలన యిరువురకూ ప్రయోజనం ఉంటుంది.

సింహరాశియందు జన్మించిన వారికి, మీనరాశి (ఫిబ్రవరి 20—మార్చి 21) యందు జన్మించిన వారికి, మైత్రి చాలా అరుదుగా ఉంటుంది. వీరి స్వభావాల్లో చాలా భేదం ఉంటుంది కాని ఆ భేదమే ఒక్కొక్కప్పుడు వీరి మధ్యను ఆకర్షణను కలిగించవచ్చును. మీనరాశివారు పరిస్థితులకు అనుగుణంగా వ్యవహరించ గలరు కాబట్టి సింహరాశివారితో తమకు భేదాభిప్రాయాలు ఉన్నా, వాటిని పైకి కన్పించనీయరు. వీరు యెక్కువ సన్నిహితంగా ఉండడం కంటె, దూరంగా ఉండడం వల్లనే యిద్దరకూ ప్రయోజనం ఉంటుంది.

సింహరాశియందు జన్మించిన వారికి, మేషరాశి (మార్చి 22—ఏప్రిల్ 20) యందు జన్మించిన వారికి స్నేహం బాగా ఉంటుంది. వీరి యిరువురి స్వభావం ఒకేమాదిరిగా ఉన్నా, ప్రవర్తనలో భేదం ఉంటుంది. మేషరాశివారి స్వేచ్ఛాప్రవర్తన సింహరాశివారికి నచ్చదు. ఇద్దరూ నాయకత్వాన్నే కోరడం వలన అప్పుడప్పుడు వీరిద్దరి మధ్యను సంఘర్షణ కలుగుతుంది. అయినా, ఒకరిమీద ఒకరికి ఉండే అభిమానానికి భంగం ఉండదు. ఒకరినొకరు అర్ధంచేసికొని ప్రవర్తించినట్లయితే వీరి మైత్రి ఉభయ ప్రయోజనకరంగా ఉంటుంది.

సింహరాశియందు జన్మించిన వారికి, వృషభ రాశి (ఏప్రిల్ 21— మే 21) యందు జన్మించిన వారికి పరస్పరాకర్షణ బాగా ఉంటుంది. వీరి మైత్రిలో మానసికమైన సంతోషం కంటే ప్రయోజనం యెక్కువగా ఉంటుంది. సింహరాశివారు యెప్పుడూ నాయకత్వాన్ని కోరుతుం

టారు. వృషభరాశివారు ప్రతిదానికి ప్రతిఫలాన్ని కోరుతుంటారు. కాబట్టి వృషభ రాశి వారు సింహ రాశి వారిని అనుసరించడం వలన వీరిమైత్రి దృఢతరం కాగలదు.

సింహరాశియందు జన్మించిన వారికి, మిధునరాశి (మే 22—జూన్ 21) యందు జన్మించినవారికి సాధారణంగా స్నేహం ఉంటుంది. మిధున రాశివారి వద్ద ఆచరణశక్తి ఉంటుంది. అందుచేత వీరి మైత్రి ప్రయోజన కరంగా ఉంటుంది. కాని సింహరాశి వారి ఉదార స్వభావాన్ని మిధున రాశివారు దుర్విని యోగం చేసే ప్రమాదం ఉంది. వీరికి కలహం వస్తే అది చాలా దూరం వెళ్ళగలదు. మిధునరాశి వారు తగినంత జాగ్రత్తతో ప్రవర్తిస్తే సింహరాశి వారితో స్నేహం స్థిరంగా ఉంటుంది.

సింహరాశియందు జన్మించిన వారికి, కర్కాటక రాశి (జూన్ 22— జూలై 22) యందు జన్మించిన వారికి మైత్రి సాధారణంగా ఉంటుంది. నాయకత్వం వహించాలనే కోరిక సింహరాశి వారికి అధికంగా ఉంటుంది. అది కర్కాటకరాశివారికి నచ్చదు. అందుచేత వీరి మైత్రి హృదయ పూర్వ కంగా ఉండదు. సింహరాశివారు తమ ప్రవర్తనను కొంచెం మార్చుకొంటే, వీరి మైత్రి బాగా ఉంటుంది. మొత్తంమీద వీరి మైత్రివల్ల సింహ రాశి వారికే యెక్కువ ఉపయోగం ఉంటుంది.

## ఆరోగ్యం వగైరా

ఆరోగ్యం బాగా ఉంటుంది. మానసిక శక్తి కంటే శారీరకశక్తి అధికంగా ఉంటుంది. తరుచుగా ఉద్రేకానికి లొంగి పోతుంటారు. ఉష్ణసంబంధ మైన అనారోగ్యం చేయవచ్చును. గుండెకు సంబంధించిన అనారోగ్యం కూడా చెప్పొంది.

### వీరికి అదృష్టాన్ని కలిగించేవి.

రంగు—పసుపురంగు—నారింజరంగు.

ధరించవలసినవి—పుష్యరాగం (Topaz)
కెంపు (Ruby)

సంఖ్యలు—1, 10, 19, 28, 37, 46, 55, 64 వగైరా.

వారాలు—ఆదివారం.......

నెలలు— మార్చి 22 మొదలు ఏప్రిల్ 20
జూలై 23 మొదలు ఆగస్టు 22
నవంబరు 22 మొదలు డిశంబరు 21

సంవత్సరాలు (వయస్సు) 1, 10, 19, 28 37, 46, 55 వగైరా

(వచ్చేవారం—కన్య)

—మహేష్

# శతచిత్ర సుందరి

# నటి జమున



సహజ సౌందర్యశ్రీ

ఫోటోలు : ప్రభాకర్

**వ్యాసం : మోహన్‌కుమార్**

ఒకటారా నూరు చిత్రాల్లో నటించిం దంటే గొప్ప విషయమే ! ఆ నూరింటి లోనూ ముఖ్యభూమికలే ధరిస్తే మరింత గొప్ప సంగతి. జమున డాక్టర్ రాజారావు గారి 'పుట్టిల్లు' చిత్రం ద్వారా కథానాయకి గానే పరిచయం అయింది. ఇవాళ్టివరకూ ఆమె అలాంటి ముఖ్యభూమికల్లోనే నటి స్తున్నది. స్వయంప్రతిభా, నిర్విరామ పరి శ్రమా- సినిమా పరిశ్రమలో అలా ఆమె చక్కని నటిగా నిలబడేందుకు కారణభూతా లయినవని చెప్పుకోవలసి వుంటుంది.

## నచ్చిన పాత్రలు

ఇపుడు విడుదలయిన 'చల్లని నీడ' జమున నటించిన 105 వ చిత్రం. తను నటించిన చిత్రాలన్నిటిలోనూ ఆమెకి బాగా నచ్చిన పాత్రలు 20 దాకా ఉన్నవి. ఇల్లరికంలో రాధ, మూగమనసులులో గౌరి, లేతమనసుల్లో భామ, చదరంగంలో సీత, రాములో లక్ష్మి వాటిలో కొన్ని. ఇవి ప్రేక్షక హృదయాల్లో చిరస్థాయిగా ముద్ర వేసుకొన్న పాత్రలు. ఆమె మనసుకు నచ్చిన పాత్రల్లో 'పాలమనసులు'లో ఇందిర పాత్ర కూడా వుంది. ఆ పాత్ర పోషణకు జమున ఎంతో శ్రద్ధ తీసుకున్నది. ఆ సినిమాకి ఆధారమైన నవల తెప్పించి చదివి ఆ వేష పోషణకు విశేషమైన కృషి చేసింది. నిజా నికి ఆ ఇందిరపాత్రకు నూటికి మారు పాళ్లా న్యాయం చేకూర్చింది. చిత్రం జయాపజయాలు వేరే విషయం !

## చిత్రసీమలో ప్రత్యేకస్థానం

జమునకు చిత్రసీమలో ఒక ప్రత్యేక స్థానం వున్నది. ఆమెపట్ల ఒక ప్రత్యేక మైన గౌరవం, మర్యాద కనపర్చుతారు యిక్కడివాళ్లు. తమ యింటి ఆడపడుచుగా భావించుకుంటారు. అంత హోమ్లీగానూ ఎంతో నిరాడంబరంగానూ వుంటుంది ఆమె. మాట పడని వ్యక్తిత్వం ఆమెది. ఆత్మాభి మానాన్ని ఎల్ల వేళలా సంరక్షించుకునే తత్వం ఆమెలో వుంది. ఆమె వున్నచోట సందడితో కళకళలాడుతూ వుంటుంది.

## చెక్కుచెదరని అందం

వివాహానికి పూర్వం జమునను 'హంపీ కన్య' అని పిలిచేవారు. హంపీ ఆమె జన్మ స్థలం కావడంవల్ల ఆమెకా పేరు వచ్చి

వుండవచ్చును గాని, ఆమెను చూస్తున్నపుడు హంపీలో పుట్టినవాళ్ళంతా యింత అందంగానూ వుంటారేమో అని అనిపించడం సహజం. చెక్కుచెదరని అందం జమునది. ఈ దశాబ్దంన్నరలోనూ ఆమెలో నటనతోపాటు అందమూ దినదినాభివృద్ధి చెందుతూ వచ్చింది సహజ సౌందర్యం కలిగిన తారలు మనకు చాలా కొద్దిమంది మాత్రమే వున్నారు. వారిలో జమునకు ప్రథమస్థానం వస్తుంది.

**వివాహం—పరిపూర్ణత**

1965 ఆగస్టు 4 న శ్రీ రమణరావుగారిని తిరుమల శిఖరాన స్వామి సన్నిధిని వివాహం చేసుకుని శ్రీమతి అయింది జమున. అన్యోన్యానురాగం వారి మధ్య వున్నది. 'వివాహం అయితే స్త్రీత్వానికి పరిపూర్ణత వొస్తుందమ్మా. అపుడు మనం నటించే పాత్రలు కూడా నిండుదనాన్ని కలిగివుంటాయి అని స్వర్గీయ శ్రీమతి కన్నాంబ అంటూండేవారు నాతో. నా వివాహం అయ్యాక నటించిన చిత్రాలు చూసుకుంటే ఆమె మాటల్లోఎంతోసత్యం వుందనిపిస్తుంది' అన్నది జమున ఒకసారి.

**ఫిలిమ్‌ఫేర్ బహుమతి గ్రహీత**

మిలన్ (మూగమనసులు) హిందీ చిత్రంలో ఉత్తమ సహాయనటిగా ఎన్నికై, ఈ యేడాది ప్రముఖ సినిమా పక్షపత్రిక 'ఫిలిమ్ ఫేర్' నిర్వహించిన బహుమతుల ప్రదానోత్సవంలో పాల్గొని బహుమతి గ్రహీత అయింది. ఆ నాటి ఫంక్షన్‌లో చివరి అంశం అయిన 'సర్‌ప్రయిజ్ ఐటమ్'లో తనే ఆ చిత్రంలోని ఒక పాట పాడి సభికుల్ని ఆనందవాహినిలో ముంచెత్తింది. ఆమె నటించిన 'చదరంగం' చిత్రంకూడా ఈ యేడాది ఫిలిమ్ ఫేర్ అవార్డుల్లో ఉత్తమ తెలుగు చిత్రంగా ఎన్నికైనది.

**శృంగారం - అశ్లీలం**

'శృంగారం ఉన్న చిత్రాలలో నటించనని నేను చెప్పినట్లు ఎవరో రాశారు. నేను అలా అనలేదు. శృంగారం లేనిదే జీవితం లేదు. సినిమాలలో అది పరిమితంగా, సన్నివేశానికి అవసరమయినంత వరకూ వుంటేనే అందమూ, ఆకర్షణా...అశ్లీల పదజాలం, అసభ్య శృంగారం వున్న దృశ్యాలలో నేను నటించనని చెప్పాను. శృంగారానికీ, అశ్లీలానికీ ఎంతో దూరం లేదు. ఆ రెండూ ఒకదానికొకటి చాలా చేరువలోనే వున్నా, వాటి అర్థాలు ఎంతో దూరంలో వున్నాయి' అన్నదామె యీ వ్యాసకర్తతో.

**సాధుజంతువుల పట్ల సానుభూతి**

పశు పక్ష్యాదులపట్ల శ్రీమతి జమునకు ఎంతో సానుభూతి, ప్రేమా ఉన్నవి. తన కళ్ళ యెదుట ఏ సాధు జంతువు హింసించబడినా ఆమె ఎంతో బాధపడి పోతుంది. అంత సుతి మెత్తని హృదయం. బ్లూ క్రాస్‌లో జమున శాశ్వత సభ్యురాలు. తనతోపాటు అనేకమందిని సభ్యులుగా చేర్పించి, ఆ సంస్థకి ఇతోధికంగా సహాయపడ్డది.

స్వయంగా గృహాలంకరణ చేసుకోవటంలో ఎంతో ఉత్సాహం చూపిస్తుంది జమున. రచనా వ్యాసంగంలో కూడా ఆమెకు మంచి ప్రవేశం ఉన్నది. క్రిందటేడాది తన విదేశ ప్రయాణాన్ని గురించి ఆంధ్రసచిత్ర వారపత్రికలో ఆమె ధారావాహికంగా రాసిన సంగతి పాఠకులకు విదితమే! చక్కని శైలీ, శిల్పమూ ఉన్న రచయిత్రి.



మాటపడని వ్యక్తిత్వం



గృహాలంకరణలో ఉత్సాహం

వెంకటేశ్వర స్వామిపట్ల జమునకు విన లేని భక్తి ప్రపత్తు లున్నవి. ప్రతి వెలా మొదటితేదీన తిరుమలలో వుండి స్వామిని దర్శించి వస్తుంది.

కొత్త చిత్రాలు

బంగారు సంకెళ్ళు, మూగవోము, ఉండమ్మా బొట్టుపెడతా, మాఁవీ పొడ క్షన్స్, ముహూర్తబలం, పెళ్ళిరోజు, ప్రేమనగర్, వస్తాడే మా బావ— జమున ప్రస్తుతం నటిస్తున్న చిత్రాలు. అన్నట్టు చెప్పడం మరిచాను. ప్రతి సంవత్సరం దస రాకి బొమ్మల కొలువు పెడుతుంది జమున. అవాళ రకరకాల బొమ్మల్నీ అందంగా అలంకరించి బంధువుల్నీ, స్నేహితుల్నీ పిలిచి ఆ పండుగను కన్నుల పండువు చేస్తుంది.



రచనావ్యాసంగంలో ప్రవేశం

# సినిమా

మద్రాసు హాలివుడ్‌లో వెలసిన మరొక స్టుడియో మీకు తెలుసా? అదే కర్పగం స్టుడియో. దీన్ని కట్టిందెవరనుకున్నారు. ప్రముఖ తమిళ దర్శకుడు కె. ఎస్. గోపాల క్రిష్ణన్. కష్టపడి పైకి వచ్చిన వాడు కష్టాలను గుర్తించెడి వాడు. కేవలం తన బుద్ధి కౌశలంతో కథకుడుగా వున్న వాడు వేడు ప్రముఖ నిర్మాత అయ్యాడు... అంతేకాదు ఒక స్టుడియోకు అధినేత య్యాడు. ఈయన మనకేమీ కొత్త కాదు 'పిన్ని, సుమంగళి, తోడూ—నీడా' కథలు యీయనవే. ఇప్పుడు ఒక తెలుగు చిత్రా నికి దర్శకుడయ్యాడు. ఆ చిత్రాన్ని నిర్మిం చేది మరెవ్వరో కాదు. 'ముద్దు పాపను మీ కనుపాపల కప్పగించారే...వాళ్ళే. ఈ సంస్థకు శ్రీరాజ్ ఆర్ట్సు ఫిలింస్ అని పేరు.

## సమఉజ్జీలో సాహిత్యం సంగీతం

జూలై రెండవ శ్రీరాజ్ ఆర్ట్సు ఫిలింస్‌కు సంబంధించిన పాట నొకదాన్ని స్వరకర్త టి. వి. రాజు ఘంటసాల, సుశీలచే పాడిం చారు. ఈ పాటను నారాయణరెడ్డి వ్రాసారు. చిత్రంలో కృష్ణ, మరొక కొత్త అమ్మాయి పాడ్తారు. ఆ పాట యొక్క పల్లవిని వింటారా...కాదు...కాదు చదువుతారా!

'రంగు రంగుల పూలు

నింగిలో మేఘాలు' — అని సుశీల పాడుతుంటే స్వర్గం అంటారే అక్కడ విహ రించినట్లనిపించింది. వెంటనే ఘంటసాల కంఠం — 'చల్లని బంగారు కిరణాలు

మా చెల్లాయికి ఆభరణాలు' అని వరుస కల్పినప్పుడు మనం మన చెల్లెళ్ళ పట్ల యెలా ప్రేమాభిమానాలు కురిపిం చాలో అర్థమవౌతుంది. టి. వి. రాజు యీ పాట ప్రేక్షకుల హృదయాల్లో జోలపాట కావాలనే తలంపేమో; నలభై మంది ఆర్కెస్ట్రాను వుపయోగించి, తియ్యని రాగాలను మేళవించి నారాయణరెడ్డి వ్రాసిన సాహిత్యానికి సమవుజ్జీగా సంగీతాన్ని ప్రసవింప చేసారు.

* * *

పై చిత్రం యొక్క మొదటి షూటింగు షెడ్యూలు ఆగస్టు 1 నుండి కర్పగం స్టుడియోలో ప్రారంభమౌతుంది. ఈ షెడ్యూలులో రామారావు, సావిత్రి, కృష్ణ, విజయనిర్మల పాల్గొంటారు. ఆగస్టు మూడవ వారంలో యూనిట్ ఏర్కాడుకు వెళ్తారు. అక్కడ రెండు పాటలను కె. ఎస్. జి. చిత్రీకరిస్తారు. ఒకటి విజయనిర్మల పరితప్త హృదయంతో ప్రియుణ్ని వేడుకుంటూ పాడుతుంది. మరొకదాన్ని కృష్ణ, విజయ నిర్మల యౌవనోద్రేకంలో పిచ్చి పిచ్చి వూహలను కంటూ పాడ్తారు. ప్రతినెలా 10 రోజుల షెడ్యూలు వేసుకున్నామని, నవంబరుకు చిత్రం విడుదలౌతుందని నిర్మాత వ్యక్తపర్చారు.

* * *

విజయలలిత గడుసుపిల్ల. వుషారుగా చెట్టెక్కి పండ్లను కోసి యిసుక తిన్నెపై వేస్తుండే సమయంలో రాజసం వుట్టిపడే రామకృష్ణ అక్కడికి వస్తాడు. వచ్చి యిసుకతిన్నెపై వ్రాలుతాడు. అతడికి పక్కగా ఒకపండు టపీమని పడ్తుంది. ఏమిటబ్బా అని పైకి చూస్తాడు. అంతే ఆఅమ్మాయిని అలాగే చూస్తుండిపోయాడు. అందమయిన అమ్మాయిని చూడగానే అబ్బాయికి వుషారు పురిగొల్పింది. వేళాకోళంగా మాటలు ప్రారంభమయ్యాయి.

రామకృష్ణ: నీ ... వా పిల్లా! ఇలాగే యింకో రెండుపళ్ళు పడేస్తావా?

విజయలలిత: పిల్లా అంటున్నావే. చమత్కారమా ఊ కోరుకో. చల్లని పళ్ళు కావాలా? ఉడుకుడుకువి కావాలా?

రామ: ఉడుకుపళ్ళా?

లలిత: చక్కగా వూదుకుంటూ తినొచ్చు

రామ: అయితే వుడుకుడుకు పళ్ళేవేయ్ అనగానే విజయలలిత రెండుపళ్ళు యిసుకలో పడేస్తుంది.

రామ: పిల్లో. వేడిగాలేవే!

లలిత: మరి వేడిగా లేకపోతే అలా ఊత్తావెందుకు పిల్లోడా.

రామ: ఇదా నీ చమత్కారం. వుండు చెబుతాను.' అని చెట్టెక్కుతున్నట్టు నటిస్తాడు. విజయలలిత గుర్రం పైకిదూకి పారిపోతుంది. రామకృష్ణ ఈలవేస్తాడు. ముందుకువెళ్ళిన గుర్రం వెనక్కు తిరిగి దబుక్కుమని నిలుస్తుంది. ఆ వూపుకు విజయలలిత రామకృష్ణ ఒడిలోకి వాలిపోతుంది. ఆపిల్లవైపు కొంటెగా చూస్తాడు.

రామకృష్ణ బాగుందా, ఉడుకుపళ్ళ చమత్కారం.

విజయలలిత: చమత్కారమట. చమత్కారం.

రామకృష్ణ: పిల్లో! మన చమత్కారం మళ్ళీ ఎప్పుడు అంటూ గుర్రం పైకి యెగిరిగంతేసి రివ్వున వెళ్ళిపోతాడు. ఈ చమత్కారమయిన సన్నివేశాన్ని దర్శకుడు జి. విశ్వనాథం హుషారయిన కోణంలో వేణుచే చిత్రీకరించారు. ఈ దృశ్యంలో విజయలలిత, రామకృష్ణ సహజంగా నటించి కథ పాత్రలకు ఔచిత్యాన్ని తెచ్చిపెట్టారు. నవభారత్‌ఫిలింస్ నిర్మిస్తున్న 'అగ్గిమీద గుగ్గిలం' చిత్రంలో పై దృశ్యాన్ని మీరే చూస్తారుగా. సెప్టెంబరువరకు ఓపిక పట్టాలి మీరు. అందుకే యిప్పుడు అక్కడక్కడ మీకు తెలియచేస్తున్నా. పూర్ణచంద్రరావు నిర్మించే యీ జానపద చిత్రానికి కథను వ్రాసిందెవరో తెలుసా? గౌరి ప్రొడక్షన్స్ అధినేతయిన ఎస్. భావనారాయణ. సంభాషణలను వ్రాసిందెవరనుకున్నారు. పింగళి గారే. ఈ చిత్రంలోని మరొక విశేష మేమిటంటే, ఇద్దరు కథానాయకులయిన కాంతారావు రామకృష్ణలకు బాలసుబ్రహ్మణ్యం పాడడమే. ఇద్దరి గొంతుకల్లోగల వైవిధ్యాన్ని చక్కగా ప్రస్ఫుటింపచేసిన యీ యువగాయకునికి పరిశ్రమలో వుజ్జ్వల భవిష్యత్తు తన ముఖద్వారాన్ని తెరచి వుంచింది. ప్రేక్షకులకు ప్రతి ఫ్రేం చక్కటి కోణాల్లో తీసారనిపించేలా వేణు తన కెమరాను కదిపారు. దర్శకునికి సహాయ పడడంలో కృష్ణ కిశోర్ చూపిన ప్రజ్ఞను చూచినప్పుడు త్వరలో యితడొందుకు డైరెక్టరు కాకూడదనిపించింది. సెప్టెంబరునుండి మీ చెవుల్లో యీ చిత్రంయొక్క పాటలే గింగురమంటూ యనిపిస్తుంది యిందులోని పాటల్ని విన్నప్పుడు.

## క్లబ్ డాన్స్‌లో స్వర్గం

వీనస్ స్టుడియోలో ఎస్. వి. ఎస్. ఫిలింస్ వేసిన క్లబ్ సెట్టులో నర్తించిన ఆ నాట్యకత్తె ఆంగ్లో-యిండియన్ అమ్మాయట. పేరు రీటా అట, మొదటి



'అగ్గిమీదగుగ్గిలం'లో విజయలలిత, రామకృష్ణ.

## సినిమా

సారిగా 'కలసివచ్చిన అదృష్టం'లో క్లబ్ డ్యాన్సు చేసి, తనకూ అదృష్టం కలిసి రావాలని కలలు కంటూంది. ఆ అమ్మాయి నడుం తీగెలాగావుంది. యువ హృదయాల్లో యీమె నాట్యం చక్కిలిగింతలు పెట్టి తీరుతుంది. అసలు యీమె డ్యాన్సు యీ చిత్రంలో యెందుకు ప్రవేశ పెట్టాల్సి వచ్చిందో మీకు తెలపాలిగా. రామారావు, సత్యనారాయణ అన్నదమ్ములు. సత్యనారాయణ చేసిందంతా చెడు సహవాసం. ఇల్లు అన్న, అమ్మ అందర్నీ విస్మరించి క్లబ్బులు, షికార్లు, పేకాటల్లో మునిగితేలే సత్యనారాయణను కాపాడాలని హీరో రామారావు సిక్కు వేషంలో క్లబ్బులోవున్న సత్యనారాయణను వెతుక్కుంటూ వస్తారు. వచ్చిన సమయంలో ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ ఒక పెగ్ పుచ్చుకుని రీటా నాట్యంలో స్వర్గాన్ని వూహించుకుంటారు. డ్యాన్సు కాగానే రీటాను పట్టుకోబోతాడు సత్యం. క్లబ్బులో ఫైటు స్టార్టు అవుతుంది. సత్యనారాయణను, ప్రభాకరరెడ్డిని చితగ్గొడ్తారు. అప్పుడు రామారావు అడ్డుపడి తన తమ్ముణ్ణి రక్షించి అభయహస్తం చూపిస్తాడు. ఇక అప్పట్నుండి సత్యనారాయణలో కొద్ది కొద్దిగా మంచితనాన్ని యేర్పరచడానికి రామారావు ప్రయత్నించి, ఆఖరుకు అతనిలో మానవత్వాన్ని, ఆత్మీయభావాన్ని పొందగల్గేటట్లు చేసి కథను సుఖాంతం చేస్తారు. ఈ సన్నివేశాన్ని దర్శకులు కె. విశ్వనాథ్ తన సహజ పద్ధతిలో



'నదమంత్రపుసిరి'లో ఉదయచంద్రిక.

## మీకు తెలుసా?

నటుడు ప్రభాకరరెడ్డి తాటి చెట్టంత ఎత్తునుండి నీళ్లలో దూకి ఈదగలరు.

విలన్ జగ్గారావు యింట్లో ఆరేళ్ల పాపనుండి ఆయన భార్య వరకు రైఫిల్ షూటింగులో సిద్ధహస్తులు.

విజయభట్ అధినేతల్లో ఒకరయిన ఏకామ్రేశ్వరరావుకు సిగిరెట్లు త్రాగడం, తమలపాకు నమలడం, ముక్కుపొడుం వెయ్యడం, కాఫీ త్రాగడంలాంటి అలవాట్లు లేవు.

ప్రముఖ దర్శక, నిర్మాత బి. ఎన్. రెడ్డి ఆదివారం షూటింగు చెయ్యరు.

తీరిక దొరికిన రోజుల్లో వర్ధమాన కథానాయిక వాణిశ్రీకి వంట చెయ్యడం సరదా.

నటి కుమారి విజయలలితకు చేపలకూరంటే ప్రాణం.

నటి రాజశ్రీకి రోజా పుష్పమన్నా, పైనాపిల్ జ్యూస్ అన్నా చాలా యిష్టం.




శ్రీ మాతా పిక్చర్స్ (ప్రై) లిమిటెడ్

# చిన్నారి పాపలు

స్క్రీన్‌ప్లే-డైరెక్షన్: సావిత్రి  కథ-నిర్వహణ: వి. సరోజిని

మాటలు: రమణ, సరోజిని • సంగీతం: పి. లీల (సూపర్‌విజన్) కోదండపాణి,
ఫొటోగ్రఫీ: శేఖర్. సింగ్ • ఎడిటింగ్: మూర్తి, M.S.N. • ఆర్టు: మోహన,
నృత్యం: రాజసులోచన

(VIJAYA)

ఆంధ్రా - సీడెడ్: విజయా కంబైన్స్ | తెలంగాణా: విజయా డిస్ట్రిబ్యూటర్స్ | మైసూరు: విజయానంద్

# సినిమా డైరీ

● వాహినీ పిక్చర్సులో ఒక ముఖ్యపాత్రను గీతాంజలి ధరిస్తూంది. ఈమెకు సంబంధించిన షాట్లను దర్శకులు బి. ఎన్. రెడ్డి వాహిని స్టూడియోలో జులై 9న తీశారు. నాయకీ, నాయకులుగా వాణిశ్రీ, శోభన్‌లు నటిస్తున్నారు. ఈ చిత్రానికి ఎ. కె. శేఖర్ ఆర్టు డైరెక్టరు; ఎస్. రాజేశ్వరరావు సంగీత దర్శకులు.

● కౌముదీ ఫిలింస్ యిటీవల హాస్పిటల్ డైల్యూసేషన్‌లో వాణిశ్రీ, భారతీలపై కొన్ని షాట్లను తీసారు. కమలాకర కామేశ్వరరావు దర్శకత్వంలో జగ్గయ్య, శోభన్‌బాబు, రాంమోహన్ ముఖ్యపాత్రలను ధరిస్తున్నారు. ఎం. ఎస్. రెడ్డి నిర్మించే యీ చిత్రానికి వేణు సంగీత దర్శకుడు.

● గోపాలక్రిష్ణా మూవీస్‌యొక్క రెండవ షెడ్యూలులో కామెడీషాట్స్ తీయబడ్డాయి. కె. హేమాంబరధరరావు దర్శకత్వం నిర్వహించే యీచిత్రం యొక్క షూటింగు ప్రసాద్ స్టూడియోలో జరుగుతూంది. జయలలిత, రామారావు, నాగభూషణం, పద్మనాభం, ప్రభాకరరెడ్డి, ధూళిపాళ ముఖ్యపాత్రలను పోషిస్తున్నారు. గోపాలక్రిష్ణ నిర్మిస్తున్న యీ చిత్రానికి టి. వి. రాజు సంగీత సారధి.

● నవశక్తి సంస్థ నిర్మించే చిత్రానికి సి. ఎస్. రావ్ దర్శకులు. ప్రధానపాత్రలను రామారావు, భారతి, ప్రభాకరరెడ్డి పోషిస్తారు.

● డి. బి. ఎస్. చిత్రానికి భమిడిపాటి రచన చేస్తున్నారు. వి. రామచంద్రరావు దర్శకత్వంలో శోభన్, వాణిశ్రీలు నటిస్తారు.

● రాజు పిక్చర్స్ "రాజయోగం" యొక్క రీ రికార్డింగ్ జులై 15న ప్రారంభమౌతుంది. జులై 27న విడుదలయ్యే యీ జానపద చిత్రాన్ని సుబ్బరామదాస్ డైరెక్టు చేసారు. ముఖ్యపాత్రలను కాంతారావు, రాజశ్రీ, మీనాకుమారి, గీతాంజలి, రాజనాల, ప్రభాకరరెడ్డి, సత్యనారాయణ, రాజబాబు, బాలకృష్ణ ధరించారు. ఈ చిత్రాన్ని మేకప్ వీరాజు నిర్మించారు.

● కల్చరల్ ఆర్ట్సు నిర్మించిన "జీవితాలు" షూటింగు పూర్తయి విడుదలకు సిద్ధంగా వుంది. ఇందులో రత్నశ్రీ, యమున, ఆనంద్, కాదర్ ముఖ్యపాత్రధారులు.

● ప్రసాద్ ఆర్ట్సు "సత్తెకాలపు సత్తెయ్య" షూటింగు వేంకటేశ్వర సినిటోన్ స్టూడియోలో జులై 7, 8 తేదీల్లో జరిగింది. ఈ షెడ్యూలులో విజయలలిత, చలం, గుమ్మడి, ఎస్. వరలక్ష్మి పాల్గొన్నారు. కె. బాలచందర్ డైరెక్టు చేసే యీ చిత్రాన్ని ప్రసాద్ నిర్మిస్తున్నారు.

● రిజ్వీ బ్రదర్స్ నిర్మించనున్న "దిల్" చిత్రంలో ముంతాజ్, సంజయ్ నాయకీ, నాయకులుగా నటిస్తారు.

● జగదేవి పిక్చర్స్ "క్రైమేల్ పలన్" చిత్రంలో ఎ. వి. ఎం. రాజన్ కమ్యూనిస్టు నాయకుడిగా నటిస్తున్నాడు.

● కె. ఎస్. గోపాలక్రిష్ణన్ దర్శకత్వంలో శ్రీరాజా ఆర్టు ఫిలింస్ నిర్మించే సాంఘిక చిత్రంలో రామారావు, కృష్ణ అన్నదమ్ములుగ నటిస్తున్నారు.

● పసికర్లు వ్యాధికి గురయిన ప్రముఖ హిందీ నటి మీనాకుమారి లండన్‌లో చికిత్స పొందుతున్నట్లు, మరొక వారంలో స్వస్థత చేకూరి బొంబాయికి తిరిగి రానున్నట్లు తెలుస్తూంది.

● ప్రముఖ నటి జయలలిత, ఎం. జి. ఆర్. నిర్మించే కొత్త చిత్రంలో స్వయంగా పాడబోతూంది.

● రావల్ ఫిలింస్ నిర్మించిన "అబ్రబా" ఈసు మన్‌కలర్ చిత్రం యొక్క షూటింగు పూర్తయింది. ముఖ్యపాత్రలను విమి, అశోక్‌కుమార్, శశికళ ధరించారు.

● ఆకాశవాణి వార్తాకేంద్రంవారు శ్రీనగర్‌లో టెలివిజన్ కేంద్రాన్ని యేర్పరచడానికి ప్రయత్నిస్తున్నారు.

● ప్రసాద్ ఆర్టు పిక్చర్స్ హిందీలో నిర్మించనున్న చిత్రంలో జయలలిత కథానాయకిగా నటిస్తుంది.

● "కీలుగుర్రం" చిత్రంలో మంత్రవాదిగా నటించిన కోటేశ్వరరావు అస్వస్థతగా వుండి యిటీవల మద్రాసు రాయపేట ఆస్పత్రిలో మరణించారు.

● యస్. కళ్యాణరావు అండ్ కంపెనీ తరఫున నిర్మించిన 'గోదావరి పుష్కర మహిమ' డాక్యుమెంటరీ చిత్రం ఆంధ్రలో విడుదలైంది. దర్శకుడు సురటి దుర్గారావు గోదావరి పుష్కరాలను కన్నులపండువుగా చిత్రీకరించారు. నాగయ్య గారి వ్యాఖ్యానం, పెండ్యాల సంగీతం బాగున్నది.

రామకృష్ణారావు ఛాయాగ్రహణంతో చిత్రించారు. ఈ చిత్రాన్ని జ్యోతి ఫిలింస్ ఆగస్టు 10న ఆంధ్రలో విడుదల చేస్తారు.

### పాత్రకి నిండుదనాన్నిచ్చిన పవిత్రత

జయలలితకు రోజుకి మూడు చిత్రాల షూటింగులు. ఒక ప్రక్క తమిళం, మరొక ప్రక్క తెలుగు చిత్రాల ఒత్తిడితోనే సతమతమయ్యే జయలలిత కోసం హిందీ చిత్ర నిర్మాతలు పడిగాపులు కాస్తున్నారు. ఇంత లేత వయస్సులో కొన్నికోట్ల



'శ్రీరామకథ'లో జయలలిత.

మంది హృదయాలను దోచుకున్న యేకైక కథానాయిక యీమె అనడంలో అతిశయోక్తి లేదు. ఇప్పుడు యీమె ధరిస్తున్న పాత్రలు కూడ విభిన్నమయినవే. ఈ కీర్తి యీమెది కాదు. ఈమెను కన్నతల్లిది. నిజంగా సంధ్య చేసిన అదృష్టం జయలలితను కుమార్తెగా బడయడం. నేను యీమెను గూర్చి వ్రాయాల్సివచ్చినందుకు కారణం లేకపోలేదు. ఇటీవలనే 'శ్రీరామకథ' రష్ చూసాను. ఈ పౌరాణిక చిత్రంలో విష్ణు భక్తి పరాయణురాలిగా జయలలిత కనబర్చిన పవిత్రత ఆ శ్రీమతి

పాత్రకు యెంత విందుదనాన్నిచ్చిందో తెలుసా? ఈ చిత్రంలో ఈమె వేషభాష లయితేనేమి, నటనా చాతుర్యమయితే నేమి మీచే సెభాషనిపిస్తాయి. ఈ ప్రశంస దర్శకులు పద్మనాభంకు చేరుతుంది. ఎందు కంటారా? జయలలిత జీన్స్‌లోనే నటించ గలుగుతుంది అని భ్రమించేవారికి 'లేదు పతివ్రతా శిరోమణిగా కూడ జీవిస్తుంది' అని నిరూపించినందుకు.

**మంచిరోజులు—మంచిపాత్రలు**

రాంమోహన్‌కు మంచిరోజు లొస్తున్నాయి. ఈమధ్య నిర్విరామంగా షూటింగుల్లో పాల్గొంటున్నానన్నాడు. మనిషి యొక్క ఆకృతిలో కూడ 'లేతమనసులు' రూపం కన్పించింది. 'మొన్ననే సేలం వెళ్ళొచ్చానండీ' అన్నాడు. ఎవరిది షూటింగు అనే సందేహం మీకెందుకు. 'మొనగాళ్ళకు మొనగాడు' చిత్రాన్ని నిర్మించారే మాడరన్ థియేటర్స్... వాళ్ళదే. ఈ చిత్రంలో విశేషమేమి టంటే కాంతారావు, రాజశ్రీ అన్నా, చెల్లెళ్ళుగా నటించడమే. రామదాసుకు యేకైక పుత్రుడు రాంమోహన్. కాంతారావు కమంగు చెల్లెలు రాజశ్రీ. రాజశ్రీ, రాంమోహన్‌లు అన్యోన్యంగా ప్రేమించు కుంటారు. కానీ, రామదాసు వీళ్ల పెళ్లికి ఒప్పుకోడు. కాంతారావు యువ హృదయాలను రెప్పగొట్టక వివాహానికి అంగీకరించమని రామదాసును కోరుతాడు. ఇదీ మొన్న జరిగిన షూటింగు అని ముగించాడు రాము. కొత్త చిత్రాలేమైనా వచ్చాయా అని ప్రశ్నించా. 'నిన్ననే తిరుమలా వాళ్ళు వచ్చి అడిగారండీ. ఇదిగాక కౌముదీ, రేఖా అండ్ మురళీ, కళాచిత్ర: డి. బి. ఎన్. చిత్రాల్లో మంచి పాత్రలే వేస్తున్నా'నన్నాడు. కౌముదీ కారు రావడంతో వీనస్ స్టుడియోకి దారితీశాడు.

వీనస్‌లో కారు దిగడంతో విజయ తుర్లా



'సుడిగుండాలు'లో అంతర్నాటకం.

పరిచయం:



దర్శకుడు

# శేషగిరిరావు

పక్షిరాజా స్టుడియోలో దర్శకత్వశాఖలో సుశిక్షితుడయిన జి. వి. ఆర్. శేషగిరిరావు స్వతంత్రంగా డైరెక్టు చేసిన చిత్రం "పాపకోసం". తొలి చిత్రంలోనే తన మేధాసంపత్తిని, కసబర్చి పెద్దల ఆశీర్వాదాన్ని ప్రేక్షకుల అభిమానాన్ని, పాత్రికేయుల ప్రశంసల్ని అందుకున్నాడు. మొదటి ప్రయత్నమే ఘన విజయం కావడానికి యీ యువకుని కార్యదీక్ష, దర్శకత్వపు విలువలే. స్క్రీన్‌ప్లే నుండి రీ-రికార్డింగ్ వరకు దగ్గరుండి, షాటును యెలాతీస్తే రక్తి కడుతుందో నని వూహించుకొని, లాంగ్‌షాటులో యేది తీయాలి, మిడ్‌షాటులో యెవరు బాగా ఎక్స్‌ప్రెషన్ యివ్వగలరు. క్లోజప్ యిస్తే యే ఆర్టిస్టుకు ఫర్ఫెక్టు ఎఫెక్టు వస్తుంది. అనెడి ముఖ్యాంశాలను పసిగట్టగల్గిన శేషగిరిరావుకు ఎడిటింగులో కూడ కాస్త ప్రవేశం వుండడంచేతనే చిత్రంలో యెక్కడా అవకతవకలు రాకుండా ప్రతి ఫ్రేంను చక్కగా చిత్రించగలాగాడు. ఇంగ్లీషు సినిమాలు యెక్కువగా చూడడంవల్ల, వాళ్ల పంథాలో పోవడానికి ప్రయత్నిస్తున్నాడనే సత్యం "పాపకోసం" మాంటేజ్ షాట్సు చూస్తే తేటతెల్లమవుతుంది.

మనస్సును తన వృత్తిపై కేంద్రీకరింప చేస్తూ, పెద్ద దర్శకుల సలహాలను తీసుకుంటూ ముందుముందు మంచి చిత్రాలను డైరెక్టు చెయ్యగలడని ఆశించవచ్చు. రెండవ అవకాశాన్ని కూడ రామానాయుడే కల్పించారు. ఇదిగాక పద్మనాభం చిత్రానికీ, తిరుమలా పిక్చర్సుకు శేషగిరిరావు దర్శకుడిగా నియమించ బడ్డాడు.

## సినికహా

పిక్చర్సు అప్పారావు మా సెట్సుకు రండి అని పిల్చాడు లోపలి కెళ్లాను. రాజనాల ఒక అమ్మాయితో సరసాలాడడాన్ని చూచి యితనికిదే పనా అనుకున్నా ఆయన విలన్. ఈ దృశ్యం 'విజయ రాముడు' చిత్రంలోనిది. అది విలాస మందిరం. రాజనాల ధనశ్రీని చేరదీసి మాటలతో మురిపిస్తుంటాడు. అంత మంచి సమయంలో సేనాధిపతి యేదో వర్తమానం తెస్తాడు. దానికి రాజనాల విసుక్కుంటాడు. ఈ సన్నివేశాన్ని ఆమంచర్ల శేషగిరిరావు రసజ్ఞులను మెప్పించే విధంగా చిత్రీకరించారు. సేనాధిపతిగా జగ్గారావు, విదూషకుడిగా మోదుకూరి సత్యం నటించారు. సూర్యనారాయణ అనెడి నూతన కవి వ్రాసిన యీ కథను అప్పారావు నిర్మిస్తున్నారు. ప్రస్తుతం రాజనాల మందిరంలో గత పదిరోజుల నుండి షూటింగు జరుగుతూ వుంది.

### ప్రేక్షకునికి ఉత్కంఠ కలిగించే నేర్పు

ప్రముఖ దర్శకుడు జి. రామినీడు 'బంగారు సంకెళ్లు'ను ప్రేక్షకులకు నచ్చే రీతిగా తీసి, మీచే రామినీడువి 'బంగారు చేతులు' అనిపించుకోబోతున్నారు. చిత్రానికి సంభాషణలు ముచ్చుతునకలు. 'భక్తపోతన'కు డైలాగులు వ్రాసిన దాసం గోపాలక్రిష్ణ ఈ చిత్రంలోని సంభాషణలను రాస్తారు. కొన్ని సన్నివేశాలను రామినీడు చిత్రీకరించిన పద్ధతి చక్కగా



'తారాశశాంకం'లో శోభన్ బాబు, దేవిక.

ఉంది. గంభీర సన్నివేశాల్లో ప్రేక్షకుని హాల్లో అట్టే కూర్చోపెట్టే విధంగా సహజంగా చిత్రించారు. ముఖ్యపాత్రను జమున నటిస్తున్నది. తదితర భూమికల్లో గుమ్మడి, హరనాథ్, ప్రభాకరరెడ్డి, రాజబాబు రావికొండలరావు, కాకరాల, రమాప్రభ, టి. జి. కమల యథోచితంగా నటించారు. శ్రీయుతులు వి. సత్యనారాయణ, విక్రంసింహ నిర్మించిన ఈ ప్రబోధాత్మక చిత్రాన్ని ఆంధ్రాలో పూర్ణా పిక్చర్స్ విడుదల చేస్తారు.

—శ్రీనివాస్



'నిన్నే పెళ్లాడుతా'లో రామారావు, భారతి.

# పుస్తకాలు

## ఇంద్రాణి-(కథల సంపుటి)

రచన: శ్రీ దాసరి సుబ్రహ్మణ్యం. క్రౌన్1/8 సైజు 116 పేజీలు. వెల: రు. 2—50. ప్రచురణ: శ్యామలా పబ్లికేషన్స్, తెనాలి.

ఎనిమిది చక్కటి కథల ఈ సంపుటి, ఒకప్పుడు అసంఖ్యాకంగా డిటెక్టివ్ సాహిత్యాన్ని సృష్టించిన శ్రీ సుబ్రహ్మణ్యంగారి కలంనుండి వెలువడింది. కడాపటి కథ 'ఇంద్రాణి' తగినంత సస్పెన్సుతో తలమానికంగా ఉంది. నిండు జవ్వని ఇంద్రాణి నిజస్వరూపం చివరికిగాని అంతుపట్టదు. కాగా ఈ సంపుటికి 'ఇంద్రాణి' పేరు సమంజసమే.

కర్తవ్యాన్ని తప్పించుకుందుకి దేవుడి మీాదే భారంవేసి కూచునే అస్తికవాదులకు మంచి చురక 'తుమ్మల్లో అస్తమయం.' జ్యోతిషం పిచ్చి ఎలాంటి పెడదారులు తొక్కిస్తుందో నిరూపించేది 'సినిమా ఛాన్సు.'

'తెరవబడని తలుపు', 'కల—నిజం', 'ఉద్యోగ ధర్మం.', 'ధనిక వితంతువు' కథల్లో సంస్కరణాభిలాష ఇమిడి వున్నది. ముముక్షువుల్లాగా ముక్కు మూసుకుని ఆధ్యాత్మిక చింతనలో పడదామనుకుంటే ఈనాడు పర్యవసానమేమిటో చెబుతుంది 'అవ్యక్తం.'

చిన్నవిషయాన్ని కథగా మలిచి నప్పించ గల నేర్పు సుబ్రహ్మణ్యంగారిది. పైగా, ఆయన వ్యంగ్య ధోరణి కొత్త పోకడలతో నడుస్తుంది. 'రాడు నాయనా రాడు (రాముడు) (త్రేతాయుగంలో వచ్చి దర్శనమిచ్చినంత తేలిగ్గా యీపాడు కలియుగంలో.. (పేజి 26.)

'తను ఎవరి భార్య కన్నోపోగొట్టాడు. తన భార్య కన్ను దేవుడు పోగొట్టాడు. దేవుడు దయామయుడు. వడ్డీతో కూడా ప్రతీకారం చేసి తీరుతాడు!' (పేజి 69).

కథల్లోని భావాలతో అందరూ ఏకీభవించక పోవచ్చు. కాని ఎడ నెడ పొదిగిన ఆ ఉపమానాలు, శైలిలో ఉద్వేగం కడకంటా మనచేత చదివిస్తాయి.

కథల ప్రసక్తి ఏమీా లేకపోయినా, కుటుంబ రావుగారి 'ప్రస్తావన' నేటి ప్రచురణోద్యమాన్ని కూలంకషంగా చర్చిస్తూ, ఈనాటి రచయితలకూ ప్రచురణకర్తలకూ కనువిప్పుగా వుంది. చివరని 'ప్రజలు పుస్తకాలను కొని చదివే అలవాటు చేసుకోవడం ఎంతైనా అవసరం' అన్నారు. పుస్తకం ఒకింటికి రోజుకి బేడ చొప్పున అద్దె డబ్బులు వసూలు చేసుకునే ప్రచార సంస్థలు గల మన తెనుగునాట ఈ ప్రబోధం క్రియారూపం దాలిస్తే, ఇక కావాల్సిందేమిటి?

## మరోప్రపంచం (అనుసరణ నవల)

తెనుగు రచన: శ్రీ కొడవటిగంటి కుటుంబరావు, క్రౌన్ ఆక్టెవో 90 పేజీలు. వెల: రు. 2—00. ప్రచురణ: శ్యామలా పబ్లికేషన్స్, తెనాలి, (ఆం.ప్ర.)

పరధ్యానంతో ఉండేవాళ్లని 'ఏ లోకంలో, ఉన్నావ్?' అని అడుగుతాం. మరో ప్రపంచంలో విహరించడం మానవ సహజం, అదొక అవసరం. అందులో ప్రయోజన ముంది, ఆనందముంది— అని మహామహులు చాటి చెబుతున్నారు. ఈనాడు కూడా అసాధ్యమైన ఉద్యమాన్ని ఎవడన్నా లేవదీస్తే 'యుటోపియన్ స్కీమ్' అని చెప్పి నిరుత్సాహ పరచడం కద్దు. కాని సర్ థామస్ మూర్ సృష్టించిన యుటోపియా అనే భావనా ప్రపంచం పగటి కలలు కనేవాళ్ల భూలోక స్వర్గమని పేరు పొందింది.

ఇష్టమైన ఒక సినిమా చూసీ, ఒక నవల చదివీ కాస్సేపు ఈ లోకాన్ని మరిచిపోవచ్చు. దీనికి మరొక సాధనం మరో ప్రపంచాన్ని ఊహించుకోవడం.

---

**ఆటలు**

# డేవిస్ కప్‌లో వృత్తి క్రీడాకారులకి ప్రవేశం కల్పించాలి



వృత్తి క్రీడాకారులు, అవుత్సాహికులైన ఆటగాళ్లు పాల్గొనడం విషయమై అటు ఆటగాళ్ల చేత, ఇటు ప్రజలచేత ఎలాగో అవునని పించుకున్న ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన వింబుల్డన్ పోటీలు ముగిశాయి. ఇంగ్లండ్ యింతకి ముందే ఎన్నో 'హోపెన్' టోర్నమెంట్‌లని ఏర్పాటు చేసింది. ఫ్రాన్స్ దానిని ఆదేవిభాగంలో జాతీయం చేసింది. ప్రపంచ ఛాంపియన్ అయిన ఆస్ట్రేలియా అంతర్జాతీయంగా అత్యున్నతస్థాయి గల డేవిస్‌కప్‌ని గత ఎన్నో సంవత్సరాలుగా గెలుచుకుంటున్నది. ఆస్ట్రేలియాకి కూడా 'హోపెన్' టోర్నమెంట్స్‌లో సభ్యత్వం ఉంది.

అయినా ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే జూలై మొదటివారంలో లండన్‌లో జరిగిన డేవిస్‌కప్ పోటీలకి సంబంధించిన సమావేశంలో ఈ అంతర్జాతీయ పోటీలో వృత్తిక్రీడాకారులకి ప్రవేశం కల్పించడం అన్న విషయం పై ఎలాంటి ఉద్దేశాన్ని బయట పెట లేదు ఎలాగైతేనేం రిజిస్టర్డ్ ఆటగాళ్లు (కొన్ని టోర్నమెంట్స్‌లో ప్రతిఫలాన్ని తీసుకునేవారు) తమ దేశం తరఫున ఆడవచ్చున్నదానికి అంగీకరించడం జరిగింది.

రిజిస్టర్డ్ ఆటగాళ్లని అనుమతించవలసిందిగా ఆస్ట్రేలియా తెచ్చిన ప్రసక్తి 2/3 మెజారిటీతో అంగీకరించడం జరిగింది. రాజ్యాంగ పరంగా ఏమైనా మార్పు చేయడానికి కనీసం ఆ మెజారిటీ ఉండాలి. అదివృత్తి క్రీడాకారుల ప్రవేశాన్ని ఖచ్చితంగా ఖండించి వుంది.

ఇది విచారించాల్సిన విషయం. ఈ సంవత్సరాంతానికి మద్రాసులో జరిగే ఆసియా ఛాంపియన్‌షిప్‌తో సహా అన్ని పెద్ద టోర్నమెంట్లలో వృత్తి క్రీడాకారులకి, అవుత్సాహికులకి ప్రవేశంఉంది. ఇద్దరూ కలిసి ఆడ్తారు. అటువంటప్పుడు డేవిస్‌కప్ దేశాలు వృత్తి క్రీడాకారులని అనుమతించకపోవడం ఆశ్చర్యకరమైన విషయం. రిజిస్టర్డ్ ఆటగాళ్ల ప్రవేశం విషయంలో కూడా వారు హృదయపూర్వకంగా వ్యవహరించలేదని అనిపిస్తుంది. నాకు తెలిసినంతవరకూ ఇండియాలో ఏ ఆటగాడూ రిజిస్టర్ చేయులేదనే అనుకుంటాము. అంతర్జాతీయంగా కూడా ఎంతోమంది బహిరంగంగా రిజిస్టర్ చేయలేదు. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన, పోటీలలో యిలాంటి వివక్షతని ప్రదర్శించడం, పాత నిబంధనలనే పట్టుకుని పాకులాడడం సమంజసంకాదు.

వాస్తవ్యంగా ప్రపంచ కీర్తినార్జించిన డేవిస్ కప్ ఆధిక్యత వృత్తిక్రీడాకారులకి ఆటలో ప్రవేశము కల్పించకుంటే దాని విలువని కోల్పోతుంది. ఈ సంవత్సరం పోటీలకి సన్నాహాలు తుది మెరుగులు దిద్దుకుంటున్నాయి కాబట్టి ఎలాంటి పెద్ద మార్పునైనా ప్రవేశపెట్టడం అంతమంచిదికాదు. కానీ వచ్చేఏడు పోటీలు ప్రారంభం అయ్యేనాటికి అయినా డేవిస్‌కప్ దేశాలు వాటి నిర్ణయాన్ని పునఃపరిశీలన జరిపి, అందరు ఆటగాళ్లకీ అవకాశాలు కల్పిస్తాయని ఆశిద్దాం. యోగ్యత, అర్హతలే ఆటలపోటీలలో ప్రవేశానికి కొలబద్దలుగా ఉండాలి కానీ కృత్రిమమైన భేదాలు మాత్రం కాకూడదు.

— కె ఎస్. నరసింహన్

# పుస్తకాలు

తానివల్ల కలిగే ఆనందాన్ని పొందడానికి ప్రతి మానవుడికీ హక్కుంది. ఈ మరో ప్రపంచం అనేది భావన చేసేవాడి అవసరాలను బట్టి రకరకాలుగా ఉంటుంది. ఈ భావనా సృష్టి అంత ముఖ్యమయింది కాబట్టే— 'మరో ప్రపంచం భావన చెయ్యలేనివాడు పాపాత్ముడు. ఉన్న ప్రపంచంతో సంతృప్తిపడ్డవాడు మందబుద్ధి' అనే సూత్రాన్ని సిద్ధాంతీకరించారు, శ్రీ కుటుంబరావు.

ఈ 'మరో ప్రపంచం' నవల 1947 ఆగస్టు 15 ఉదయాన కరాచీ విమాన కేంద్రంలో ప్రారంభమవుతుంది. అక్కడ బయల్దేరిన విమానం టిబెట్‌లో దిగబడిపోయి, బయటి ప్రపంచంతో సంబంధాలు లేని మరో ప్రపంచంలో విహరిస్తుంది. ఊహాతీతమయిన ఈ మరో ప్రపంచంలో శతాబ్దాల పాటు జీవించగలిగే మానవమాత్రులు, వయసును జయించిన సౌందర్యవతులు కనిపిస్తారు. వింత గొలిపే అనేక విశేషాలు మనకి విస్మయాన్ని కలిగిస్తాయి. షాంగ్రిలాలో పలాయనానికి ఉపక్రమించిన మరో ప్రపంచపు యాత్రీకుల కథనం న్యూఢిల్లీ పార్టీలో జరిగిన సంభాషణతో ముగుస్తుంది.

సహజ సుందరమయిన శైలి విమాన యాత్రికులతో పాటు మనల్నీ హాయిగా విహరింపజేస్తుంది. రచన మనకి అలవాటైనదే అయినా, కథావస్తువు సరికొత్తది. కనుకనే, స్వతంత్ర నవలా రచనతో తెనుగునాడుకు ఒరవడి పెట్టిన కుటుంబరావు ఈ అనుసరణకు పూనుకొన్నారు. అనుసరించిన ఆ ఇంగ్లీషు నవల ఏదో కాస్త వెల్లడిస్తే, పాఠకులకు ఇంకా కుతూహలంగా ఉండేది కదా?—

—శివకుమారి

## మానినీ మానసం

(కథలసంపుటి, రచన: శ్రీ యస్. వివేకానంద. ప్రచురణ: వేంకటేశ్వర అండ్ కో, విద్యావిషయక ప్రచారకులు. గుంటూరు—1 కథలు పదమూడు. పేజీలు 164+3. వెల: రూ. 3—50.)

ఈ కథానికల్లో కథలు వ్రాయాలనే రచయిత ప్రయత్నం, తాపత్రయం కనిపిస్తాయి.

కథల్లో ఉన్న వస్తువులు రచయిత రచనావ్యాసంగంలో బాల్యదశకు ప్రతీకలుగా కనిపిస్తాయి. ఇలా జరిగింది అనేభావం కలిగించే కథలు హృదయానికి హత్తుకొంటాయి. ఇలా జరిగితే బాగుణ్ణు అనిపించే తీరు రచయిత ఆకాంక్ష కథలలో కనిపిస్తుంది.

రచయిత అయితే ఎంత హాయిగావుంటుందీ అనే 'భారవి' తపనా, మూర్తివల్ల తిరస్కృత అయిన జానకి, తనకొడుక్కు మూర్తి కూతురునిచ్చి పెళ్లి చేస్తే గొప్పగా వుంటుందనే ఆలోచనా, సరళకు ప్రేమజ్వరం వస్తే ఎంత బేషుగ్గా వుంటుందీ అనే 'అంజి' వాంఛా, ఇంట్లో వాళ్లుపెట్టే కష్టాలకు ప్రతీకారంగా ఆత్మహత్య చేసుకోవాలన్న కోర్కె, పిచ్చిపిల్లతో ప్రేమకథ ఎలా వుంటుందబ్బా అన్న ఊహా, మిలటరీ జీవితంలో రాధ, ప్రకాష్‌కు సన్నిహితంగా వచ్చివచ్చినట్లేవచ్చి, వేరైతే ఏమవుతుందన్న తొందరా, శంకర్ విలాస్‌ను గూర్చి కలలుకనే శాస్త్రి నిజజీవితపు గడబిడా, అర్ధరాత్రి ఆడపిల్ల నా గదిలోకివచ్చి, పేంటూ షరూ వేసుకొంటే హాయిగా వుండదా అనే ఉబలాటమూ, లంచాలు తీసుకొనే రామానుజం, తీసుకొని లంచం తెచ్చిపెట్టిన చిక్కుల్లో చిక్కుకుపోతే, చింతిల్లే హృదయమూ, దొంగబుద్ధివున్న తండ్రి దొంగనునిందించే ధోరణీ, కపటస్వామి సన్నిధిలో సంతానం కోరిన స్త్రీ బ్రతుకునాశనం కాకుండా ప్రాణం తీసిన పాముమీద అభిమానమూ, దానిమ్మచెట్టు ఇంట్లో శారదను కలుసుకోవాలని రచయిత రంగనాథం పొందిన తిప్పలూ, జీతం చాలని జీవితాలు కనే భయంకలబాధలూ, ఈ కథల్లో ఈ రచయిత చెప్పాలను కొన్న సత్యాలు!

రచన ప్రాథమికంగా వుంది, ఇప్పటికి. ముందు ముందు, ఈ రచయిత కలంలోంచి మంచి రచనలు రాకపోతాయా అనిపించే కథల సంపుటి యిది.

కొన్ని కథలు ఛాయామాత్రం వినోదం కలిగిస్తాయి. కొన్ని కథలు గిలిగింతలు పెడతాయి. కొంతవరకు జీవితం చూపిస్తాయి.

పాత్రల సంభాషణలలో, అక్కడక్కడా అంతో ఇంతో నాటకాల ధోరణి కనబడుతుంది.

పుస్తకం, చాలా చక్కగా ముద్రించాలని ప్రకాశకులు విజయవంతమైన కృషి చేశారు.

శ్రీ యస్. వివేకానంద మంచి రచనలు చేయటానికి ఈ కథారచన ఆశీర్వాదం వంటిది.

—మనోరాణి.

## గ్రహణం విడిచింది

రచన: శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి. ఎమెస్కో పాకెట్ బుక్. 160 పేజీలు. వెల రు. 2. ఎం. శేషాచలం అండ్ కో., మద్రాసు, మచిలీపట్నం, సికింద్రాబాద్.

ఒక కొత్త సమస్య—

నాయిక భారతి. పెళ్లయింది. నాలుగేళ్లు తిరక్కుండా తిలకం చెరిగిపోయింది.

మనసు చెదరగొట్టుకోలేదు భారతి. విరాగి కాలేదు. పుట్టింటినిగాని, మెట్టినింటినిగాని ఆడిపోసుకోలేదు. లోకాన్ని నోట్లోవేసుకోలేదు. లోకుల నోట్లో తను పడలేదు.

భర్త ఆర్జించిపోయిన డబ్బుంది. పొంగు అణగని యవ్వనంలో తనుంది. లోకం భారతిని ప్రేమిస్తుందా, లేక ఆమెచేతులో డబ్బుని ప్రేమిస్తుందా? —భారతికి కావలిసింది డబ్బుతో లంకెలేని ప్రేమ. అటువంటి ప్రేమ ఈ లోకంలో లభ్యమా?—

పుట్టింట కనబడలేదు.

మెట్టినింటా కానరాలేదు.

జగదీశ్ తన డబ్బునుగాక తననే ప్రేమిస్తున్నాడనుకుంది. అనుకుని పొరబడింది.

పోనీ— సన్యాసాశ్రమంలో అటువంటి ప్రేమ దొరుకుతుందా?—

ఊహూ — అక్కడా దొరకలేదు.

ఆశ్రమంనించి భారతి మళ్లీ ఇంటిముఖంపట్టింది.

రైలుప్లాట్‌ఫారం మీదికి వచ్చింది. వచ్చివచ్చి, జగదీశ్ దగ్గర ఆగింది.

గ్రహణం విడిచింది!—

భారతి ఒక నిర్ణయానికి వచ్చింది.

చక్కని శైలిలో చకచక నడిచిన ఈనవల విశాలాక్షిగారి లేఖినికి ఒక చక్కటి మచ్చుతునక.

— శివకుమారి

* * *

సచిత్ర పద్యాలు. సోహన్‌లాల్ ద్వివేదీ రచనకి శ్రీ వల్లభనేని కాశీవిశ్వనాథం తెలుగుసేత. ప్రింటింగు అలంకరణ పిల్లల నాకర్షిస్తుంది. వెల రెండు రూపాయిలు. ప్రజా ప్రచురణలు, ఏలూరు.

(అం. ప్ర.)



బందరు జీవితభీమా సంస్థ ఉద్యోగుల నాటకపోటీల్లో ప్రదర్శించిన 'ఇది ఆత్మహత్య' నాటకం రోజున ముఖ్య అతిథులు శ్రీ సి. యస్. రావు, శ్రీమతి రాజులోచనలతోబాటు శ్రీ ఆదివిష్ణు కూడా చిత్రంలో వున్నారు.

Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press: 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad



**ఎంత అందమైన పిల్ల !**
**ఎంత సొగసైన దుస్తులు... యివన్నీ**
**Wintex® వింటెక్స్ బట్టలనుండి**
**తయారైనవి!**

ఆమె ఏ సమయములోనైనా ధరించుటకు వీలైన దుస్తులు
స్కూలుకు వెళ్లుటకు... పార్కులో షికారుపోవుటకు... ఏదో పిక్నిక్‌లకు
వెళ్లుటకు ఎక్కడకు వెడుతున్నా ధరించుటకు బాగుండే దుస్తులు.
నేడు,రేపు లేక భావిలో ఆమె పెద్దదై ఏ పని ఒయ్యారాలు ఒలికే భార్యగా
లేక తల్లిగా అయినపుడు కూడ సొగసుగా కనపడుటకు తగినవి !

• చిన్న పిల్లవాళ్లు (యువకులు కూడ !) వింటెక్స్ షర్టింగులు,
సూటింగులలో తయారైన దుస్తులు ధరించి దర్జాగా కనపడతారు.

వింటెక్స్—మారుతున్న ఫ్యాషను ప్రపంచములో
నేడు మరియు భావికి అనువైన బట్టలు

ఇంకా, ఆకర్షణీయమైన
షర్టులు, ట్రౌజర్లు, ఫ్రాకులు,
సాదావి మరియు ప్రింటు
చీరలు ఫ్రాక్, గౌనులకు
తగిన బట్టలు లభిస్తున్నాయి
ఇవన్నీ నాణ్యమైన
కృత్రిమమైన ఫైబర్సునుండి
చేయబడుతున్నాయి

**వింటెక్స్ మిల్స్**
వింటెక్స్ రోడ్, సూరత్

ఏజెంట్ : మెసర్స్ గోయల్ ట్రేడర్స్ 24/48, గోడౌన్ స్ట్రీట్, మద్రాసు-1.